శ్రీమతే వేంకటేశాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవేంకటేశాష్టోత్తర శతనామావళి - సవ్యాఖ్యానము

## అనువక్తః

పండితరత్న

ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు



శ్రీవేంకటేశాష్టోత్తర శతనామావళి - సవ్యాఖ్యానము

- ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు

ప్రథమముద్రణము - 2007 - సర్వజి

ప్రతులకు:
శ్రీమతి ఈ. జయలక్ష్మి,
18-3-58/7, శాంతినగర్,
కె.టి.రోడ్, తిరుపతి-517 507, ఫోన్- 9885003420

అక్షరయోజనము:
అన్నపూర్ణగ్రాఫిక్స్
53/4 ఆర్.ఎస్. గార్డెన్స్
తిరుపతి. ఫోన్- 0877-2235006

శ్రీమతే వేంకటేశాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవేంకటేశాష్టోత్తర శతనామావళి - సవ్యాఖ్యానము

**అవతారిక**

**శ్రీవేంకటాచలాధీశం శ్రియాధ్యాసితవక్షసమ్ ।**
**శ్రితచేతనమందారం శ్రీనివాస మహం భజే ॥**
**శ్రియఃకాంతాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।**
**శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥**

దైవమనునది లేదను నాస్తికవాదమును చేయుచు, తదనుగుణముగా ప్రచారమును చేయువారు ఆ వాదమునకు విపరీతముగానే ప్రవర్తించుచున్నారనుట జగమెరిగిన సత్యము. ఒకడు ఎంతటివాడైనను, అతనికిగాని, అతని సంతానమునకుగాని దుఃఖములు కల్గినపుడు దైవమునే ప్రార్థించును. ఇది లోకములో అంతట సాధారణమైన విషయము. మన భారతదేశములో జన్మించినవారికి ఈ దైవచింతన అనునది చిరకాలముగా రక్తములో ప్రవహించుచుండుటచే ఎంతగా వలదు అనుకొన్నను వదలని భావమిది. తనకు ఏర్పడిన కష్టమును దైవానుగ్రహముతోనే పోగొట్టుకొనవలయుననునది దృఢమైన సత్యము. అట్లే, మనకు కన్పించుసాధనములు ఎన్ని ఉన్నను. దైవసహాయము లేకపోయినచో, వాని వలన ఏ ఫలమును లభింపదు. ఇది అందఱి అనుభవమునందు పలుమార్లు సంభవించిన, దర్శింపబడిన సత్యము. పురుషార్థములనబడు ఫలములను ధర్మ అర్థ-కామమోక్షములని నాల్గు విధములుగా విజ్ఞులు విభజించిరి. వీనిలో ఏ ఫలము కావలయునన్నను భగవానుని కృపయు, సహాయమును అత్యంతావశ్యకము అనునది శాస్త్రసిద్ధమే కాక, లోకానుభవసిద్ధముకూడ

చతుర్విధపురుషార్థములలో దేనిని కోరనివాడు ఉండుట లోకములో చాలఅరుదు అనుటను ప్రత్యేకముగా చెప్పవలసిన పనిలేదు. కావున ప్రాణులందఱును పరమాత్మ యొక్క అనుగ్రహముకొఱకు ఎదురుచూడవలసియున్నది. భగవదనుగ్రహము స్వభావసిద్ధముగానే అందఱిపట్ల కల్గుటకు అవకాశమున్నను, మనము చేయవలసిన కర్తవ్యములను, (భక్తియోగాదులను) కొన్నిటిని ఆ భగవత్కృప ఎదురు చూచుననుట శాస్త్రములలో తెలుపబడినది. **"సర్వజ్ఞోఽపి హి సర్వేశః సదా కారుణికోఽపి సన్, సంసారతంత్రవాహిత్వాత్ రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే"** అనికదా ప్రమాణము. ఇట్లు కానిచో భగవానునకు పక్షపాతము, దయారాహిత్యము మొదలగు దోషములు అనేకములు సంభవించును. భగవానుని ఆశ్రయించు విధములు అనేకములుగానున్నవి. కృత, త్రేతా, ద్వాపర, కలియుగమునలబడు నాల్గుయుగములలో మొదటి మూడుయుగములలో

తపస్సు, యాగము మొదలగు కఠినములైన మార్గములలో భగవానుని ఆశ్రయించుటవలన ఎట్టిఫలము లభించునో, అది కలియుగములో ఆ భగవానుని నామసంకీర్తనమును చేయుటద్వారా లభించునని మహర్షులు నిర్ధారించిరి. ఈ కలియుగములో ఇంతమాత్రము లఘువగుఉపాయమునుకూడ జనులు చేయుట అరుదు అను భావముతోనే సర్వేశ్వరుడే ఈ ఏర్పాటుకు అంగీకరించియుండునని శాస్త్రవచనము.

భగవానుని రూపములు పర,వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చారూపములని అయిదు విధములు. ఇందు చివరిది అగు అర్చారూపము – ఆలయములందు, మఠములలో, గృహము–మొదలగుచోట్ల బంగారము, వెండి మొదలగు లోహములతో, కొయ్య, మన్ను మొదలగు వానితో చేయబడిన, మిక్కిలి అందమైన బింబములయందును, స్వయం వ్యక్తమూర్తులయందును, శాస్త్రవిధిని అనుసరించి ప్రతిష్ఠను, ఆవాహనాదులును చేసి, పూజింపబడు విగ్రహములే (ఇందుసాల గ్రామశిలయు చేరును). మిగిలిన నాల్గు భగవద్రూపములకంటె ఈ అర్చావతారమే కలియుగములోనున్న అస్మదాదులకు ఆశ్రయించుటకు మిగుల సులభమైనది. మిగిలిన రూపములను పూజించుట కొన్ని సమయములందుమాత్రమే సాధ్యము. అదియును కొంతమందికి మాత్రమే సాధ్యమగును. అర్చారూపము ఆ విధముగాకాక ఎల్లప్పుడు అందఱికిని పూజింపతగిన రీతిలోనుండుట చేతనే శాస్త్ర మీ రూపమునకు అర్చారూపమని పేరు పెట్టినది కాబోలు.

ఈ అర్చామూర్తిని. ప్రతి ఒక్కరు తమ తమ గృహములో నిలుపుకొని, పూజించుట శాస్త్రవిహితము, అత్యంతసులభమును అయినను, దీనినికూడ జనులు ఈ కలికాలములో చేయరని భావించిన భగవానుడు, అతనికి పిమ్మట మహర్షులు, ఆచార్యులు మొదలగు మహనీయులు ప్రతి ఊరిలో అందఱికిని సంబంధించియుండునట్లు దేవాలయములను ఏర్పరచి, అచట ఆరాధనాదులను జరిపినచో, దానివలన అచట నివసించు జనులకు కష్టములు తీరి సుఖింతురని తలచి, అంతట ఆలయములను నిర్మించి, అందు భగవన్మూర్తులను ప్రతిష్ఠించిరి. తాము స్వయముగా పూజాదులను చేయలేనివారును ఆలయములను చేరి, అచట జరుగు పూజలో తామును అన్వయించి, సత్ఫలమును పొందవచ్చును కదా! ఇంతియేకాక రాజుకు, రాజ్యమునకును సమముగా పలు క్షేమములు కూడ ఆలయపూజవలన కల్గునని శాస్త్రములలో తెలుపబడినది.

ఇట్టి ఆలయములలోనున్న అర్చామూర్తులు స్వయంవ్యక్తము, సైద్ధము, దైవము, ఆర్షము, మానుషము – అని పలు విధములు అని అందురు. వీనిలో స్వయంవ్యక్తములనగా ఎవరిచేతను ప్రతిష్ఠచేయబడకుండ, భగవన్మూర్తి తానే స్వయముగా కొందఱు మహానుభావులను అనుగ్రహించుటకొఱకు ఆవిర్భవించినది. మిగిలిన మూర్తులకంటె ఈ స్వయంవ్యక్తమూర్తి మహిమ గొప్పది అని అందురు. (అనగా, మిగిలిన మూర్తులలో భగవానుని సాన్నిధ్యము తక్కువ అని, ఈ మూర్తిలో ఎక్కువ అని



అర్థముకాదు.) భగవత్సాన్నిధ్యము ప్రతిష్ఠ చేయబడిన మూర్తులన్నిటియందు సమానమే అయినను, ఈ స్వయం వ్యక్తస్థలములలో జరుపబడు పూజ మొదలగువానిచే ప్రపంచములో చాల దూరములో నున్నవారికిని మంచి కల్గునని శాస్త్రములలో తెలుపబడిన విషయమని పెద్దలందురు.

వేదములు తెలిపిన రీతిలో యాగములద్వారా (పంచాగ్నులలో) భగవానుని ఆరాధించినచో లోకక్షేమము ఏర్పడునట్లే, ఆగమశాస్త్రములను అనుసరించి పంచాగ్నిరూపమైన భగవానుని బింబములను ఆరాధించుట అనెడి యాగము కూడ ప్రపంచక్షేమమును కల్గించును. ఇది ఈ కాలమునకు అత్యంతావశ్యకములైన అంశములలో ఒకటి.

ఇట్టి స్వయంవ్యక్త క్షేత్రములని ప్రసిద్ధి చెందిన శ్రీవైష్ణవాలయములలో మన భారతదేశమునకే కాక, ప్రపంచమునకే కాక, పూర్వాచార్యుల అభిప్రాయానుసారము అఖండ బ్రహ్మాండమునకే మణివలె శ్రీవేంకటాచలమనబడు తిరుమలలో వేంచేసియున్న శ్రీనివాస భగవానుడు వెల్గుచున్నాడు. ఈ స్వామి దయకు పాత్రుడు కానివాడు ఈ లోకమున కలడా! అనునది సందేహమే. నిత్యసూరులు, దేవతలు, మానవులు అందఱు కోఱి వచ్చి ప్రార్థించు స్వామి ఇతడు. ఇతడు అర్చారూపమున (విగ్రహరూపమున) వేంచేసియున్నను, ఆయా సందర్భములలో ఆవేశాది రూపము పలువురితో సాక్షాత్తుగా సంభాషించి, వారి కష్టములను తీర్చి, వారు కోరిన ఫలములను అనుగ్రహించుట ఈనాటికిని మనకంటికి గోచరించుచున్నది కదా! ఇంతటి ఉన్నతమైన రీతిలో ప్రపంచములోని జనులందఱు ఆశ్రయించు దేవుడు వేఱొకడు కనుపింపడుకదా! ఇంతటి గౌరవమునకు కారణము ఏమనగా – మహర్షుల, (దివ్యసూరులనబడు) ఆళ్వార్ల, పూర్వాచార్యులను మహనీయుల గాఢమైన, భక్తిపూర్వమైన ప్రార్థనకు అంగీకరించి, ఈనాటికిని మిక్కిలి పాపిష్ఠివారిని సైతము రక్షింపదలచి, భగవానుడు ఈ తిరుమలలో సాన్నిధ్యమును కల్గియుండుటయే.

ఇట్టి మహిమనుకల వేంకటేశ్వరుని ఆరాధనలో అర్చాకాలమను ఒక సమయము కలదు. ప్రతివ్యక్తి తానే నేరుగా ఈ భగవన్మూర్తికి అర్చనచేయు అవకాశము లేదు. కావున ఆలయములోని అర్చకులు అర్చనను చేయునపుడు ఆ సేవలో అన్వయింపగోరువారు తామును ఆ సమయములో ఆ గోష్ఠిలో చేరి, దర్శించినపుడే అర్చన చేసిన ఫలము దక్కును. **“పత్రం పుష్పం ఫలం తోయమ్”** అనురీతిలో తులసీపుష్పాదులతో స్వామికి అర్చన చేయబడును. అందు ప్రాతఃకాలమున మొదటిఆరాధనాసమయములో వేంకటేశసహస్రనామావళితో ప్రతిదినము అర్చన చేయబడును. ద్వితీయారాధనా సమయమునందును, సాయంకాలములోని ఆరాధనాసమయమునందును అష్టోత్తరశతనామములతో అర్చన జరుపబడుచున్నది.

ఈ తిరునామములు శ్లోకరూపములో నున్నపుడు శ్రీవేంకటేశసహస్రనామస్తోత్రమని, శ్రీవేంకటేశ అష్టోత్తరశతనామస్తోత్రమని చెప్పబడుచున్నవి. ప్రత్యేక ప్రత్యేకముగా ఈ నామములను గ్రహించి, ప్రణవపూర్వకములుగా చతుర్థీవిభక్త్యంతములుగా, నమః శబ్దోత్తరములుగా ఉచ్చరించినపుడు ఇవి నామావళి అనబడును. అర్చన చేయుకాలములో నామావళియే ఉపయోగింపబడుచున్నది. ప్రతిదినము తప్పకుండ ఆ మూర్తికే సంబంధించిన సహస్రనామముతో పూజాసమయములో అర్చనను చేయుట అనునది పలు ఆలయములలో కన్పడుచున్నది. తిరుమలలో చేయబడు అర్చనలో ఒకొక్క నామముతో వేంకటేశపదమును జోడించి (ఓం వేంకటేశాయనమః, ఓం శేషాద్రినిలయాయ వేంకటేశాయనమః) అని ఈ రీతిలో అర్చనచేయబడుచున్నది.

పైన తెలుపబడిన సహస్రనామసోత్రము, అష్టోత్తరశతనామస్తోత్రమును రెండును వేంకటాచల మాహాత్మ్యములో కలవు. పలు పురాణములలో వేంకటాచలమునకు సంబంధించి తెలుపబడిన అంశములను అన్నిటిని ఒకచోట కూర్చి, వేంకటాచలమాహాత్మ్యమను పేర ఒక గ్రంథము ఇతః పూర్వమే ప్రచురింపబడినది.

పూజాకాలములో భగవానునకు సమర్పింపబడు పలు ఉపచారములలో వాగ్యజ్ఞము అని చెప్పబడిన స్వామి తిరునామములతో అతనిని నోరార పొగడుటయే ఉత్తమైన ఉపచారమని వ్యాసాదిమహర్షులు పల్కిరి. **“కి మేకం దైవతం లోకే కిం వాప్యేకం పరాయణమ్,స్తువంతః కం క మర్చంతః ప్రాప్నుయు ర్మానవా శ్శుభమ్, కో ధర్మ స్సర్వధర్మాణాం భవతః పరమో మతః, కిం జపన్ ముచ్యతే జంతుః జన్మసంసారబంధనాత్”** (అందఱికిని నమస్కరింపతగినది, అన్ని ఫలములను ఇవ్వగల్గినదియును అగు దేవత ఏది? ఏ దేవతను అర్చించినచో మానవులు క్షేమమును పొందుదురు? ధర్మములన్నిటిలో ఏ ధర్మమును మీరు ఉన్నతమైనదిగా భావింతురు! దేనిని జపించినచో సంసారబంధమునుండి ప్రాణి మోక్షమును పొందును?) అని ధర్మపుత్రుడు భీష్ముని ప్రశ్నింపగా, **“జగత్ప్రభుం దేవదేవ మనంతం పురుషోత్తమమ్, స్తువ న్నామసహస్రేణ... ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః, యద్భక్త్యా పుండరీకాక్షం స్తవై రర్చే న్నరః సదా”** (జగత్తునకంతటికి నిర్వాహకుడు, పరమపురుషుడును అగు పురుషోత్తముని ఆ స్వామి సహస్రనామములతో స్తోత్రమును చేసి, అర్చించుటయే గొప్పధర్మము) అని బదులిచ్చిన భీష్ముని అభిప్రాయమును బాగుగా గ్రహించినచో, భగవానుని తిరునామములకును, వానితో చేయు అర్చనలకునుగల ప్రభావము ఎట్టిదో తెలియును. దీనిని అనుసరించియే వేదాంతదేశికులు అభీతిస్తవములో **“రమాదయిత రంగభూరమణ కృష్ణ విష్ణో హరే త్రివిక్రమ జనార్దన త్రియుగనాథ నారాయణ, ఇతీవ శుభదాని యః పఠతి నామధేయాని తే న తస్య యమవశ్యతా నరకపాతభీతిః కుతః”** అని అనుసంధించిరి. భగవన్నామములపట్ల ఆళ్వార్లకుగల ఆదరాతిశయము వాచామగోచరముకదా!



ఇట్టి తిరునామములను, వాని అర్థములను తెలిసికొనకుండ ఉచ్చరించినను ఫలము లభించుట నిశ్చయము. మంత్రములనుగూర్చి తెలుపునపుడు పెద్దలు **“మహారత్నగర్భమైన మాణిక్యపేటిక”** అని పల్కుదురు. అనగా – వెలకట్టుకు వీలులేని ఒక రత్నమును, ఆ విధముగానే అమూల్యమైన మాణిక్యపేటికలో పెట్టినచో ఎట్లుండునో, ఆ విధముగానే మంత్రములోనున్న భగవానుడును అని అర్థము. ఈ విధముగా మంత్రరూపమైన తిరునామములకే పూర్ణప్రభావమున్నను, ఆ తిరునామముల అర్థమును తెలిసికొని, దానిని ఉచ్చరించి అర్చనను చేసినను, ఇతరులు అర్చనను చేయునపుడు ఆ తిరునామములను విన్నను, పఠించినను, అవి సకలవిధఫలములను ఇచ్చును. అర్థములను అనుసంధించినచో దానివలన కల్గు ఆనందము, అనుభవమును మాటలకందనివి కదా! కావున వాని అర్థమును తెలిసికొనుట మిక్కిలి ఆవశ్యకము.

(పూర్వము తెల్పిన రీతిలో మన వేంకటేశ్వరుని సన్నిధిలో అర్చనకాలమున అనుసంధింపబడుచున్న సహస్రనామ అష్టోత్తరశతనామములకు అర్థము తెలుగులో, దేవస్థాన పత్రికాముఖమున వచ్చిన విషయము సర్వవిదితమే. అట్లే ఆంధ్రభాషాభక్తులమనోరథమును పూర్తిచేయకోఱిన భగవానుడు ఈ వ్యాఖ్యా ప్రయత్నమును చేయించెను. యథాశక్తి ఈ నామముల అర్థమును సంగ్రహముగా విన్నపించెదను.



శ్రీమతే వేంకటేశాయ నమః



## శ్రీవేంకటేశాష్టోత్తరశతనామావళి - సవ్యాఖ్యానము

1. **ఓమ్ నమో వేంకటేశాయ శేషాద్రినిలయాయ చ ।
వృషదృగ్గోచరాయాథ విష్ణవే సతతం నమః ॥**

**1) ఓమ్ వేంకటేశాయ శ్రీవేంకటేశాయనమః**

(వేంకటమని కీర్తింపబడు కొండకు ప్రభువువగు శ్రీవేంకటేశ్వరునకు నమస్కారము)

శ్రీవేంకటేశాష్టోత్తరశతనామస్తోత్రము వరాహపురాణములోని మొదటి భాగములో 64వ అధ్యాయముగానున్నది. ఈ స్తుతిలో 50 శ్లోకములున్నవి. వీనిలో పూర్వపీఠిక, చివరలో ఫలశ్రుతి మొత్తము 15 శ్లోకములను తీసివేయగా, మిగిలిన 35 శ్లోకములలో 108 నామములు అమరియున్నవి.

పూర్వము ఒకానొక సమయమున మహర్షులు ఒకటిగా కలసి సూతుడను పౌరాణికుని వద్దకుపోయి, వేంకటాచలప్రభువగు శ్రీనివాసుని ఏ రీతిలో అర్చించినచో అతడు కోరిన ఫలమును త్వరగా అనుగ్రహించునో తెలుపుమని వేడగా, సూతుడు చాలా కాలమునకు ముందు ఆదిశేషునిచే కపిలమహర్షిముఖమున తాను వినినట్లు, ఇది చాల రహస్యమని, ఈ స్తోత్రములోని తిరునామములను ఉపయోగించి ఆకాశగంగలో పూచిన బంగారు తామరపూలతో శ్రీనివాసుని అర్చనచేసి, బ్రహ్మ తాను కోరిన ఫలములను పొందెవని, ఈ తిరునామములతో భగవానుని ప్రార్థించుట ఆ స్వామికి మిక్కిలి సంతోషదాయకమని, ఆయురారోగ్యధనధాన్యాది ఫలములను, ముఖ్యముగా సమీచీన జ్ఞానమును ఇవ్వగల్గినవని, వీనిని రహస్యముగా కాపాడవలెనని భగవానునిపట్ల భక్తిలేనివానికి **"న చ మాం యోఽభ్యసూయతి"** అనినట్లు ఉపదేశింపకూడదని, ఈ స్తోత్రములో ముందు, చివరగల పూర్వపీఠికలో, ఫలశ్రుతిలో తెలిపెను.

ఈ స్తోత్రమునుగాని, నామావళినిగాని చదువునపుడు, అర్చించునపుడును ఋషి, ఛందస్సు, దేవత మొదలగువానిని చెప్పవలెను. వాని క్రమము ఈ విధముగానున్నది.

**"అస్య శ్రీవేంకటేశాష్టోత్తరశతనామస్తోత్రమహామంత్రస్య బ్రహ్మా ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీవేంకటేశో దేవతా, నీలగోక్షీరసంభృత ఇతి బీజమ్, శ్రీనివాస ఇతి శక్తిః, శ్రీవేంకటేశ ఇతి హృదయమ్, అభీష్టసిద్ధ్యర్థే జపే వినియోగః"**

బ్రహ్మాండపురాణములో శ్రీవశిష్ఠమహర్షికి నారదమహర్షికి జరిగిన సంవాదరూపముగానున్న శ్రీవేంకటేశసహస్రనామస్తోత్రములోకూడ **"వేంకటేశః"** అను



నామమే మొదట కలదు. ఈ స్తోత్రమున విష్ణుసహస్రనామ స్తోత్రములోవలె భగవానుని నాములను వరుసగానున్నవి. కాని, అష్టోత్తరశతనామస్తోత్రము మాత్రము ఒక్కొక్క తిరునామము చతుర్థీభక్తితో కూడియేయున్నది. చివర **"నమః"** అను పదమును కలుపుకొని అర్చన చేయుటకొఱకే అవి ఏర్పడినదనునట్లున్నది.

**"శ్రీవేంకటేశః"** అను మొదటి నామమునకు వేంకట మనబడు పర్వతమునకు ప్రభువని అర్థము. **"ఈశావాస్య మిదం సర్వమ్"** అనునట్లు సమస్తచేతనాచేతనములకు అధిపతి అగువాడే ఈ పర్వతమునకు అధిపతి అని చెప్పుటయే ఇచటి తాత్పర్యము. భగవానుడు విశేషమైన అభినివేశముతో ఒక విలక్షణమైన సాన్నిధ్యమును ఈ తిరుమలలో కల్గియుండుటచే ఈ కొండకుగల గొప్పతనము మిక్కిలి ఉన్నతమైనది – అని తెలుపుయే ఈ నామహృదయము అని భావింపవచ్చును. భగవానునిచే, భాగవతులచే అభిలషింపబడి, సేవింపబడిన క్షేత్రముయొక్క గొప్పతనమును **"ఆజగామ ముహూర్తేన యత్ర రామ స్స లక్ష్మణః"** అనుచు వాల్మీకి భగవానుడు అద్వితీయముగా పల్కెను. కావున భగవానునకుగల మహిమ అతడు నివసించు దివ్యదేశమునకు కలదని శాస్త్రముల వచనము. ఈ విషయము వేంకటాచలమహాత్మ్యములోనే – **"యావదుక్తాః భగవతః కల్యాణగుణరాశయః తావంత స్స గిరేః సంతి గుణాః పరమపావనాః, అస్య వేంకటశైలస్య మాహాత్మ్యం యావ దస్తి హి, తావ ద్వక్తుం చ కార్త్స్నేన నసమర్థ శ్చతుర్ముఖః, షణ్ముఖ శ్చ సహస్రాస్యః ఫణీ దేవాః పరే కిము"** (భగవానునకు ఎంతటి ఉన్నతములైన గుణములున్నవో, ఆ అన్ని గుణములు ఈ పర్వతమునకు కలవు. దీని మహిమను పూర్తిగా చతుర్ముఖ బ్రహ్మగాని, ఇంద్రుడుగాని, షణ్ముఖుడుకాని, వేయితలలను కల ఆదిశేషుడుగాని తెలియలేరు) అని చెప్పబడినది. ఈ దృష్టితోనే వేదాంతదేశికులును శ్రీనివాసుని దయను స్తుతించునపుడు దయాశతకములో మొట్టమొదటగా **"ప్రపద్యే తం గిరిం ప్రాయః"** అని ప్రారంభించి ఈ పర్వతమును శరణు పొందిరి కాబోలు.

ఈ పర్వతమునకు చింతామణి, జ్ఞానాద్రి, తీర్థాద్రి పురుషాద్రి, వృషాద్రి, నారాయణాద్రి, సింహాద్రి, అంజనాద్రి, వైకుంఠాద్రి, నీలగిరి, క్రీడాద్రి – అను రీతిలో పలు పేర్లు ఆయా కల్పములలో వ్యవహరింపబడుచున్నవని ఈ నామములన్నియు యోగరూఢములనియు ఈ మహాత్మ్యములోనే ఉన్నది. ఇట్లు వేంకటాద్రి అనెడి తిరునామమును ఈ కొండకు యోగరూఢమే. పురాణము **"వేంకట"** నామమమునకు రెండు రీతులలో అర్థము చెప్పినది. అందు మొదటివ్యుత్పత్తి ఏమనగా

**వోంకారోఽమృతబీజం తు కట మైశ్వర్య ముచ్యతే ।
అమృతైశ్వర్యసంఘత్వాత్ వేంకటాద్రి రితి స్మృతః ॥
వేంకటేతి కృతం నామ పిత్రా తస్య మహాత్మనః ।
అమృతస్యేందిరాయా శ్చ యతో విస్తారకారకః ॥
జీవానాం భారతే వర్షేఽయం గుణనామకః ।          (బ్రహ్మా-1-8,9)**

వేంకటాద్రి అను పదములోని **"వేమ్"** అనెడి అక్షరము అమృతబీజము. (అమృతమనగా మోక్షమని అర్థము) అని, **"కట"** మనగా ఐశ్వర్యమనియు, మోక్షమును ఐశ్వర్యమును ఈ పర్వతమున కలసియుండుటచే దీనికి వేంకటాద్రి అను పేరు వచ్చెననియు భావము. అనగా, మోక్షము ఇచట ప్రత్యేకముగా పరిగణింపబడుటచే ఇచట ఐశ్వర్యమనగా త్రివర్గమనబడు ధర్మార్థకామములను, అపవర్గము, అమృతము ఇత్యాది పదములచే చెప్పబడు మోక్షమును ఈ పర్వతమే ఇవ్వగలదు అని తాత్పర్యము. మఱియు, **"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ"** అని గీతలో చెప్పబడురీతిలో ఇచట అధికారులను గ్రహింపనగును.

ఇట్లు అన్ని విధములైన పురుషార్థములను ఈ కొండ ఇవ్వగలదు అనినచో, దీనికి అధిపతియైన భగవానుడు వీనిని ఇచ్చుననుటలో సందేహములేదుకదా! ఈ అభిప్రాయముతోనే దేశికులు **"అపవర్గ స్త్రివర్గయోః"**, **"సుఖయతి వినతాన్ కటాక్షవిటపైః కరాపచేయఫలైః"**, **"అపవర్గ మకృష్టపచ్య మనుభవతి"**, **"వ్యతిషజః స్వర్గాపవర్గామ్"** అనుచు పలురీతులలో అనుగ్రహించిరి.

ఇంతటి గొప్పతనమును శ్రీనివాసునకు ఈ పర్వత నివాసముయొక్క ప్రభావము చేతనే ఏర్పడినది అని చెప్పుటలోనే పురాణములకు తాత్పర్యమని చెప్పవచ్చును. శ్రీనివాసుడు ఇట్లు వారు వారు కోరిన ఫలములను ఇచ్చువాడైనను, అందు ఒక విశిష్టమైన సామర్థ్యమును ఉపయోగించి, ఆ ఫలములను ఇచ్చును. సామాన్యజనులు త్రివర్గ మనబడు ఐశ్వర్యమును కోరి మొదట వచ్చునపుడు వారుకోరిన ఫలములను ఇచ్చి, వారికి నమ్మికను కల్గించి, పిమ్మట తనయొక్క దివ్యమంగళవిగ్రహములో అతిమోహనరూపమును సాక్షాత్కరింపజేసి, వారికి స్వయముగానే నశ్వరములగు పురుషార్థములలో వెగటును కల్గించి, చివరలో మోక్షమనబడు అమృతమును ఇచ్చును. ఈ అర్థమును వేదాంతదేశికులు దయాశతకములో(39) – **"పరిమితఫలసంగాత్ ప్రాణినః కింపచానాః నిగమవిపణిమధ్యే నిత్యముక్తానుషక్తమ్, ప్రసదన మనుకంపే ప్రాప్తవత్యా భవత్యా వృషగిరినీలం వ్యంజితం నిర్విశంతి"** ఇత్యాది శ్లోకములలో పల్కిరి. ఇట్లు వేంకట మను పదమునకు ఒక విధమైన అర్థము తెలుపబడినది. ఇక రెండవ అర్థము ఏమనగా–

**ఇతి తస్య వరం దత్వా చతుర శ్చతురాననః ।**
**తదా నామ చకారాద్రేః వేంకటాచల ఇత్యపి ॥**
**సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహ ఉచ్యతే ।**
**తస్మా ద్వేంటశైలోఽయం లోకే విఖ్యాతకీర్తిమాన్ ॥**

(భవిష్యోత్తర–2–225,226)

**"వేమ్"** అనెడి అక్షరము సర్వపాపములను తెలుపుచున్నదని, కట మను పదము దహించుట అను అర్థమును తెలుపుచున్నదని, సర్వపాపములను దహించుటచే ఈ కొండకు ఈ



పేరు యోగనామముగా బ్రహ్మచే పెట్టబడినదనియు భవిష్యోత్తరపురాణములోని వేంకటాచల మహాత్మ్యమునందున్నది. బ్రహ్మ ఈ నామమును ఈ పర్వతమునకు పెట్టుటకుగల కారణమును వివరించుటకు మాధవుడను బ్రాహ్మణుని కథ అచట తెలుపబడినది.

మాధవుడనెడి బ్రాహ్మణుడు సర్వవేదవేదాంతశాస్త్రములలో వైదుష్యమును సంపాదించి,సత్ప్రవర్తనతో, గృహస్థాశ్రమధర్మములను అనుష్ఠించుకాలమున విధివశమున కుంతల అనెడి చండాలస్త్రీతో సహవాసము ఏర్పడి, తానుకూడ ఛండాలుడై, చిరకాలము గడిపి, పిమ్మట ఈ పర్వతమునకు వచ్చి, పర్వతమును అధిరోహించునపుడు, అతని పూర్వకృతపాపములన్నియు ఈ పర్వతప్రభావమనెడి అగ్నిచే దహింపబడి, అతడు పవిత్రుడు అగుటను చతుర్ముఖబ్రహ్మ సాక్షాత్కరించి ఈ పర్వతమునకుగల ప్రభావమును గ్రహించి, "ఈ పర్వతమునకు వేంకటాచలమను పేరు కల్గుగాక!" అను వరమును ఇచ్చి, ఆ బ్రాహ్మణునకు "తిరుమలకు పోయి, స్వామి పుష్కరిణిలో స్నానముచేసి, ఈ శరీరమును త్యజింపుము. మరుజన్మలో నారాయణపురములో తొండదేశప్రభువుగా జన్మించి, జగన్మాత అగు మహాలక్ష్మిని పుత్రికగా పొంది, ఆమెను పరమపురుషుడగు శ్రీనివాసునకు కన్యాదానమును చేసి, ఆ పరమపురుషుని అల్లునిగా పొంది, సర్వభోగభాగ్యములను అనుభవించి, చివరగా వైకుంఠమనెడి మోక్షమును పొందుము" అను వరమును అనుగ్రహించి పోయెనని పురాణ వృత్తాంతము. ఈ కథయే బ్రహ్మపురాణములో కొంచెము వ్యత్యాసముతో కన్పించుచున్నది.

ఈ కథనమున, మాధవుని పాపములవలెనే అందఱి పాపములను పోగొట్టు స్వభావము ఈ కొండకు ఉండుటచే దీనిని వేంకటాచలమను పేరు కల్గెనని ఏర్పడుచున్నది. ఇట్లు పూర్వము తెల్పిన మొదటి అర్థమునకును (మోక్షము,ఐశ్వర్యము అనబడు సర్వవిధపురుషార్థములను ఇచ్చునది అను అర్థమునకును) ఈ కథయే మూలము. మాధవునకు మఱుజన్మలో సర్వైశ్వర్యములను, సాక్షాత్ లక్ష్మిదేవినే కూతురుగను, పరమపురుషుని అల్లునిగను పొందు మహాభాగ్యమును, చివరలో మోక్షమును అనుగ్రహించినది ఈ పర్వతమగుటచే **"వోంకారోఽమృత బీజం తు కట మైశ్వర్య ముచ్యతే"** అని పల్కిన రీతిలో సర్వఫలములను అనుగ్రహించుననుటలో అడ్డము లేదుకదా! వేంకటపదము ద్రావిడభాషలో **"వేఙ్గడమ్"** అని మారును. **"కడఙ్గళ్"** అనగా కర్మములు పాపములు. **"వేమ్"** దగ్ధములగును కావున దహింపబడు పాపములను కల్గినది అనియు ఈ పదమునకు నమ్మాళ్వార్ల పాశురమును గొని అర్థము పూర్వాచార్యులచే తెలుపబడినదికూడ.

మఱియు, ఈ పర్వతమునకు కృతయుగములో వృషభాచలమని, త్రేతాయుగములో అంజనాద్రి అని, ద్వాపరయుగములో శేషాచలమని, కలియుగములో

వేంకటాచలమనియు పేర్లు వ్యవహరింపబడునని ఈ భవిష్యోత్తరపురాణములోనే ప్రారంభమున తెలుపబడుటచే, కలియుగములోనున్న మనకు వేంకటాచలమనెడి తిరునామమే మిక్కిలి ఆదరణీయమగుచున్నది. కావున పూర్వోక్తదిశలో ఇంతటి ప్రభావమును కల ఈ వేంకటాచలమునకు అధిపతియగు వేంకటేశ్వరుని నమస్కరించుచున్నాను, ఆస్వామికే నేను దాసుడను - ఇత్యాద్యర్థములను ఈ మొదటి నామమున అనుసంధేయములు.

2) **ఓమ్ శేషాద్రినిలయాయ శ్రీవేంకటేశాయ నమః**

(శేషాద్రి అనబడు పర్వతమును తనకు స్థానముగాకల శ్రీవేంకటేశ్వరునకు నమస్కారము)

తిరుమలకు శేషాద్రి అను ఒక పేరు కలదు. ద్వాపరయుగములో ఈ కొండ శేషాద్రి అని వ్యవహరింపబడునని పూర్వోక్తమే. ఈ పేరు ఈ పర్వతమునకు ఏర్పడిన కారణము బ్రహ్మాండపురాణములోని ద్వితీయాధ్యాయములో తెలుపబడినది.

ఒకానొక సమయమున క్షీరాబ్ధిలోని భగవానుని నారదుడు దర్శింపవలెనని పోయినపుడు, భూలోకములో నేను నివసింపతగిన స్థలమును తెలుపుమని భగవానునిచే ఆజ్ఞాపింపబడెను. ఆ ఋషి అపుడు ఈ సువర్ణముఖి నదీతీరమునుగూర్చి పలుకగా, భగవానుడును ప్రక్కనే ఉన్న ఆదిశేషుని చూచి - "నీవు పర్వతరూపమును పొంది, అచట ఉండుము. నేను సర్వపరిజనులతో కలసి అచటికి వచ్చి విహరించెదను" అని ఆజ్ఞాపించెను ఆదిశేషుడు కూడ పర్వతరూపమును పొంది భగవానుని విహారమునకు తగిన రీతిలో, భాగవతులకు నివసింపతగిన రీతిలో పలు ఉద్యానవసములతో, పలు పుణ్యతీర్థములతో నిండినదైన, ఉన్నతమైన పుణ్యక్షేత్రముగా పరిణమించెను. ఇట్లు "గంగ మొదలగు సకల పుణ్యతీర్థములును నాపై వచ్చి, నివసింపవలెను. ఈ పర్వతములో స్థావరములు, జంగమములు ఏవి నివసించుచున్నవో అవి తమ తమ మనోరథములను పొంది సిద్ధిని పొందునుగాక!" అని ఆదిశేషుడు వరమును ప్రార్థింపగా, దానిని భగవానుడు అపుడే అనుగ్రహించెననియు ఆ పురాణములో కలదు. అందుచే, ఆదిశేషుడే ఈ పర్వతముగా పరిణమించుటచే దీనికి శేషాద్రి అని పేరు వచ్చినది. ఇపుడును దర్శించుటకు సర్పరూపములోనే ఈ పర్వతము కనుపించుచున్నది. ఆ సర్పశిరముయొక్క భాగము శేషాద్రి అని, మధ్యభాగము అహోబిలమని, పుచ్ఛము శ్రీశైలమనియు పెద్దలందురు.

ఇంతియేకాక, బ్రహ్మపురాణములో వేఱొక కథ కలదు. ఒకానొక సమయమున వాయుభగవానునకు, ఆదిశేషునకును పరాక్రమవిషయమున స్పర్ధ ఏర్పడి, దానిని పరీక్షించుటకై ఆదిశేషుడు మేరు పుత్రపర్వతమును తన శరీరముతో చుట్టుకొని, పడగలతో కప్పి, గట్టిగా పట్టుకొనవలెనని, దానిని వాయుదేవుడు తన శక్తితో ఎగురుగొట్టవలెననియు నిర్ణయింపబడినది అపుడు వాయువు తన సంపూర్ణమైన శక్తిని ఉపయోగించినను, ఆ ఆదిశేషునితో కూడిన పర్వతమును కదల్చలేకపోయెను. కాని, లోకములోని



వస్తువులకన్నిటికిని వాయువేగమున ఉపద్రవము ఏర్పడెను. అపుడు దేవతలు ఆదిశేషుని వేడగా అతడు తన తలను కొంచెము పైకి ఎత్తెను. ఆ అవకాశమునుబట్టి వాయువు తన పూర్ణమైన శక్తిని ఉపయోగించి, ఆ పర్వతమును ఆదిశేషునితోపాటు పైకి ఎగురగొట్టి, సువర్ణముఖినదీ తీరములో పడునట్లు చేసెను. ఇది అంతయు భగవానుడు ఈ ప్రాంతమున నివసింపవలెనను సంకల్పముతో సంభవించుటచే, అతడు నేరుగా వచ్చి, ఆదిశేషునిచే చుట్టుకొనిరాబడిన పర్వతములో నివసించసాగెనని, ఆదిశేషుడును ఈ పర్వతమునందు తీర్థరూపములో నివసించుచున్నాడనియు ఈ పురాణకథనము. ఇట్టి ప్రభావమునుకల శేషాద్రియందు నిత్యవాసమును చేయు శ్రీనివాసుని నమస్కరించుచున్నాను - అని ఈ నామముయొక్క భావము. ఈ తిరునామము శ్రీవేంకటేశ్వర సహస్రనామస్తోత్రములో 9వ నామముగానున్నది. **"ఇత్థం శేషాంశజం శైలం శేషేణ పరివేష్ఠితమ్, స్వావాసహేతో ర్హరిణా వాహితం వాయునా ఛలాత్, రాజన్ శేషనిమిత్తేన శేషాచల మిమం విదుః"** (భవిష్యోత్తర) అను ఈ శ్లోకములందు తెలుపబడిన విషయములు ఇచట సంగ్రహింపబడినవి.

3) **ఓమ్ వృషదృగ్గోచరాయ శ్రీవేంకటేశాయ నమః**

(ధర్మమను మనువు కన్నులకు గోచరుడైన శ్రీవేంకటేశునకు నమస్కారము)

వైవస్వతమనువు లోకములను పరిపాలించునపుడు ధర్ముడను మనువు ఈ తిరుమలలోని వరాహస్వామినిగూర్చి విశేషముగా తపస్సుచేసెను. ఈ మనువునకు వృషుడని పేరు. (వృషశబ్దమునకును ధర్మ మనియే పేరు). ఇతడు తపస్సును చేయునపుడు ధర్మము మిక్కిలి అభివృద్ధి చెందినది. పిమ్మట వరాహమూర్తి ప్రత్యక్షమై వచ్చి, "ఓయీ ధర్ముడా! నీవు తపస్సు చేయుటవలన ధర్మము విశేషముగా అభివృద్ధి చెందినది. కావున ఈ పర్వతము వృషాద్రి అనుచు నీ పేరుతో వ్యవహరింపబడగలదు. నీకును లోకపాలకపదవి లభింపగలదు" అని వరమిచ్చెను **"తతః ప్రసన్నో భగవాన్ మహాకాలో మహీయుతః, ధర్మ త్వయా తప స్తప్తం వృష శ్చ వవృధే యతః, తస్మా దయం గిరివరో వృషాభిఖ్యాం గమిష్యతి"** (వామన-22 అధ్యా). అను ఈ శ్లోకములవలన పూర్వము తెల్పిన వృత్తాంతము తెలియుచున్నది. మఱియు, **"వృషదృక్"** అనెడి పదమునకు ధర్మమును కన్నులుగా కలవాడను అర్థమునుకూడ చెప్పవచ్చును. అట్టివారికి ప్రత్యక్షము అగునట్టి శ్రీవేంకటేశునకు నమస్కారము-అని ఈ నామమునకు అర్థమును చెప్పవచ్చును అట్టివారికి ప్రత్యక్షము అగునట్టి శ్రీవేంకటేశునకు నమస్కారము అనియు ఈ నామమునకు అర్థమును చెప్పవచ్చును. మనవంటి మాంసచక్షువులను కలవారిచే భగవానుని దర్శింపవీలు కాదు. ధర్మచక్షువులచే - అనగా విశేషముగా యోగము మొదలగు ధర్మములను అనుష్ఠించి, దానివలన పాపములను పోగొట్టుకొనినవారిచే తమ జ్ఞాననేత్రములతో స్వామిని దర్శింపవీలగును. కావున అతడు ధర్మచక్షుస్సులను కలవారి దృష్టికి విషయమగుచున్నాడు. ఈ నామము వేంకటేశ సహస్రనామములో 922వ నామముగా **"వృషజ్ఞేయాయ నమః"** అనుచు కొంచెము మార్పుతో పఠింపబడుచున్నది.

(4) **ఓమ్ విష్ణవే శ్రీవేంకటేశాయ నమః**
(విష్ణుస్వరూపుడగు శ్రీవేంకటేశునకు నమస్కారము)

ఈ నామము వేంకటేశసహస్రనామములలో 16వ నామముగానున్నది.

శ్రుతిస్మృతిపురాణములందు, వైఖానస - పాంచరాత్రాది భగవచ్ఛాస్త్రములందును భగవానునకు అసాధారణమైనది, వేఱొకరికి చెందనిది అగు అంశము ఏమనగా - సకలచరాచరములలో వ్యాపించి, వానికి అంతరాత్మయై వానిని నియమించుట - అని తెలుపబడినది. ఇట్లు సర్వపదార్థములందు వ్యాపించియుండుటయే ఈ విష్ణునామముయొక్క అర్థము. ఇట్టి వ్యాప్తి **"అగ్ని రవమో దేవానాం విష్ణుః పరమః"** అనుచు వేదము తెలిపిన రీతిలో ఉత్తమదేవతయగు ఆ విష్ణువునకే కలదు. **"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః", "విష్ణుః సర్వేషా మధిపతి", "విశ్వవ్యాపనశీలత్వాత్ విష్ణు రిత్యభిధీయతే"** ఇత్యాది ప్రమాణములు ఈ అర్థమును చక్కగా నిరూపించుచున్నవి. విష్ణుషడక్షరీ అనెడి మంత్రముయొక్క అర్థము, దాని ప్రభావము భగవచ్ఛాస్త్రములలో విరివిగా కాననగును.

**"విష్ణో ర్నామ సహస్రం మే శ్రుణు పాపభయాపహమ్"** అనుచు యుధిష్ఠురునకు భీష్ముడు ఉపదేశించిన సహస్రనామస్తోత్రమునకు విష్ణుసహస్రనామమను పేరు పెట్టబడినది. ఆ స్తోత్రములో భగవానుని మొదటినామము **"విశ్వమ్"** అనునది. దీనికి భగవానుడు సర్వప్రపంచరూపి - అని అర్థము. ఇట్లు సర్వప్రపంచరూపిగా భగవానుడు అగుటకు అతడు విష్ణువైయుండుటయే కారణమను విషయమును విశదీకరించుటచే **"విష్ణుః"** అను రెండవ నామము ఏర్పడినది. అనగా సర్వచరాచరవస్తువులయందును వ్యాపించి, ఆత్మయైయుండుటచే చరాచరవస్తువులన్నియు అతనికి శరీరములగుచున్నవి. కావున సర్వప్రపంచరూపిగా అతడు వెలుగుచున్నాడని భావము. ఇట్టి విశేషమైన మహిమను కల విష్ణువు అనెడి తిరునామమునకు వాచ్యభూతుడగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను అని - ఈ నామతాత్పర్యము.

5) **ఓమ్ సందంజనగిరీశాయ శ్రీవేంకటేశాయ నమః**
(ఉత్తమమైన అంజనాద్రి అధిపతియగు శ్రీవేంకటేశునకు నమస్కారము)

హనుమానుని తల్లి అగు అంజనాదేవి చిరకాలము తపస్సు చేసి, ఆంజనేయుడను పేరును గల హనుమానుని పుత్రునిగా పొందుటచే "అంజనాచల"మనుచు ఈ పర్వతము పిలువబడగలదని బ్రహ్మచే వరము ఇవ్వబడినది. ఇట్లు అంజనాదేవియొక్క మనోరథమును పూర్తిచేయునట్టి వైభవమునుగల పుణ్యక్షేత్రమగు ఈ అంజనాచలప్రభువు అయిన శ్రీవేంకటేశుని నమస్కరింతును. శరణు పొందెదను-అని ఈ నామముయొక్క భావము.

**కృతే వృషాద్రిం వక్ష్యంతి త్రేతాయా మంజనాచలమ్ ।**



**ద్వాపరే శేషశైలేతి కలౌ శ్రీవేంకటాచలమ్ ॥**
**నామాని యుగభేదేన శైలస్యాస్య భవంతి హి ॥** (భవిష్యోత్తర-6వఅధ్యాయ)

అనెడి శ్లోకమునుబట్టి కలియుగమునకు సంబంధించిన శ్రీవేంకటాచలమనెడి పేరుయొక్క ప్రభావము మొదటి నామములోను, ద్వాపరయుగమునకు చెందిన శేషాచలమనెడి పేరుయొక్క మహిమ రెండవనామములోను, కృతయుగమునకు సంబంధించిన వృషాచలమను పేరు ప్రభావమును మూడవ నామమునందును, త్రేతాయుగమునకు చెందిన నామముయొక్క మహిమను అయిదవది అగు ఈ నామమమునందును తెలియనగునని మహర్షుల హృదయము.

అంజనాచలముయొక్క చరిత్రసంగ్రహము బ్రహ్మాండపురాణములో ఈ క్రిందివిధముగా కలదు. కేసరి అనెడి రాజు పుత్రులను పొందగోరి శంకరుని గూర్చి తపస్సు చేసెను. శ్రీశంకరుడు ప్రత్యక్షమై "నీకు పుత్రసంతాన భాగ్యము లేదని బ్రహ్మయొక్క నిర్ణయము. కావున ఉత్తమమైన కుమార్తెను అనుగ్రహించెదను. ఆమె గర్భమున నీవు కోఱిన రీతిలో పుత్రుడు జన్మించును" అని వరమిచ్చెను. ఆ విధముగానే తనకు కల్గిన పుత్రికకు అంజన అను పేరుగుపెట్టి, మిక్కిలి గారాబముగా పెంచుచుండెను. ఆమెకు యుక్తవయస్సు రాగానే కేసరి అను వానరప్రభువు ఆమెను వివాహమాడెను. చాలకాలము వారికి పుత్రోత్పత్తి కలుగలేదు. అంత మిక్కిలి బాధపడిన అంజనాదేవిని ధర్మదేవత కోయవనితరూపమున వచ్చి సమాధానపఱచి, వేంకటాద్రిలో ఏడువేల ఏండ్లు తపస్సును చేసినచో, ఆమె కోఱినరీతిలో ఉత్తమపుత్రుడు జన్మించునని పల్కెను. అంజనాదేవియు ఆ విధముగా వేంకటాద్రిపై వాయువునుగూర్చి చిరకాలము తపస్సు చేసెను. చివరకు ఆ వాయుదేవుని అనుగ్రహముతో పురుషసంయోగములేకుండగనే గర్భమును దాల్చి, ఉత్తమపుత్రుడగు ఆంజనేయుడను పేరును గల హనుమానుని కుమారునిగా పొందెను. జన్మించిన పిమ్మట ఆ కుమారుడు చేసిన వీరకృత్యములకు మెచ్చి, దేవతలు పలు వరములను అతనికి ఇచ్చిరి. అపుడు బ్రహ్మ అంజనాదేవికి

**"అంజనే త్వం హి శేషాద్రే తప స్తప్త్వా సుదారుణమ్ ।**
**పుత్రం సూతవతీ యస్మాత్ లోకత్రయహితాయ వై ॥**
**ప్రసిద్ధం యాతు శైలోఽయం అంజనే నామత స్తవ ।**
**అంజనాచల ఇత్యేవ నాత్ర కార్యా విచారణా ॥** (బ్రహ్మాండే -5వ అధ్యాయే)

అంజనాదేవీ! నీవు చిరకాలము మిక్కిలి కఠినమైన తపస్సును చేసి, సర్వలోకక్షేమము కొఱకు ఉత్తమపుత్రుని ఈ కొండపై పొందుటచే నీ పేరుతోనే అంజనాచలమని. ఈ కొండపిలువబడగలదు - అని వరమిచ్చెనని పురాణవృత్తాంతము.

అంజనాచలమను పదమునకు వేఱొకవిధముగాకూడ అర్థమును చెప్పుదురు. **"వాయో రావేశనా చ్చైవం ప్రాహు రంజనసంజ్ఞకమ్"** (బ్రహ్మపురాణే-1 అధ్యాయే)

వాయుదేవుడు ప్రవేశించి, ఈ పర్వతమును తీసికొని వచ్చుటచే దీనికి అంజనా చలమని పేరు వచ్చినది – అనెడి పైన ఉదహరింపబడిన బ్రహ్మపురాణవచనము ఈ అర్థమునకు ప్రమాణము. **"శేషాద్రినిలయాయ"** అనెడి రెండవ నామమునందు తెలిపిన రీతిలో వాయువునకును, ఆదిశేషునకును ఏర్పడిన స్పర్ధలో మేరుపుత్రుడగు ఈ పర్వతమును వాయుదేవుడు తన బలముతో ఇచటకు ఎగురుగొట్టి, తీసికొనివచ్చుటచే వాయుదేవుని ఆవేశము ఈ పర్వతములో ఏర్పడినది కావున ఈ కొండకు అంజనాచలమను పేరు కల్గినదట. **"అంజ"** అనెడి ధాతువు గత్యర్థకముకూడ. ఆ గతి ఈ కొండయందు వ్యాపించుటచే, అట్టి వాయువు యొక్క గతికి విషయమగుటచే దీనికి అంజనాచలమను పేరుకల్గినది అని పెద్దలు ఈ నామమునకు నిరుక్తిని చెప్పుదురు.

**(6) ఓమ్ వృషాద్రిపతయే శ్రీవేంకటేశాయ నమః**

(వృషపర్వతమునకు అధిపతియగు శ్రీవేంకటేశునకు నమస్కారము)

ఈ పర్వతమునకు వృషాద్రి అను పేరు ఏర్పడుటకు పురాణములలో తెలుపబడిన కారణము మూడవనామము వ్యాఖ్యానములో వివరింపబడినది. "వృష"డను మనువు ఈ కొండయందు తపస్సు చేసి, సిద్ధిపొందెను. కావున ఈ కొండకు అతని పేరు మీదనే కృతయుగములో ప్రసిద్ధి ఏర్పడినట్లు అచట చెప్పబడినది. ఇట్లు అతడు సిద్ధిని పొందుటకు ఈ పర్వతమనెడి దివ్యక్షేత్రముయొక్క ప్రభావమే కారణము. ధర్మస్వరూపమే పర్వతముగా మూర్తీభవించినది. కావున ఇది ధర్మక్షేత్రమగుటచే ఇందు తపస్సుచేసిన కాలమున విశేషముగా ధర్మములకు అభివృద్ధి ఏర్పడినది అని, అతడును (మనువును) సిద్ధిని పొందెనని, దీనికంతటికిని ఈ క్షేత్రప్రభావమే కారణమనియు ఈ నామములో సూచింపబడినది.

ఆయాక్షేత్రముల మహిమవలన అచటనున్నవారికికూడ ధర్మబుద్ధి కలుగుననుటను, భూమిలో కప్పబడియున్న విక్రమాదిత్యుని సింహాసనమున్నచోట కూర్చున్న సమయమున పశువుల కాపరికి కల్గిన ధర్మబుద్ధినిబట్టి తెలిసికొనవచ్చును. ఇట్లే, **"ధర్మక్షేత్రే"** అనుచు ధృతరాష్ట్రుడు సంజయుని ప్రశ్నించునపుడు "కురుక్షేత్రము మిక్కిలి గొప్పధర్మక్షేత్రము కావున, ఆ క్షేత్రమహిమచే అచట యుద్ధము చేయవలెనని కలసిన నా కుమారులకు బుద్ధికి కల్గిన మార్పు యుద్ధమును నిలుపురీతిలో మంచిబుద్ధి కల్గినదా!" అనెడి అభిప్రాయముతోనే అడుగుచున్నాడు అనుచు **"ధర్మక్షేత్రే"** అను పదమునకు విశేషార్థమును పెద్దలు చెప్పుదురు. శ్రీ వేదాంతదేశికులును ఏదో ఒక కారణమును ముందుంచుకొని ఈ వృషపర్వతప్రాంతములో నివసించువారియొక్క, శ్రీనివాసుని కృపతో అంతిమస్మృతి ఏర్పడి, సద్గతిని పొందుచున్నాడు అని? దయాశతకములో తెలిపిరి.

అంతియేకాక, ఈ పర్వతమే ధర్మరూపియగు భగవానుని శరీరము అనుటను **"మలైయే తిరువుడమ్బాయ్"** అనుచు పెద్దలు నుడివిరి. కావున ఈ కొండను కాలితో



స్పృశించుటకు దివ్యసూరులు, ఆచార్యులును భీతిల్లిరి అని ఐతిహ్యము తెలుపుచున్నవి. ఈ ఐతిహ్యములను ఋజువు చేయుచున్నట్లు శ్రీవేంకటేశసహస్రనామములోని 923వ నామము **"వృషాచలాయ నమః"** అని కలదు. భగవానునకే వృషాచలమను పేరు కలదనుట ఆ నామమువలను ఏర్పడుచున్నది. ఇట్లు పలురీతులలో ధర్మస్వరూపమైయున్న ఈ పర్వతమున కధిపతియగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను అని ఈ నామముయొక్క భావము.

**7. ఓమ్ మేరుపుత్రగిరీశాయ శ్రీవేంకటేశాయ నమః**

(మేరుపర్వతమునకు పుత్రుడగు శ్రీవేంకటాచలమునకు అధిపతి అయిన శ్రీవేంకటేశునకు నమస్కారము)

పూర్వము రెండవ నామములో ఈ పర్వతమునకు శేషాచలమను పేరు ఏర్పడుటకు గల కారణమును వివరించు సమయమున ఉట్టంకింపబడిన పౌరాణికగాథ ఇచటను అనుసంధేయమే. ఆదిశేషునకు, వాయుదేవునకును ఏర్పడిన స్పర్ధలో మేరుపుత్రుడగు ఈ పర్వతము ఆ మేరుపర్వతముయొక్క సమీపములోనుండి భగవానుని సంకల్పముచే వాయుభగవానునివలన ఆదిశేషునితోకూడ చేరి, ఇచట సువర్ణముఖి తీరమునకు ఎగురుగొట్టబడినది. ఇట్టి ఈ పర్వతములో భకుల్తను అనుగ్రహించుటకొఱకు భగవానుడు నిత్యవాసము చేయుచున్నాడు. ఈ పర్వతమును మేరుపుత్రుడని పల్కుటచే, మేరుపుకుకల ఆభిజాత్యము, సర్వపర్వతశ్రేష్ఠత్వము మొదలగు అనేకగుణములు ఈ కొండకును కలవు అని సూచింపబడినది. మేరుపుయొక్క మహిమ పురాణాదులయందు విశదముగా వర్ణింపబడినది.

**(8) ఓమ్ సరస్స్వామితటీజుషే శ్రీవేంకటేశాయ నమః**

(లోకములోని అన్ని సరస్సులకు స్వామియై వెల్గు స్వామిపుష్కరిణీతీరమున నివసించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

తిరుమలలో భగవానుని సన్నిధికి ప్రక్కనేగల పుష్కరిణికి స్వామి పుష్కరిణి అని పేరు. ఈ పుష్కరిణికిగల గొప్పతనము పలు పురాణములలో పలు రీతులలో వర్ణింపబడినది. దీనిని శ్రీవేంకటాచలమాహాత్మ్యములో చక్కగా తెలియవచ్చు. లోకములోనున్న పుణ్యతీర్థములకును ఇది స్వామియై, (అధిపతియై) వెలుగుటచే ఇది స్వామిపుష్కరిణి అనబడుచున్నది.

**ధనుర్మాసే సితే పక్షే ద్వాదశ్యా మరుణోదయే ।**
**ఆయాంతి సర్వతీర్థాని స్వామిపుష్కరిణీతటే ॥**

అనుచు పురాణములో తెలుపబడినరీతితో మార్గశిర (ధనుః) మాసము శుక్లపక్షద్వాదశి నాడు అరుణోదయకాలమున ఈ భారతభూమిలోనున్న సర్వపుణ్యతీర్థములును ఈ స్వామి

పుష్కరిణిలో వచ్చి, చేరును. కావున దీని మహిమ చాల ఉన్నతమైనది. అన్ని పుణ్యతీర్థములును తమకు పరిశుద్ధత ఏర్పడుటకొఱకు ఈ పుష్కరిణిలో వచ్చి కొంతకాలము నివసించుననియు పురాణములలో తెలుపబడినది.

**మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్ ।**
**స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే ॥**

అను పురాణసూక్తినిబట్టి సాక్షాత్తు శ్రియఃపతియగు పరమపురుషుడు వైకుంఠమును వీడి ఈ స్వామిపుష్కరిణీతీరములో మహాలక్ష్మితోపాటు విహరించుచున్నాడనగా, ఈ పుష్కరిణియొక్క మహిమ వర్ణింపవీలుగునా?

మఱియు, స్వామిపుష్కరిణి అనుటకు ఈ పుష్కరిణిలో భక్తితో స్నానము చేయువారికి వారి వారి కోరికలనుబట్టి వారి పరాధీనత్వమును పోగొట్టి, స్వామిత్వము కల్గించుటచేతను స్వామి పుష్కరిణి అను పేరు ప్రకాశించుచున్నది అని భగవానుడే ఒక విలక్షణమైన వ్యుత్పత్తిని తెలిపి, దీని మహిమను వ్యక్తముచేసెనని వరాహపురాణము 6వ అధ్యాయములో–

**యే కేచన సమాగత్య స్నానం కుర్వంతి సంయతాః ।**
**స్వామిపుష్కరిణీతీర్థే స్వామిత్వం ప్రాప్నుయు ర్నరాః ॥**
**స్వార్థి తేషాం పరాధీనభావలేశః కదాపి న ।**
**వ్యుత్పత్తిః కథితా తస్యాః తీర్థానాం స్వామినీ యతః ॥**
**స్వామిపుష్కరిణీత్యేవ తస్మా త్పూర్వం పురాతనైః ।**
**ప్రోక్తేదానీం భగవతా వ్యుత్పత్తిః తస్య సమ్మతా ।**
**స్వామిత్వస్య ప్రదానాచ్చ స్వామిపుష్కరిణీ త్వియమ్ ॥**

అనుచు కోల్పోయిన రాజ్యమును స్వామిపుష్కరిణీస్నానమువలన తిరిగి పొందిన శంఖణ మహారాజుచరిత్రలోగల వచనములవలన స్పష్టమగుచున్నది.

మఱియు, స్వామియొక్క పుష్కరిణి అనియు ఇచట అర్థమును చెప్పవచ్చును. లోకములకన్నిటికిని నిరుపాధికుడైన స్వామి శ్రీనివాసుడొక్కడే కావున, స్వామి అనినచో ఆ భగవానునితప్ప వేఱెవ్వరిని తెలుపుటకు వీలులేదు. అందుచే, అతని పుష్కరిణి అనినచో, సాక్షాత్తు శ్రీపాదసంబంధమును పొంది, వైకుంఠములో వెలుగు విరజ అనెడి నదియే ఇచట తిరుమలలో శ్రీనివాసుని పాదసన్నిధి క్రింద ప్రవహించుచు, ఇట్లు స్వామిపుష్కరిణి రూపమున ఏర్పడియున్నదని సంప్రదాయజ్ఞులగు పెద్దల సుద్ది. ఈ పుష్కరిణిలో స్నానము చేయలేనివాడు ఈ తిరునామమును ఉచ్చరించినచో సర్వపాపములును నశించును–అని పురాణములలో పలు రీతులలో పొగడబడినది. ఇంతటి మహిమనుకల్గిన స్వామిపుష్కరిణీ తీరమున లోకసంరక్షణార్థము నిత్యసాన్నిధ్యమును అంగీకరించియున్న శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈ నామభావము.



9. **ఓమ్ కుమారాకల్పసేవ్యాయ శ్రీవేంకటేశాయ నమః**

(సుబ్రహ్మణ్యుడనబడు కుమారస్వామిచే ఈ కల్పాంతమువరకు సేవింపబడుచున్న శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

దేవసేనానియగు కుమారస్వామి తారకాసురుని వధించుటచే తనకు కల్గిన బ్రహ్మహత్యాపాతకము పోవుటకై, తన తండ్రియగు శివుని ఉపాయమును ప్రార్థింపగా, అతడు శ్రీవేంకటేశాష్టాక్షరీ మంత్రమును ఉపదేశించి, "వేంకటాచలపర్వతముపైగల కుమార ధారాతీర్థములలో స్నానముచేసి, ఈ మంత్రమును జపించుచు తపస్సు చేయు" మని ఉపదేశింపగా, అతని ఆజ్ఞను అనుసరించి కుమారస్వామి ఈ కొండపై గల కుమారధారాతీర్థము తీరమున నియమముతో తపస్సును చేసెను. అపుడు అతడు కోరిన రీతిలోనే శ్రీనివాసుడు ప్రత్యక్షమై, అతనికి వరములను ఇచ్చి, "ఈ కల్పాంతమువరకు ఇచటనే నన్ను పూజించుచు నీవు నివసింపుము. నీ నామముతోనే ఈ తీర్థమునకు పేరు ఏర్పడగలదు." అని పల్కి, అతనిని తన హస్తముతో స్పృశించెను. ఆ విధముగానే ఈనాటికిని కుమారస్వామిచే పూజింపబడు శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను – అని ఈ నామము యొక్క అర్థము. ఈ వేంకటేశాష్టోత్తరములోని మొదటి తిరునామముమొదలు ఒక రీతిలో వరుసగా వామనపురాణమునుండి ప్రారంభించి చెప్పబడు కథలను అనుసరించియే యుండుటచే, ఈ **"కుమారాకల్పసేవ్యాయ"** అనెడి ఈ నామమునకుకూడ పైన గల తిరునామములు వరుసగా వామనపురాణమునే అనుసరించి, ఏర్పడినవి అనదగును. కనుక, ఈ తిరునామములో వామనపురాణము 21వ అధ్యాయమునుండి ప్రారంభించి చెప్పబడు కథను అనుసరించుటయే తగును. ఈ కథ మార్కండేయపురాణములోని 4వ అధ్యాయములో కూడ కలదు. అచట సుబ్రహ్మణ్యస్వామి తపస్సును చేయుటకుముందు కూడ ఈ తీర్థమునకు కుమారతీర్థము అను పేరు కలదు. దానిని కారణము ఏమనగా ఒక వృద్ధుడు ఈ తీర్థములో స్నానము చేయగానే కుమారుడై ప్రకాశించెను అని వేఱొక చోట చెప్పబడియున్నది. మాశి (మాఘ) మాసము పూర్ణమి తిథియందు భగవానుడు ఇచట అవతరించుటచే, ఆనాడు ఈ తీర్థమునకు మహిమ అధికము.

(10) **ఓమ్ వజ్రిదృగ్విషయాయ శ్రీవేంకటేశాయ నమః**

(వజ్రాయుధమును దాల్చిన దేవేంద్రుని కన్నులకు ప్రత్యక్షమైన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

ఈ నామములో అనుసంధేయమైన కథకూడ వామనపురాణములో 23వ అధ్యాయములోనున్నది.

దేవేంద్రుడు గౌతమమహర్షి పత్ని అహల్య విషయమున అపచారమును చేసినపుడు, ఆ మహర్షి ఇంద్రుని "ఒకయోనికొఱకు ఆశపడిన నీ ఒడలంతయు వేయి యోనులు కలుగుగాక!" అని శపించెను. ఇట్లు తన శరీరమంతట యోనులు ఏర్పడగా,

దానివలన మిక్కిలి సిగ్గు చెంది, ఇంద్రుడు మేరుపర్వతములోని బ్రహ్మసరస్సులో తామరల సమూహమున దాగియుండెను. దేవతలు, ఇంద్రాణి మొదలగువారును దేవగురువగు బృహస్పతి సహాయముతో ఇంద్రుడున్నచోటును తెలిసికొని, అతనిని పిలిచి బయటకు తీసికొనివచ్చిరి. అతడును తాను చేసినపనికి చాల లజ్జించి, ఏదియో సమాధానమును చెప్పెను. వాస్తవమును గ్రహించిన బృహస్పతి ఆ వేయి యోనిచిహ్నములు పురుషావయవములుగా మాఱు ఉపాయమును చేసెను. ఇట్లు శరీరమంతయు పురుషచిహ్నము ఏర్పడిన ఇంద్రుని ఇంద్రాణి, మిగిలిన దేవతాస్త్రీలును, మిక్కిలి కామముతో కొంతకాలము అనుభవించిన పిమ్మట, ఆ సుఖమందు విరక్తికల్గిన ఇంద్రుడు తన వికారరూపమును పోగొట్టుకొనుటకై ఈ వేంకటాచలములోని విష్వక్సేనతీర్థమునకుక్రింద వజ్రాయుధముతో భూమిని తవ్వి, పాతాళమునుండి తీర్థమును తీసికొనివచ్చి, అందు స్నానమును చేసెను. చిరకాలము అచట తపస్సు కావించెను. అనంతరము వరాహరూపియైన స్వామి ప్రత్యక్షమై, వరములను ప్రార్థింపుమని పలుకగా, ఇంద్రుడు తన కేర్పడిన ఈ వికారరూపము పోయి, నిజరూపమును కలుగవలెనని కోరెను. స్వామియు అట్లే అనుగ్రహించెను. వెంటనే ఇంద్రుని శరీరమునుండి వేయి పురుషచిహ్నములు రాలి భూమిపై పడెను. అవి రాలిపోగానే, అవి వేదవేత్తలగు బ్రాహ్మణులుగా మారి, "ఓయీ ఇంద్రా! మేము ఇంద్రాణితో భోగమును ఆశించి, తపస్సు చేసి, తత్ఫలముగా నీ దేహములో పురుషచిహ్నముల రూపమును పొంది, మా ఆశను తీర్చుకొంటిమి. నీకు ఏమైన వరము నిచ్చెదము, కోరుకొనుము" అని పలుకగా, దేవేంద్రుడును ఈ వేయివ్రణములు వేయికన్నులుగా మారవలెనను వరమును అడిగెను. వారును అట్లే అనుగ్రహించిరి. అపుడు దేవేంద్రుడు సహస్రాక్షుడై తన నివాసమును చేరెను – అను ఈ కథ ఇచట స్మరింపతగినది. దీని వలన **"భీషాస్మా దగ్ని శ్చేంద్ర శ్చ"** అని వేదము పల్కినరీతిలో సర్వదేవతలకు సార్వభౌముడగు శ్రీనివాసుడే పరతత్త్వమని తెలియుచున్నది. ఇట్లు దేవేంద్రునకు ప్రత్యక్షమై, వరమిచ్చి, శ్రీవేంకటేశుని శరణము పొందెదను – అని ఈ నామముయొక్క అర్థము.

11. **ఓమ్ సువర్చలాసుతన్యస్తసైనాపత్యభరాయ శ్రీవేంకటేశాయ నమః**

(సువర్చలాకుమారుడగు విష్వక్సేనునకు ఇచ్చిన సేనాధిపత్యమును కల శ్రీవేంకటేశుని శరణు పొందెదను)

వామనపురాణములోని 21వ, 22వ అధ్యాయములలో చెప్పబడిన కథను అనుసరించి దీనికిముందున్న నామము ఏర్పడినది. 23వ అధ్యాయములోగల కథను ప్రస్తుతనామము జ్ఞప్తికి తెచ్చుచున్నది. మఱియు, విష్వక్సేనుల ప్రస్తావము ముందు నామములలో వచ్చినది. ఇందు ఆ మహనీయుల చరిత్ర ప్రతిపాదింపబడుచున్నది.



కృతయుగములో కుంతల అను అప్సరస దుర్వాసమహర్షి శాపమువలన వీరబాహువనెడి వ్యాధునకు సువర్చల అను పేరుతో కుమార్తెగా జన్మించెను. ఒకనాడు ఆమె ఋతుస్నాతయై, నర్మదానదీతీరమున సంచరించునపుడు వరుణుడు ఆమెయందు ఆసక్తుడై, ఆమెతో సంగమించి, ఆమెకు సర్వలక్షణసంపన్నుడైన ఒక కుమారుడు కలుగునట్లు అనుగ్రహించెను. పిమ్మట ఆడి (ఆషాఢ) మాసము పుష్యమీనక్షత్రములో సువర్చలకు మిక్కిలి బలశాలి, సకలలక్షణోపేతుడైన కుమారుడు జన్మించెను. ఆ బాలునకు పదిసంవత్సరముల వయస్సులో తల్లి మరణించెను. అనంతరము కశ్యపమహర్షిని శరణు పొంది, ఆయన అనుగ్రహముతో వేదవేదాంతాదివిద్యలను పొందిన ఆ బాలుడు ఈ వృషభాచలములో 12 సంవత్సరముల కాలము తపస్సును చేసి, ఆశ్వయుజమాసమున పూర్వాషాఢానక్షత్రములో భగవదనుగ్రహమును పొంది, తన్మహిమవలన భగవత్సారూప్యమును – అనగా చతుర్భుజత్వము, శంఖచక్రాధిఆయుధధారిత్వమును పొందెను. భగవానునిచే సైన్యాధిపత్యమున నియమింపబడిన అతడు ఈ నారాయణగిరికి నైఋతిదిశలో సర్వపరివారజనములును పరివేష్ఠింపబడగా వచ్చెను. ఇట్లు సువర్చలాకుమారుడగు విష్వక్సేనునకు చతుర్దశభువనముల నిర్వహణభారమును అప్పగించిన శ్రీవేంకటేశ్వరుని శరణు పొందుచున్నాను – అని ఈ నామముయొక్క తాత్పర్యము.

12. **ఓమ్ రామాయ శ్రీవేంకటేశాయ నమః**

(దశరథపుత్రుడు, రాముడును అగు శ్రీవేంకటేశ్వరునకు నమస్కారము)

ఇది వేంకటేశసహస్రస్తోత్రములో 198వ నామముగా ఉన్నది. దశరథచక్రవర్తి తనకు పుత్రసంతానప్రాప్తి కలుగవలెనని ఈ కొండపై శ్రీనివాసుని గూర్చి తపస్సును చేసి, భగవానుని సాక్షాత్కరింపచేసికొని, నాల్గు శ్లోకములతో స్వామిని కీర్తించెను. శ్రీనివాసుని అంశలగు నల్గురు పుత్రులను అతడు పొందెను – అని వరాహపురాణములోని 50వ అధ్యాయములో ఉన్నది. అట్లే, భవిష్యోత్తరపురాణములోని 4వ అధ్యాయమునందును కలదు.

**కౌసల్యా కీటకగృహం తింత్రిణీ దశదిగ్రథః ।**
**గిరిరూపోఽనుజ స్సాక్షాత్ అయోధ్యాభూ దధిత్యకా ।**
**ఇత్థం రామావతారేణ సమాం క్రీడా మకల్పయత్ ॥**

అను శ్లోకములనుబట్టి ఈ రామావతారరూపమే శ్రీనివాసుడగు అర్చావతారరూపమును పొందెనని తెలియుచున్నది. భగవానుడు వేంచేసియున్న పుట్ట కౌసల్య అని, చింతచెట్టు దశరథుడని, శేషాచలమను ఈ పర్వతము లక్ష్మణుడని, ఈ పర్వతప్రాంతము అయోధ్యా పట్టణమని, శ్రీరాముడే శ్రీవేంకటేశ్వరుడుగా అవతరించెనని పై శ్లోకమువలన స్పష్టము. ఇట్లు శ్రీనివాసుని శ్రీరామావతారస్వరూపిగా అనుసంధించినచో, శ్రీరామావతారములో

**"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥**

అనుచు శ్రీరామచంద్రుడు పల్కినట్లు, శరణాగతుని కాపాడుట అనెడి గుణము శ్రీనివాసుని యందు పరిపూర్ణముగా కలదు అని తెలియనగును. ఈనాటికిని ఈ కొండలరాయని శరణుపొంది, తాము తాము కోరిన ఫలములను పొంది, ఆనందించు జనుల సంఖ్య అసంఖ్యాకము కదా! ఇట్లు శ్రీరామస్వరూపియైన శ్రీవేంకటేశుని శరణు పొందెదని ఈనామ తాత్పర్యము.

13. **ఓమ్ పద్మనాభాయ శ్రీవేంకటేశాయ నమః**

(చతుర్ముఖునకు ఉత్పత్తి స్థానమైన తామరపూవును నాభియందు కల శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

దశరథునకు వరమును అనుగ్రహించిన శ్రీనివాసుని ఈ తిరుమలలో సాన్నిధ్యము చేసి, భక్తజనులకు సర్వాభీష్టములను అనుగ్రహింపవలెనని చతుర్ముఖుడు ప్రార్థించినట్లుగా వరాహపురాణములో కలదు. ఇట్లు చతుర్ముఖప్రస్తావము పూర్వనామములో వచ్చినది. లోకములనన్నిటిని సృష్టించు ఆ చతుర్ముఖుడును ఈ శ్రీనివాసునిచే సృష్టింపబడినవాడని ఈ నామముచే తెలుపబడుచున్నది. పరమపురుషుని నాభీకమలమునుండి తామరపుష్పము ఉద్భవించెనని, అందుండి బ్రహ్మ పుట్టెనని **"స్వపతః తస్య దేవస్య పద్మం సూర్యసమప్రభమ్, నాభ్యాం వినిఃసృత మభూ త్తత్రోత్పన్నః ప్రజాపతిః "** (మహాభారత - శాంతి) అను మొదలగు పలు ప్రమాణములచే ఏర్పడుచున్నది. కావున త్రిమూర్తులు ముగ్గురు సమానులు అనునది ప్రమాణసమ్మతముకాదనుట ఈ నామమువలనను వ్యక్తము. ఇట్లు **"జన్మా ద్యస్య యతః"** (ఈ సర్వప్రపంచముయొక్క ఉత్పత్తి మొదలగునవి బ్రహ్మవలన కల్గినవి) అను బ్రహ్మసూత్రములో తెలిపిన రీతిలో సర్వప్రపంచమునకును కారణమైన బ్రహ్మమే శ్రీవేంకటేశ్వరుడు - అని సిద్ధించుచున్నది. అట్టి శ్రీవేంకటేశుని శరణు పొందెదను - అని ఈ నామతాత్పర్యము.

14. **ఓమ్ సదా వాయుస్తుతాయ శ్రీవేంకటేశాయ నమః**

(ఎల్లప్పుడు వాయుదేవునిచే స్తుతింపబడుచున్న శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

వామనపురాణములోని 23వ అధ్యాయమునగల కథను అనుసరించియున్న నామము పూర్వము వ్యాఖ్యానింపబడినది ఈ నామము ఆ పురాణములోనే 24వ అధ్యాయములోని కథను అనుసరించి వచ్చినది. ఈ శేషాచలములో వాయుదేవుడు వేయి సంవత్సరముల కాలము ఉగ్రమైన తపస్సు చేసెను. చివరకు భగవానుడు గరుడారూఢుడై, దేవేరులతోపాటు ప్రత్యక్షమై వచ్చి, సేవను ప్రసాదించెను. అపుడు కల్గిన సంతోషమువలన వాయుదేవుడు ఒడలు మఱచి 64 శ్లోకములతో అందముగా స్వామిని స్తుతించెను. ఈ స్తోత్రము భగవద్గీతలో విభూత్యధ్యాయములో, విశ్వరూపాధ్యాయములో



చెప్పబడిన విషయములనే ఇంచుమించుగా అట్టి శబ్దముల ప్రయోగముతో తెలుపుటచే, దీనిని పెద్దలు వాయుగీత అనియు అందురు. సర్వవేదాంతార్థములు ఇమిడియున్న ఈ స్తుతి అత్యద్భుతమైనది. ఇట్లు 64 శ్లోకములతో స్తుతించినపిదప భగవానుడు వాయుదేవుని వరమును వేడుమనెను. వాయువపుడు తనకు ఏ వరమును వలదని, భగవత్సాన్నిధ్యమే తనకు అపేక్షితమని పల్కెను. పిమ్మట భగవానుడు వాయువుచే చెప్పబడిన స్తోత్రమును ఎవడు పఠించునో అతని ఇహలోక, పరలోక సుఖములన్నియు సిద్ధించునని అనుగ్రహించెను - అను ఈ కథ అచట కలదు. ఇట్లు మహాభక్తుడగు వాయుదేవునిచే ఉన్నత వేదాంతార్థములను వర్ణించు వాయుగీతలో స్తుతింపబడిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని ఈ నామతాత్పర్యము.

15. **ఓమ్ త్యక్తవైకుంఠలోకాయ శ్రీవేంకటేశాయ నమః**

(వైకుంఠమును విడిచి వచ్చిన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

16. **ఓమ్ గిరికుంజవిహారిణే శ్రీవేంకటేశాయ నమః**

(వేంకటాచలములోని లతామండపములో విహరించు శ్రీ వేంకటేశుని శరణు పొందుచున్నాను.

ఈ రెండు నామములనుచేర్చి వివరించుట యుక్తము. వీనిలోని మొదటినామమునందు పరమపురుషుడు శ్రీవైకుంఠమును వీడెనని తెలుపబడినది. అట్లు వైకుంఠమును విడుచుట ఈ తిరుమలలో నివసింపవలెనను కోరికచే సంభవించినది. కావున ఆ వైకుంఠముకంటె ఈ తిరుమలలో మిక్కిలి అందమైన గొప్పవనములలో నివసించుచున్నాడని రెండవ నామములో చెప్పబడినది. అందుచే రెండును కలిపి అనుభవించుట యుక్తము.

**మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్ ।**
**స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే ॥**
**నారాయణస్య దేవస్య వైకుంఠపురవాసినః ।**
**సూర్యవైకుంఠనాకేభ్యః ప్రియోఽయం వేంకటాచలః ॥** (వరాహ 64 అ)
**సువర్ణముఖరీతీరే కశ్చి దస్తి మహీధరః ।**
**వేంకటాచలనామాసౌ సర్వభూభృత్కులోత్తమః ॥**
**అతిప్రీతి ర్మహావిష్ణో స్తత్ర వేంకటభూధరే ।**
**శ్వేతద్వీపా చ్చ వైకుంఠాత్ భానుమండలమధ్యతః ॥**(గరుడ-63 అ)

ఇత్యాదిగాకల పలుపురాణవచనములలో పరమపురుషునకు శ్రీవైకుంఠము, సూర్యమండలము, శ్వేతద్వీపము మొదలగు స్థలములకంటె ఈ తిరుమలయే మిక్కిలి ఇష్టమైన చోటు కావున ఇచట భగవానుడు నిత్యవాసము చేయుచున్నాడు - అని చెప్పబడినది.

భగవానుడు వైకుంఠమును విడచి, ఇచటకు వచ్చెననగా, శ్రీవైకుంఠములో భగవానుడు లేడు అని, ఇచటనే ఉన్నాడను తాత్పర్యమును గ్రహింపరాదు. ఒకే సమయమున వైకుంఠమునందు, ఈ పర్వతమునందు సాన్నిధ్యమును పొందలేనివాడు కాదుకదా స్వామి! శ్రీవైకుంఠమువలె ఈ పర్వతముకూడ మిక్కిలి ఉన్నతమైన పుణ్యక్షేత్రమని, భగవానునకు అభిమతమైన స్థలమనియు, ఇందు భగవానుడు నిత్యసాన్నిధ్యమును పొందును అనియు, దీనికి భూలోకవైకుంఠము అని పేరు తగునను తాత్పర్యమే ఇచట గ్రాహ్యము. లేనిచో, అనేకశాస్త్రవచనములకు అప్రామాణ్యము ఏర్పడును.

17. **ఓమ్ హరిచందనగోత్రేంద్రస్వామినే వేంకటేశాయ నమః**
(హరిచందనవృక్షములో నిండిన పర్వతశ్రేష్ఠమగు వేంకటాచలమునకు ప్రభువైన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

తిరుమలలో హరిచందన మనబడు గొప్పచందన వృక్షములు ఈనాటికిని వేలాదిగా ఉన్నవి. ఇట్టి చందనవనమున చల్లదనమునకు, సువాసనకును లోటులేదు. **"కుందమందార మాకందహరిచందనచందనే"** అని పద్మపురాణము తెల్పుచున్నది. ఇట్లు చందనవృక్షములు ఈ పర్వతముపై ఉన్నవి అనునది సాధారణమైన అర్థము వేఱొక అర్థము ఏమనగా హరిచందనమనునది అయిదు విధములైన కల్పవృక్షములలో చివరిది అగు హరిచందనమను కల్పవృక్షమును తెలుపును. ఈ పర్వతముపైనున్న వృక్షములన్నియు హరిచందనమనబడు కల్పవృక్షములే. కల్పవృక్షముయొక్క స్వభావము ఏమనగా – ఎవరెవరు ఏమేమి కోఱినను వారికి ఆ ఫలమును ఇచ్చుటయే. అందుచే ఈ కొండపైగల వృక్షలతాదులన్నియు భక్తులుకోరిన ఫలములను అన్నిటిని ఇవ్వగల శక్తిని కల్గినవి. ఇవి అన్నియు భగవానుని సంకల్పముచే ఏర్పడినవి. ఈ పర్వతముపైగల చెట్లు, లతలు కోరిన ఫలములను ఇచ్చును అనగా, ఈ పర్వతమునకు ప్రభువగు శ్రీనివాసుని ఔదార్యగుణమునుగూర్చి చెప్పవలసిన అవసరమున్నదా? ఈనాటికిని ఈ పర్వతముపైనున్న పలువిధవృక్షములను పలు పలు ఫలములను కోఱి పలువురు పలురీతులలో పూజించుటను ప్రత్యక్షముగా చూడనగును.

ఇంతియేకాక, **"హరిచందన శ్చాసౌ గోత్రేంద్రస్వామీ చ"** అను విగ్రహమును చెప్పినచో, శ్రీనివాసుడు హరిచందరూపిగా, పర్వతశ్రేష్ఠమునకు ప్రభువుగానున్నాడు అను అర్థము స్ఫురించును. అపుడు **"శ్రీరంగరాజహరిచందనయోగదృశ్యామ్", "సుఖయతు నిజచ్ఛాయాదాయీ స్వయం హరిచందనః", "కలశజలధికన్యావల్లరీకల్పశాఖీ"** ఇత్యాదిగా దేశికులు పల్కినట్లు శ్రీనివాసుడే సర్వఫలములను అనుగ్రహించు, ఉత్తమమైన ఛాయయై (ఆశ్రయ భూతుడై) వెలుగుటచే హరిచందన మగుచున్నాడు (కల్పవృక్షమగుచున్నాడు). **"విష్ణుః పర్వతానా మధిపతిః"** అనుచు వేదము పల్కినట్లు పర్వతములకు భగవానుడే అధిదేవత కావున **"గోత్రేంద్రాణాంస్వామీ"** (పర్వతశ్రేష్ఠములకు యజమాని) అనెడి



అర్థముకూడ ఇచట అనుసంధేయము. కావున శ్రుతిసంప్రదాయములలో సిద్ధమైన అర్థమును ఇచట వివక్షిత మని పెద్దలందురు.

(18. **ఓమ్ శంఖరాజన్యనేత్రాబ్జవిషయాయ శ్రీవేంకటేశాయ నమః**
(శంఖుడను ప్రభువుయొక్క తామరపుష్పమువంటి కన్నులకు ప్రత్యక్షమై, సేవను అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

వామనపురాణములో 31వ అధ్యాయము మొదలు పలు అధ్యాములలో శంఖరాజుయొక్క కథ విస్తృతముగా చెప్పబడినది. హేహయకులములోని శ్రుతుడను ప్రభువునకు శంఖుడను కుమారుడు కలిగెను. అతడు ప్రహ్లాదునివలె జన్మమొదలు విష్ణుభక్తిని కల్గినవాడైయుండెను. రాజ్యాభిషిక్తుడైన పిదప అతడు భగవానుని సాక్షాత్తు దర్శింపవలెనని ఆశపడి, అనేకయాగములను వేలాదిగా, సదక్షిణగా నిర్వహించెను. అయినను భగవత్సాక్షాత్కారము అతనికి లభింపకపోవుటచే మిక్కిలి బాధపడెను. అపుడు భగవానుడు అశరీరివాక్కుతో అతనిని "నారాయణాద్రి అనబడు వేంకటాచలములో స్వామి పుష్కరిణీతీరములో వేయిసంవత్సరముల కాలము తపస్సు చేయుము. చివరకు అగస్త్యమహర్షి అచటకు వచ్చినపుడు నీ కోఱిక తీరగలదు" అని నియమించెను. శంఖరాజును అట్లే ఈ పర్వతముపై స్వామి పుష్కరిణీ తీరమున వేయివర్షముల కాలము తపస్సు చేసెను. అతని తపస్సు ముగియునపుడు అగస్త్యమహర్షితోపాటు పలువురు మునులు, దేవలోకమునుండి వచ్చిన బృహస్పతి, శుక్రాచార్యులు, ఉపరిచరవసువు, శ్వేతద్వీపనివాసులగు పురుషులును భగవానుడు అచటి అవతరింపబోవుచున్నాడని తెలిసి, అచటి వచ్చి చేరిరి. పిమ్మట అందఱును మూడు దినములు వ్రతమును అనుష్ఠింపగా నాల్గవనాడు సాక్షాత్తు భగవానుడు ఆవిర్భవించెను. అప్పటి భగవానుని సౌందర్యము మొదలగు గుణములు, అగస్త్యాదులు ప్రత్యేకముగా చేసిన స్తోత్రములును పురాణములో విస్తరముగా తెలుపబడినవి. అనంతరము శంఖమహారాజును చూచి స్వామి "నీ కేమి వరము కావలెనో కోరుకొనుము" అని పల్కెను. అపుడు శంఖరాజు

**"త్వల్లోకం ప్రాప్తు మిచ్ఛామి త్వత్ప్రసాదా దధోక్షజ ।**
**నాన్య దిచ్ఛామి దేవేశ త్వత్తః ప్రాప్తుం సురేశ్వర ॥**

"నీ లోకములో నిత్యవాసమునే నేను అభిలషించునది. వేఱేమియువలదు" అని వరమడిగెను. అతడట్లువరమును అడుగగా భగవానుడు నవ్వి అతనితో –

**యావత్కల్పం మహాభాగ స్వర్లోకే నివసిష్యసి ।**
**సదా సంపూజిత స్సర్వైః ఇంద్రలోకనివాసిభిః ॥**

"ఈ కల్పము పూర్తి అగునంతవరకు నీవు స్వర్గములోకములో అచటనున్నవారిచే పూజింపబడినవాడవై సుఖముగా నుందువు" అని వరమిచ్చెను. శంఖరాజు అడిగినది మోక్షము. భగవానుడు ఇచ్చినది స్వర్గము. మోక్షమునకు శాస్త్రములలో చెప్పిన ప్రకారము

విధింపబడిన భక్తి, ప్రపత్తి ఉపాయమని, అవి లేనపుడు మోక్షము సిద్ధింపదని, అతడు చేసిన ప్రయత్నమునకు స్వర్గమే ఫలమనియును భగవానుడు నవ్వినందులకు తాత్పర్యము కావచ్చును. కావున ఆ శాస్త్రార్థ మిచట తెలుపబడినది. ఇట్లు శంఖమహారాజుయొక్క నేత్రములకు సాక్షాత్తుగా సేవను అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈ నామముయొక్క భావము

19. **ఓమ్ వసూపరిచరత్రాత్రే శ్రీవేంకటేశాయ నమః**
(ఉపరిచరమనువును కాపాడిన శ్రీవేంకటేశునకు నమస్కారము)

దీనికి ముందునామములోని శంఖరాజు చరిత్రలో బృహస్పతి, శుక్రాచార్యులు అను వీరితో ఉపచరిచరవసువు తిరుమలలో శంఖరాజు తపస్సుచేయు స్వామి పుష్కరిణీతీరమునకు, భగవానుడచట ఆవిర్భవింపబోవు వృత్తాంతమును తెలిసికొనివచ్చి చేరెను – అను వామనపురాణము 32వ అధ్యాయములోనున్న వృత్తాంతము ప్రస్తావింపబడినది. గొప్ప కృష్ణభక్తుడగు ఉపరిచరవసువు యొక్క చరిత్రము (వామన పురాణములో 32వ అధ్యాయములో వివరముగా తెలుపబడినది) ఈ నామములో వివరముగా అనుసంధింపబడినది. ఆ వృత్తాంతము ఇట్లున్నది.

పూర్వకాలమున చేదిదేశమును ఉపరిచరుడను రాజు పాలించుచుండెను. అతడు గొప్ప విష్ణుభక్తుడుగా, ధర్మిష్ఠుడుగానుండెను. ఒకానొక సమయమున ఇంద్రుడు మొదలగు దేవతలు, ఋషులు ఆ ప్రభువువద్దకు కొన్ని ధర్మములను అడిగి తెలిసికొనవలెనని వచ్చిరి. అతడు వారికి సత్కరించి, వారు వచ్చిన కార్యమేమి అని ప్రశ్నింపగా, వారును యాగములో పశువును హవిస్సుగా సమర్పించుట తగునా? లేక ఓషధి ద్రవ్యములను సమర్పించుట తగునా? ఏది శాస్త్రసమ్మతము?" అని ప్రశ్నించిరి. దీనిలో దేవతల పక్షమేమి? ఋషుల పక్షమేది? అని రాజు అడుగా, పశువును సమర్పింపవలెననునది దేవతల పక్షమని, ఓషధి పక్షము ఋషులది అని పల్కిరి. దానిని వినినరాజు, ఋషులకంటె దేవతలు ముఖ్యమైనవారు, వారిని తృప్తిపఱచుటయే శాస్త్రసమ్మతము అని దేవతల పక్షమును ఆదరించి, నిర్ణయించెను. దానిని వినిన ఋషులు చాలా కోపించి, రాజును చూచి, నీవు నిర్ణయించిన పక్షము శాస్త్రసమ్మతము కాకున్నచో ఈ క్షణమే ఘోరమైన నరకముతో సమానమైన పాతాళమున పడెదవుగాక! అట్లుకాక, నీవు పల్కినది శాస్త్రసమ్మతమై, మేము పల్కినది శాస్త్రసమ్మతమే కాకున్నచో మేము ఆ లోకములో పడెదముగాక! అని శపించిరి. వెంటనే ఉపరిచరవసువు పాతాళలోకములోనికి పడెను. ఒక పక్షమునందు పక్షపాతమును చూపి, నిర్ణయముచేసెను. కావున అతనికి ఈ గతి పట్టినది. అతడు ఆ నరకములో పడినను మిక్కిలి కృష్ణభక్తిని కలవాడై, ఎల్లప్పుడు ఆ పరమాత్మనే ధ్యానించుచుండెను. విష్ణువు అతని భక్తికి మెచ్చి, అతనిని కాపాడి అతని – పదవిని అతనికి అనుగ్రహింపదలచెను. ఈ సమయమున, పాతాళలోకములోనున్న



అసురులు పూర్వకాలద్వేషమును మనస్సునుంచుకొని, విష్ణుభక్తుడగు ఆ ఉపరిచరవసువును మిక్కిలి బాధింపసాగిరి. అనేకవిధములైన ఆయుధములలో కొట్టిరి. అపుడు శ్రీకృష్ణభగవానుడు తన సుదర్శన చక్రమును ప్రయోగించి, ఆ అసురులను వధించెను. పిమ్మట తన వాహనమగు గరుడుని పంపి, ఆరాజును పాతాళలోకమునుండి తిరిగి రప్పించి, అతని రాజ్యములోనికి చేర్చుమని ఆజ్ఞాపించెను. గరుడుడు పాతాళలోకమునకు వెడలి, ఆ ప్రభువుతో తన వాహనమగు గరుడుని పంపి, ఉపరిచరవసుంవును పాతాళలోకమునుండి తిరిగి రప్పించి, అతని రాజ్యములోనికి చేర్చుమని అజ్ఞాపించెను. గరుడుడు పాతాళలోకమునకు వెడలి, ఆ ప్రభువుతో తన వీపుపై అతనిని ఎక్కించుకొని రమ్మని భగవానుడాజ్ఞాపించెనని తెలిపెను. అపుడు ఉపరిచరవసువు, భగవానుడు మాత్రమే కూర్చొనదగిన గరుడునిపై తాను అధిరోహించుట తగదని పలుకగా, గరుడుడు ఆ రాజును తన చేతులతో మోసికొని, ఆ పాతాళమునుండి తీసికొనివచ్చి, అతని రాజ్యములోనికి చెర్చెను. ఆ ఉపరిచరవసువే, శంఖరాజు తిరుమలలో భగవానుని సాక్షాత్కరింపచేసికొనినపుడు బృహస్పతి, శుక్రాచార్యులు, అగస్త్యుడు మొదలగువారితోపాటు వచ్చి, శ్రీనివాసుని సేవించి, భగవానుడు అంతర్ధానమైన పిదప ఆ స్వామిపుష్కరిణీ తీరములోనే ద్వాదశాక్షరీ మంత్రమును జపించుచు చిరకాలము భగవానుని ఆరాధించెను. ఈ చరిత్ర వామనపురాణము 40వ అధ్యాయమునందున్నది. ఇట్లు మహాభాగవతుడగు ఉపరిచరవసువును కాపాడిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను–అని ఈ నామముయొక్క అర్థము. భగవానునిపట్ల నిష్కపటమైన భక్తిని కలవారిని స్వామి చేయివిడువక, కాపాడును – అను శాస్త్రార్థము ఈ వృత్తాంతమున నిరూపింపబడినది.

(20) **ఓమ్ శ్రీకృష్ణాయ వేంకటేశాయ నమః**
(శ్రీ కృష్ణరూపియైన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

పూర్వనామములో ఉపరిచరవసువు శ్రీకృష్ణుని ధ్యానించినట్లు పురాణములందలి పలు అధ్యాయములలోని పలు చోట్ల శ్రీకృష్ణనామము పేర్కొనబడినది. కావున ఆ శ్రీకృష్ణుడు ఎవరో కాదు, సాక్షాత్తు వేంకటేశుడే–అను అర్థము ఈ నామమున తెలుపబడినది. మఱియు, శ్రీవైష్ణవాచార్యుల సంప్రదాయానుసారము శ్రీరంగనాథుని రామునిగా, శ్రీవేంకటేశ్వరుని కృష్ణునిగా, కంచిలోని వరదరాజస్వామిని రామకృష్ణోభయరూపిగా భావించుట ప్రసిద్ధము. దీనిని అనుసరించియే దేశికులు **"కణ్ణనడియిణై యెమక్కు క్కాట్టుమ్ వెఱ్పు"** అనుచు నుడివిరి. మఱియు, భవిష్యోత్తరపురాణములోని 4వ అధ్యాయములో దేవకీదేవి ఈ తిరుమలలో పుట్టగా, వసుదేవుడు చింతచెట్టుగా, బలరాముడు ఈ శేషాచలముగా, మధురాపట్టణమే ఈ పర్వతచరియగా, యమునానది స్వామి పుష్కరిణిగా, గోపకన్యలు ఈ పర్వతములోని పశువక్ష్యాదులుగా, శ్రీకృష్ణుడు శ్రీవేంకటేశుడుగా ఆవిర్భవించిరని చెప్పబడినది. ఇట్లు పలు కారణములవలన శ్రీవేంకటేశుడు శ్రీకృష్ణుడుగా

ఆవిర్భవించెననుట తగినదే, మఱియు, **"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** అని గీతలో ద్వాపరయుగములో పల్కుటను నిరూపించుటకై, అనంతరయుగమగు కలియుగములో - **"కలౌ వేంకటనాయకః"** అని పొగడునట్లు విశేషమైన వైభవముతో ఆయుగమునకు తగినట్లు అర్చాసమాధిలో ఆ శ్రీకృష్ణుడే ఇట్లు అవతరించెనని తలచుట మిక్కిలి యుక్తము. ఇట్టి శ్రీకృష్ణుని శరణుపొందుచున్నాను - అని ఈ నామ భావము.

21. **ఓమ్ అబ్ధికన్యాపరిష్వక్తవక్షసే శ్రీవేంకటేశాయ నమః**

(సముద్రుని పుత్రిక అగు మహాలక్ష్మిచే ఆలింగనము చేసికొనబడిన వక్షఃస్థలమును కల శ్రీవేంకటేశునకు నమస్కారము)

ముందునామములో భవిష్యోత్తరపురాణములోని 4వ అధ్యాయములో శ్రీవేంకటేశుని శ్రీకృష్ణునిగా భావించుటకుగల కారణము తెలుపబడినట్లు గ్రహించితిమి. ఆ పురాణములోనే ఆ అధ్యాయమునకు ముందు, వెనుక శ్రీపద్మావతీ వివాహవృత్తాంతము విస్తృతముగా వర్ణింపబడినది. అందువలన ప్రస్తుతనామము ఆ వృత్తాంతమును స్మరింపజేయుచున్నది.

ఒకానొక సమయమున పరదైవము ఎవరు - అను విషయమున మహర్షులమధ్య ఏర్పడిన సంశయమును తీర్చుటకై భృగుమహర్షి చతుర్ముఖ బ్రహ్మ, ఈశ్వరులను పరీక్షించి, చివరకు శ్రీమన్నారాయణుని పరీక్షింపగోరి తన పాదముతో ఆ స్వామి వక్షస్సులో తన్నెను. వెంటనే పరమపురుషుడు ఆఋషిపాదమును పట్టుకొని, "మిక్కిలి కఠినమైన నా వక్షస్సులో తన్నినపుడు నీ మృదువగు పాదమునకు ఎంతటి నెప్పి ఏర్పడినదోకదా!" అని బాధపడి, పలు ఉపచారములను చేసెను. భృగుమహర్షికూడ, శుద్ధసత్త్వస్వరూపుడగు నారాయణుడే పరతత్త్వమని నిర్ణయించెను. ఆ సమయములో మహాలక్ష్మీదేవి స్వామి వద్దనే ఉండెను. తనకు స్థానమైన భగవానుని వక్షఃస్థలమును భృగువు తన్నుటకు స్వామి సహించియుండుటను తాళలేకపోయిన లక్ష్మీదేవి, జనుల క్షేమముకొఱకు తాను, తన ప్రభువును భూలోకములో పద్మావతిగా, శ్రీవేంకటేశునిగా అవతరింపగోరి కరవీరపురమునకు వెడలెను. భగవానుడును చిరకాలము పుట్టలోనుండి తపస్సుచేసిన పిమ్మట బయటకు వచ్చి, వరాహస్వామినుండి చోటును సంపాదించి ఈ తిరుమలలో నిత్యవాసము చేయుచు మహాలక్ష్మిని తిరిగి పొందుటకు, అశరీరవాణి ఆజ్ఞప్రకారము సువర్ణముఖీనదీతీరములోగల తిరుచ్చుకనూరులోని ఒక సరస్సును నిర్మించి, అందు స్వర్ణతామరపుష్పములను ఉత్పత్తిచేసి, ఆ సరోవరతీరమున సూర్యనారాయణుని ప్రతిష్ఠించి, బంగారుతామరపూలతో అర్చన చేయుచు 12సం॥లకాలము మహాలక్ష్మిని ఉద్దేశించి తపస్సు చేసెను. కొంతకాలమైన పిదప కార్తికమాసము శుక్లపక్ష పంచమీ తిథియందు ఉత్తరాషాఢా నక్షత్రములో శ్రీమహాలక్ష్మి ఆ పద్మసరోవరములోని



తామరపుష్పమునుండి అవతరించి, చేతిలో కలువపూలమాలను దాల్చి, దేవతలందఱు దర్శించుచుండగా, శ్రీనివాసుని కంఠసీమను ఆ మాలతో అలంకరించి, అతని వక్షః స్థలమును చేరెను. స్వామిని ఆలింగనము చేసికొనిన లక్ష్మి **"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱలర్ మేల్మజ్జైయుఱై మార్బా"** అని కీర్తించురీతిలో అమరియుండెను. ఈ విధముగా లక్ష్మీదేవితో నిత్యయోగమును ఏర్పడినందువలననే మహాపరాధులగు చేతనులు పరమపురుషుడగు శ్రీనివాసుని దయకు పాత్రులై, వారు కోరిన ఫలములను ఈ కలియుగములో పొందగల్గుచున్నారు. ఇట్లు మహాలక్ష్మిచే ఆలింగనము చేసికొనబడిన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను - అని ఈ నామ భావము.

ఇంతియేకాక, పూర్వనామములో శ్రీకృష్ణుని స్మరించి, ఈ తిరునామములో రాముని స్మరించుచున్నట్లును చెప్పవచ్చును. ఖరవధమును చేసిన పిమ్మట బాణములచే గాయపడి, అనేకవ్రణములతో తిరిగివచ్చిన రాముని సీతాదేవి **"తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్, బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే"** అనుచు వాల్మీకి పల్కినరీతిలో గాఢాలింగనమును చేసికొని, అతని వ్రణములను నయముచేసెను. దీనికి స్మరించుచు ఈ నామము ఏర్పడినదనియు చెప్పవచ్చును. లేక, విష్ణుపురాణానుసారము **"వశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః"** అనునట్లు క్షీరాబ్ధిమథనసమయములో ఆవిర్భవించి, లక్ష్మీదేవి భగవానుని వక్షఃస్థలమును చేరిన చరిత్ర మిచట అనుసంధేయమనియు చెప్పనగును.

22. **ఓమ్ వేంకటాయ వేంకటేశాయ నమః**

(అన్ని కర్మలను పోగొట్టి, ఉత్తమపురుషార్థమును ఇచ్చు శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

పూర్వనామములో పరమపురుషునకు లక్ష్మీదేవిసంబంధము కల్గిన విధము తెలుపబడినది. ఈ తిరునామములో ఆ లక్ష్మీదేవియొక్క సంబంధముచే భగవానునకు ఏర్పడు విశేషములు తెలుపబడుచున్నవి. పరమపురుషుడు సకలపురుషార్థములను అనుగ్రహించుట, ముముక్షువుల సర్వకర్మలను తొలగించుటయు పిరాట్టి (లక్ష్మీదేవియొక్క) పురుషకారముచేతనే - అనికదా మన సిద్ధాంతము. వేంకటశబ్దము తిరుమలను తెలుపునపుడు, అందలి అర్థవిశేషము మొదటినామ వివరణములో తెలుపబడినది. ప్రకృతమున, ఈ పదము శ్రీనివాసునే సాక్షాత్తుగానే చెప్పును, కావున ఆతనికే ఇది నామము అగును అని వివరింపబడుచున్నది. **"మలైయే తిరువుడమ్బాయ్"** అనురీతిలో తిరుమలయే సాక్షాత్తు భగవానుని దివ్యమంగళవిగ్రహమే అని పెద్దల భావన కావున, పర్వతములోని గుణములన్నియు భగవానునియందును ఉద్భావించుటలో ఎట్టి దోషమును లేదు. అందుచే పర్వతమువలన భగవానునకు అతిశయము, భగవానుని వలన పర్వతమునకు అతిశయమును కలుగుచున్నపనులలో సందేహము లేదు. మొదటి

నామములో తిరుమలకుగల మహిమలను తెలిపి, దానికి అధిపతి అను క్రమమున భగవానుని అనుభవించితిమి. ఇచట భగవానునకు గల అతిశయమును కీర్తించి, తన్మూలమున పర్వతమునకు మహిమ ఏర్పడుచున్నదను విషయమును గ్రహించెదము. వేంకటపదమునకు – **"వేఙ్గడఙ్గళ్ మెయ్‌మేల్ విన్సైముగ్ర్రావుమ్ తాఙ్గళ్‌తఙ్గట్కు నల్లనవే శెయ్‌వార్, వేఙ్గడత్తుత్తైవార్‌క్కు నమ వెన్నలా ఙ్కడమై అదు శుమన్దార్ కట్కే"** (తిరువా–3–3–6) అను తిరువాయ్‌మొళ్రి పాశురములో సర్వపాపములను పోగొట్ట గల్గినది (**"కడఙ్గళ్"**–అనగా–ఋణమువలె ప్రతిబంధకములగు కర్మలు–అని అర్థము. **"వేమ్"** దగ్ధమగును) అను అర్థమును వ్యాఖ్యాతలు తెలిపిరి. ఈ స్వభావము భగవానునకే బాగుగా తగియున్నది. కావున వేఙ్కడమనుచు అతనిని నిర్దేశించుటయే యుక్తము. అట్లే

**ఓంకారోఽమృతబీజం తు కట మైశ్వర్య ముచ్యతే ।**
**అమృతైశ్వర్యసంఘత్వాత్ వేంకటాద్రి రితి స్మృతః ॥**
**వేంకటేతి కృతం నామ పిత్రా తస్య మహాత్మనః ।**
**అమృతస్యేందిరాయా శ్చ యతో విస్తారకారకః ॥**
**జీవానాం భారతే వర్షే తతోఽయం గుణనామకః ।** (బ్రహ్మ –1–8–9)

అనుచు పురాణములు తెలిపినరీతిలో త్రివర్గమనబడు ఐశ్వర్యము, అపవర్గమనబడు మోక్షమును వేంకటమను శబ్దమునకు అర్థము – అని తెలియుటచే ఆ రెండు ఫలములను వారు వారు కోరిన రీతిలో అందఱికి ప్రత్యక్షముగా అనుగ్రహించువాడు మన వేంకటేశ్వరుడే కావున అతనికి వేంకటనామము తగినది అనియు చెప్పవచ్చును. ఇంకను ఈ రెండు అర్థముల వివరణము మొదటినామవ్యాఖ్యలో గమనింపనగును.

23. **ఓమ్ సనకాదిమహాయోగిపూజితాయ శ్రీవేంకటేశాయ నమః**
(సనకుడు మొదలగు మహర్షులచే పూజింపబడిన శ్రీవేంకటేశ్వరుని పొందుచున్నాను)

19వ నామములో వామనపురాణము 32వ అధ్యాయములోనున్న ఉపరిచరవసుపు చరిత్రము ప్రస్తావింపబడినది. దానిని అనుసరించి ఆ పిమ్మట 3నామములు ఏర్పడినవి. ఆ ఉపరిచరవసువునకు గరుడారూఢుడై శ్రీనివాసుడు సేవను అనుగ్రహించినపుడు అచటకూడియున్న అందఱును ప్రత్యేకముగా భగవానుని స్తుతించిరి. అపుడు

**ఏవ ముక్తే తత స్తేన సనకాద్యా శ్చ యోగినః ।**
**ప్రణమ్య తుష్టువు ర్దేవం వైనతేయోపరిస్థితమ్ ॥**

అనునట్లు అపుడు ఆ గోష్ఠిలోనున్న సనకాదిమహర్షులును స్వామిని స్తుతించిరి. వారు చేసిన స్తోత్రము (వామనపురాణము –35వ అధ్యాయము) సర్వవేదాంతార్థప్రతిపాదకము, భగవానుని దివ్యగుణములు, అవతారములు, దివ్యమంగళవిగ్రహము – అను వీనిని చక్కగా వర్ణించునదియైయున్నది. కావున ఆ సమయములో వారిచే పొగడబడినవి కావున



ఆ తిరునామముతో దీనికి సంబంధము కల్గినదని చెప్పవచ్చును. అంతియేకాక, ఈ నామములో లక్ష్మీసంబంధముచే భగవానునకు ఏర్పడు గుణములు చెప్పబడినవి. ఇచట ఆ భగవానునియొక్క ఉత్తమగుణములచే ఏర్పడు సాధుసంరక్షణము, దుష్కృద్వినాశనము అనెడి రెండు కృత్యములు క్రమముగా ఈ తిరునామములో, దీనికి పిమ్మట తరువాతి తిరునామములో తెలుపబడుచున్నవి అను సంగతిని (విషయసంబంధమును) కూడ చెప్పవచ్చును. ఈ రెండు కృత్యములకును లక్ష్మీదేవిసంబంధమే మూలకారణము. దుష్కృద్వినాశమునకు లక్ష్మీసంబంధము కారణము అగునా? అని శంకింపవలసిన అవసరములేదు. పిరాట్టిసంబంధముచే ఏర్పడు వినాశము రక్షణరూపముగానే పర్యవసించునను శాస్త్రార్థమును దయాశతకము మొదలగు గ్రంథములందు పూర్వాచార్యులు పలురీతులలో నిరూపించియుండుటచే, దానినికూడ తెలియనగును. సనకుడు, సనందనుడు, సనాతనుడు, సత్కుమారుడు, అను నల్గురు బ్రహ్మమానసపుత్రులు, సర్వజ్ఞులు, మహావిరక్తులు, భగవద్భక్తాగ్రగణ్యులును. ఆగమశాస్త్రములలో భగవానుని పాదపీఠములో పుష్పన్యాసదేవతలుగా ఈ నల్గురును భగవానునితోపాటు ఆలయారాధనలో సర్వోపచారములతో పూజింపబడవలెను–అని చెప్పబడియున్నది. ఇంతటి మహిమనుకల వీరు ఉపరిచరవసువుకు ప్రత్యక్షమైనపుడు అత్యద్భుతముగా స్వామిని స్తుతించిరి. అట్టి శిష్టజనముల కన్నులకు సాక్షాత్తుగా దర్శన మిచ్చి, వారితో భాషించి, ఆనందింపచేయుటయే సాధుపరిత్రాణమని భగవద్రామానుజ సిద్ధాంతము. కావున అట్టి సాధుపరిత్రాణము ఇచట తెలుపబడినది.

24. **ఓమ్ దేవజిత్ప్రముఖానంతదైత్యసంఘర్షణాశినే శ్రీవేంకటేశాయ నమః**
(దేవజిత మొదలగు సకలదైత్యుల నాశనము చేసిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామమున సాధుపరిత్రాణము తెలుపబడినది. ఈ పరిత్రాణమునకు శేషభూతమైన దుష్కృద్వినాశము ఇందు తెలుపబడుచున్నది. మఱియు వామనపురాణములో 18వ తిరునామములో చెప్పబడిన శంఖరాజుయొక్క చరిత్ర 40వ అధ్యాయముతో పూర్తికాగానే, 41వ అధ్యాయములో ఆ కథయొక్క అనువృత్తిరూపముగానే దేవజిత్ మొదలగు అసురుల వధ వర్ణింపబడినది. 18వ నామముమొదలు 23వ నామమువరకు శంఖరాజుయొక్క చరిత్ర అనుస్యూతముగానే చెప్పబడుచున్నది. కావుననే పూర్వనామముతో ఈ తిరునామము సంగత మగుచున్నది.

శంఖరాజు, ఉపరిచరవసుపు మొదలగువారికిని భగవానుడు ప్రత్యక్షమై, తిరిగి అంతర్ధానమయ్యెను. దానిని చూచి అచటనున్న మహర్షులు మిక్కిలి బాధపడగా, వారిని ఉద్దేశించి అగస్త్యమహర్షి, "భగవానుడు మరల శ్రీనివాసుని రూపమున విమానముతోపాటు అవతరించి, స్థిరముగా నుండగలడు, చింతింపకుడు" అని పల్కి సమాధానపఱచెను. అపుడు శ్రీనివాసుడు విష్వక్సేనపూర్వకముగా చేసి వారు వరబలగర్వముతో దేవజిత్తు మొదలగు అసురుల వధ వర్ణింపబడినది.

హిరణ్యాక్షుని వంశముతో దేవజిత్, మృత్యుజిత్, శత్రుజిత్ - అను ముగ్గురు సహోదరులుండిరి. నామపరబింబంగర్వముతో సర్వదేవతలను, చంద్రసూర్యులనుకూడ మిక్కిలి హింసించిరి. వారి ఉపద్రవమును భరింపలేని దేవతలు శ్రీనివాసభగవానుని శరణువేడిరి. నారాయణాద్రివాసియైన శ్రీనివాసుడు తన సేనాపతియైన విష్వక్సేనుని పంపి, వారిని (అసురులను) సంహరించునట్లు నియమించెను. అతడును మిక్కిలి బలవంతులైన ఆ అసురులతో చిరకాలము యుద్ధము చేసి, చివరకు నారాయణాస్త్రమును ప్రయోగించి, వారిని సంహరించెను. దేవతలు సంతోషించి, విష్వక్సేనుని స్తుతించిరి. ఇదియే ఆ కథాసంగ్రహము. ఇది పూర్వము తెలిపిన శంఖరాజుచరిత్రకు అనుబంధముగానే యున్నది. కావున 23వ, 24వ తిరుమనామములలో గీతలోనున్న - **"పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** అనెడి భగవద్వాక్యమునుబట్టి, సాధుసంరక్షణము, దుష్కృద్వినాశము అనెడి రెండు కార్యములను విభవావతారములో మాత్రమేకాక, అర్చావతారమునందును ఒక విధముగా నడచు రీతి వర్ణింపబడినట్లయినది.

25. **ఓమ్ శ్వేతద్వీపవసన్ముక్తపూజితాంఘ్రియుగాయ శ్రీవేంకటేశాయ నమః**

(శ్వేతద్వీపములో నివసించు ముక్తులచే పూజింపబడిన రెండు శ్రీపాదములను పొందుటకు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

**"శంఖరాజన్యనేత్రాబ్జవిషయాయ నమః"** అనెడి 18వ తిరునామము మొదలు, శంఖరాజుయొక్క చరిత్రను తెలుపు వామనపురాణములోని 41వ అధ్యాయమువరకు గల భాగమును అనుసరించి, 23 వరకుగల నామములు ఏర్పడినవి. 23వ నామములో, శంఖరాజుకు ప్రత్యక్షమగునపుడు ఉపరిచరవసువువలె ఆ గోష్ఠిలోనున్న సనకుడు మొదలగు మహర్షులచే భగవానుని స్తోత్రము చేయబడిన రీతి తెలుపబడినది. దానికి పిమ్మట 24వ నామము దానిని అనుసరించి ఏర్పడినది. ఈ తిరునామము, సనకాదువలె ఆ గోష్ఠిలోనున్న శ్వేతద్వీపవాసులు అపుడు శ్రీనివాసుని స్తోత్రము చేయుటనుబట్టి వచ్చినది. వీరు స్తుతించుటకూడ వామనపురాణము 35వ అధ్యాయములోనే ఉన్నది.

శ్రీవైకుంఠము, క్షీరాబ్ధి అను వీనివలె శ్వేతద్వీపముకూడ భగవానుని వాసస్థలముగా చెప్పబడినది. అచటనుండువారు ముక్తాత్మలు. వారికి చతుర్భుజత్వము మొదలగు భగవల్లక్షణములుండును. వారు సర్వదా భగవానుని స్తుతించుచుందురు. అట్టి, శ్వేతద్వీపవాసులగు ముక్తులును, తిరుమలలో శంఖరాజుయొక్క తపస్సుకొఱకు భగవానుడు ఆవిర్భవింపబోవుచున్నాడు అని తెలిసి, ఉపరిచరవసువు, బృహస్పతి, శుక్రాచార్యుడు, అగస్త్యుడు, సనకాదులు, మొదలగువారితో కలసి వచ్చి, స్వామిపుష్కరిణీతటమున భగవానుని సాక్షాత్కరింపజేసికొని, స్తుతించిరి. ఆ వృత్తాంతము - **"ఏవం స్తుతేఽథ దేవేశే శక్రాద్యై స్త్రిదివేశ్వరైః, తుష్టువు స్తం ప్రణమ్యేశం శ్వేతద్వీపనివాసినః"** అని ప్రారంభించి వామనపురాణము 35వ అధ్యాయములో తెలుపబడినది. వీరు చేసిన స్తుతులన్నియు వేదాంతార్థములతో నిండియున్నవి.



26. **ఓమ్ శేషపర్వతరూపత్వప్రకాశనపరాయ శ్రీవేంకటేశాయ నమః**

(ఆదిశేషునకు పర్వతాకారమును అనుగ్రహించి, ప్రకాశింపజేసిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో శ్వేతద్వీపవాసులగు ముక్తులు శ్రీనివాసుని ఉపాసించిన రీతి వర్ణిపబడినది. ఈ నామమునందును, తరువాతి నామమునందును, ముక్తులకంటెను ఉన్నతులగు నిత్యులని పిలువబడువారిలో ప్రధానులగు అనంతుడు, గరుడుడు అను వీరు భగవానునకు చేయు కైంకర్యము క్రమముగా వర్ణిపబడుచున్నది. ఆదిశేషుడు వేంకటాచలముగా అవతరించిన కథ బ్రహ్మాండపురాణములో కలదు. ఒకానొక సమయమున నారదుడు, క్షీరాబ్ధిలోనున్న శ్వేతద్వీపములో భగవానుని సేవింపపోయినపుడు, భగవానుడు, భూలోకములో నేను విహరించుటకు తగినచోటు ఏది? అని ప్రశ్నించెను. నారదుడు మిక్కిలి వినయముతో, ''దక్షిణదేశములోని దండకార్యములో సువర్ణముఖీనదీతీరమున, వేదాధ్యయనము మొదలగునవి లేక, ఆధివ్యాధులతో జనులు పీడింపబడుచు కష్టపడుచున్నారు. ఆ స్థలము మిక్కిలి రమణీయమైనది. అచట నీవు అవతరింపవలెను" అని ప్రార్థించెను. అపుడు భగవానుడును, "చోళదేశరాజు కుమారుడు ఒకడు జన్మింపబోవును. అతనిని అనుగ్రహింపవలసియున్నది. అందులకు, అదియే తగినచోటు అని" పల్కి, తనకు ముందు చేతులను జోడించి నిలచియున్న ఆదిశేషుని పిలచి, **"అనంత! మత్ప్రియో లోకే న త్వదన్యోఽస్తి కశ్చన, తస్మా న్మమ ప్రియం కించిత్ కర్తవ్యం భవతానఘ, శ్రుతం హి భవతా సర్వం నారదోదీరితం వచః, క్రీడాసముచితే దేశే వస్తవ్య మితి మే మతిః తత్ర భూత్వా గిరివరో భవాన్ వసతు భూతలే, త్వత్ఫణామండల భువి స్థాతవ్యం రమయా సహ"**, శేషః-**"అనంతోఽహం మహాదేవ స్థాస్యామి గిరిరూపధృత్, భవాం స్తు రమయా సార్ధం మమ సానుషు రంస్యతామ్"** - (బ్రహ్మాండ-2-6అధ్యాయే) (ఓ అనంతా! నీవుతప్ప వేఱొకడు నాకు ఇష్టమైనవాడు లేడు. నీవు నాకొక ఇష్టమైన కార్యమును చేయవలెను. నారదుడు పల్కిన దానిని నీవును వింటివికదా! అందుచే నీవు ఒక పర్వతరూపమున నారదుడు పల్కిన చోట అమరియుండుము. నీ శిరస్సులో పడగలున్నచోట నేను మహాలక్ష్మితోపాటు విహరించెదను అని నియమించెను. ఆదిశేషుడును ఆ నియమమును శిరసావహించి, "అట్లే చేసెదను. నీవు నా శిరస్సుపై పిరాట్టితో కలసి విహరింపుము") అని ప్రార్థించి, పర్వతరూపమును దాల్చి నిలచెను. ఈ కథను అనుసరించి ఈ నామము ఏర్పడినది. ఇదియే కాక, వాయువునకు, ఆదిశేషునకు కలహము ఏర్పడిన పిదప ఆదిశేషుడు తపస్సు చేసి, తాను పర్వతరూపిగా అవతరింపబోవుదునని, తనవద్ద భగవానుడు అవతరించి నిత్యవాసము చేయవలెనని భగవానుని ప్రార్థించెను. ఆ విధముగానే భగవానుడును చేసెను - అను బ్రహ్మాండపురాణాంతర్గత కథయు ఇచట అనుసంధేయము.

27. **ఓమ్ సానుస్థాపితతార్క్ష్యాయ శ్రీవేంకటేశాయ నమః**
(తిరుమల కొండచరియలో గరుడుడు నివసించునట్లు చేసిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో, అనంతగరుడవిష్వక్సేనాదులు అనెడి గోష్ఠిలో అనంతుడనబడు ఆదిశేషుని కైంకర్యము వర్ణింపబడినది. ఇచట అనంతస్థానీయుడగు గరుడుని భక్తి వర్ణింపబడుచున్నది. ఈ తిరునామమునకు మూలమైన వృత్తాంతముకూడ వామనావతారములోనే కలదు. భగవానుడు చిరకాలము వేంకటాద్రిపై వేంచేసియుండి, ఆ చోటును విడచి రాకుండుటను చూచిన గరుడుడు "ఈ వేంకటాద్రిని ఎత్తి మోసికొనిపోయి, విష్ణులోకమునకు చేర్చెదను" అని తలచెను. ఆ ఆలోచనను గమనించిన భగవానుడు మందహాసముతో గరుడుని చూచి, "గొప్ప బలిష్ఠుడవగు ఓ పక్షిరాజా! జగత్తును రక్షింపవలసియుండుటచే ఈ కల్పము ముగియువరకు నేను ఇచట నివసింపవలెనని నిర్ణయించుకుంటిని. నీవు, ఆదిశేషుడు మొదలగువారు అందఱును వచ్చి, ఇచటనే నివసింపుడు. మీరు ఈ పర్వతము దక్షిణభాగములోని, సానువులో (కొండ చరియలో) నివసింపవలెను" అని ఆజ్ఞాపించి ఆదిశేషుని పిలచి, "ఆదిశేషా! నీవు పర్వతరూపములో ఈ గరుడుని మోయుచు, అతనికింద నిత్యవాసము చేయవలెను" అని నియమించెను. త్రేతాయుగములో ఈ పర్వతము గరుడాచలమని పేరుతో వ్యవహరింపతగినది అని అపుడు అనుగ్రహించిన ఈ వృత్తాంతము వామనపురాణము 24వ అధ్యాయములో తెలుపబడినది.

**గరుత్మాం స్తు వృషాద్రింతం కాంచనం రత్నమండితమ్ ।**
**ఉద్ధృత్యాహం విష్ణులోకం గమిష్యామీత్యచింతయత్ ॥**
**తత్ జ్ఞాత్వా భగవాన్ విష్ణుః గరుడం త్వాహ సుస్మితః ।**
**శ్రీభగవాన్ - పక్షిరాజ! మహాసత్త్వ! శ్రుణు కారణ ముత్తమమ్ ॥**
**గరుత్మ న్నిహ సర్వే వై వసామ గిరిమూర్ధని ।**
**త్వం గిరే ర్దక్షిణం సాను మాసాద్య వస నిత్యశః ॥**
**శేషాగచ్ఛ వసేహ త్వం తార్క్ష్యాధః శైలరూపధృత్ ।**
**ఆకల్పాంతం వసామీహ జగత్పాలనకారణాత్ ॥**
**కృతే వృషాద్రిం వక్ష్యంతి త్రేతాయాం గరుడాచలమ్ ॥** (వామన-24 అధ్యాయే)

ఆదిశేషుని పర్వతముగా అవతరింపజేసెను అని పూర్వనామములో తెలుపబడిన కథయు ఈ సందర్భమున చెప్పవలసియున్నది. దీని వివరణమే బ్రహ్మాండపురాణములో కూడ కలదు అని తెలియనగును. ఇట్లు నామములలో వామనపురాణము అవిచ్ఛిన్నముగా వచ్చుచున్నదని గ్రహింపవలెను. విధముగా తనయందు అధికమైన భక్తిని కల్గిన గరుడుని ఈ పర్వతమునందే వసించునట్లు చేసిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని ఈ నామముయొక్క భావము.



28. **ఓమ్ తార్క్ష్యాచలనివాసినే శ్రీవేంకటేశాయ నమః**
(తార్క్ష్యాచలమనబడు ఈ తిరుమలలో నివసించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ఈ తిరునామములో గరుడాచలమను ఈ తిరుమలయొక్క తిరునామము ప్రస్తావింపబడినది. ఇందు గరుడాచలమను ఈ పేరు ఈ కొండకు ఏర్పడుటకు గల కారణమును అనుసంధించుటకై గరుడాచలనివాసియైన శ్రీనివాసుడు నమస్కరింపబడుచున్నాడు.

ఈ కొండకు గరుడాచలమను పేరు ఏర్పడుటకు రెండు కారణములున్నవి. అందులో మొదటిది గరుడునిచే వైకుంఠములోనున్న క్రీడాపర్వతమే ఇచటికి భూలోకమునకు భగవానుని ఆజ్ఞపై తీసికొనిరాబడినది అను వరాహపురాణకథను అనుసరించి, గమనించినపుడు గరుడునిచే తీసికొని రాబడిన పర్వతమని అర్థ మగుచున్నది.

**ఏవంరూపం గిరిశ్రేష్ఠం స్కంధదేశే నిధాయ తమ్ ।**
**పరివారై రుపేతం చ భగవత్పరిచారకైః ॥**
**ఆజగామ మహాదేవాత్ గరుడః కాంచనప్రభః ।**
**ఆగతం గరుడం వీక్ష్య స్థాపయేహ ఖగేశ్వర ।**
**ఇత్యువాచ హరిః సోఽపి స్థాపయామాస తం తదా ॥** (వరాహపురాణము)

రెండవ కారణ మేమి? అనగా -

**అరాయి కాణే వికటే గిరిం గచ్ఛేతి తం విదుః ।**
**ఏవం వేదమయః సాక్షాత్ గిరీంద్రః పన్నగాచలః ॥** (భవిష్యోత్తర-15)

అని భవిష్యోత్తరములో తెలుపబడినట్లు ఈ కొండ వేదస్వరూపముగానే మహర్షులచే స్తుతింపబడినది. దీనిని అనుసరించియే వేదాంతదేశికులును **"వేజ్గడవెఱ్పెన విళక్కుమ్ వేదవెఱ్పే"** అని అనుగ్రహించిరి. ఈ పర్వతము వేదస్వరూపమనుట ఎట్లు? అనినచో, గరుడుని వేదములు వేదస్వరూపునిగా కీర్తించినవి. ఆ మహనీయుని ఒక్కొక్క అవయవమును వేదావయవముగానే కీర్తింపబడినది. దీనినిబట్టియే ఆచార్యులును **"వేదాత్మా విహగేశ్వరః"** అని నుడివిరి. కావున వేదము, గరుడాచలమనుటలో విప్రతిపత్తి లేదుకదా! దీనిని అనుసరించి చూచిన, వేఱొక వక్తవ్యాంశమును కలదు. శ్రీరామానుజులు తమ శ్రీభాష్య గ్రంథప్రారంభములో **"శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా"** అనుచు పల్కిరి. ఇచట శ్రీనివాసుడు వేదశిరస్సులో ప్రకాశించుచున్నట్లు తెలుపబడినది. వేదశిరస్సు అనగా వేదాంతము. పరబ్రహ్మమనెడి రూపములో పరమపురుషుడు వేదాంతప్రతిపాద్యుడైనను, శ్రీనివాసుడు అనెడి రూపములో వేదశిరస్సులో ఎచట ప్రకాశించుచున్నాడు? అనెడి ఒక చిన్న ప్రశ్నకు పూర్వము తెలిపిన విషయము సమాధానమిచ్చుచున్నది. ఈ పర్వతము వేదగిరి అగుటచే (గరుడాచలమగుటచే) దీని శిరస్సులో ప్రకాశించినచో వేదశిరస్సులో ప్రకాశించినట్లగును కదా! కావున ఈ వేంకటాచలమే వేదగిరిగా వెలుగుటచే దీని శిరస్సులో ప్రకాశించు

శ్రీనివాసుడు అనెడి పరబ్రహ్మవట్ల నాకు గొప్ప భక్తి కల్గియుండవలెనని శ్రీభగవద్రామానుజులు ప్రార్థించుట ఈ కొండకు అధిపతియైన, అర్చారూపియగు శ్రీనివాసుని ఉద్దేశించియేయగును. ఇట్లు ఈ మంగళశ్లోకములో ఏ పరదేవత విషయమున భక్తిని ప్రార్థించిరో, శ్రీనివాసుడనెడి ఆ పరబ్రహ్మమే ఉపాయము, ఉపేయము అనెడి రీతిలో పూర్ణముగా శ్రీభాష్యములో ప్రతిపాదింపబడుచున్నాడు–అనునదియు మిక్కిలి ఉపపన్నమే. ఇది అంతయు మనస్సులో నుంచుకొనియే సమీపకాలమున వేంచేసియున్న కపిస్థలం దేశికాచార్యస్వామివారు శ్రీభాష్యార్థమును సంగ్రహముగా తెలుపురీతిలో అద్భుతమైన శైలిలో అనుగ్రహించిన శ్రీశారీరకాధికరణరత్నమాల అనెడి తమ సంస్కృతగ్రంథములో అధికరణార్థములను సంగ్రహించు ఒక్కొక్క శ్లోకమునందు **"తద్బ్రహ్మ శ్రీనివాసనామ భజే"**–(శ్రీనివాసుడను ప్రసిద్ధనామమునుకల పరబ్రహ్మను సేవించుచున్నాను) అని సాయించిరి. కొండపై పెట్టిన దీపమెట్లు అందతికిని ప్రకాశించునో, అట్లే వేదగిరిశిఖరమున వెల్గు ఇతడు అంతట ప్రకాశించుచున్నాడు. ఇట్లు సర్వవేదవేదాంత ప్రతిపాద్యుడగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈ నామముయొక్క తాత్పర్యము.

29. **ఓమ్ మాయాగూఢవిమానాయ శ్రీవేంకటేశాయ నమః**
(తన మాయతో అదృశ్యమగునట్లు చేసిన విమానమునుకల శ్రీవేంకటేశుని ఆశ్రయించుచున్నాను)

వామనపురాణమును అనుసరించియే ఇంతవరకుగల చాల నామములు ఏర్పడినవి అనియు, మధ్యలో కొన్ని కొన్ని నామములు ఆ వామనపురాణకథను అనుసరించి ప్రసంగవశమున ఏర్పడినవని అచట అచట నిరూపించుచుంటిమి. ఆ రీతిలో **"స్థానుస్థాపితతార్క్ష్యాయ"** అనెడి 27వ నామమునకు మూలమైన కథయు వామనపురాణములోనే ఉన్నదనియు పల్కితిమి. 27 తిరునామమునుబట్టి ప్రసంగాత్ 28వ తిరునామము ఏర్పడినది. 29వ తిరునామమగు ఈ నామము మరల వామన పురాణకథను అనుసరించియే ఏర్పడినది.

వామనపురాణములో 36 మొదలు 40 వరకు గల అధ్యాయములలో శంఖరాజు, ఉపరిచరవసువు, అగస్త్యుడు మొదలగువారికి భగవానుడు సేవను అనుగ్రహించిన ప్రకారము విస్తరముగా వర్ణింపబడినది. అచట పలుచోట్ల భగవానుని విమానమునుగూర్చిన (ఆనందనిలయ విమానమును గూర్చిన) ప్రస్తావము కలదు. మొదట అగస్త్యుడు మొదలగువారికి భగవానుడు ప్రత్యక్షమై సేవను అనుగ్రహించుచున్నపుడు, చాలాకాలముగా ఆ వేంకటాద్రిలోని స్వామిపుష్కరిణీ తీరమున నివసించుచున్నను అంతవరకు తాము చూడని ఒక అద్భుతమైన విమానమును దర్శించిరి. ఇంతకాలము తాము అచట నివసించుచున్నను, ఆ అద్భుతమైన విమానము కన్పింపకపోవుటచే సాక్షాత్తు పరమపురుషుడే తన మాయతో (సంకల్పముతో, ఆశ్చర్యకరశక్తితో) దీనిని మఱుగుపఱచియుండవలెను–అని వారు అపుడు తలచిరి. ఈ కథ ఈ క్రింద ఉట్టంకించిన శ్లోకములవలన స్పష్టమగును.



**అహో బత మహాశ్చర్యం నూన మేతన్మహాత్మనా ।**
**అనేనాంతర్హితం యస్మాత్ పూర్వం తన్న హ్యదృశ్యత ॥**
**విమానం పుణ్య మాశ్చర్యం జ్వలద్భాస్కరసన్నిభమ్ ।**
**హరిణా ధ్రువ మేత త్స్యాత్ అనేనైవ స్వమాయయా ।**
**అంతర్హితం కృతం దివ్యం విమానం సిద్ధసేవితమ్ ॥** (వామన–37అధ్యాయే)

ఇట్లు ఈ విమానము మొదట కన్పించక మఱుగుపడియుండుటకును, తిరిగి కన్పించుటకును కారణమేమి? అని జనకుడు అడుగగా, వామదేవుడు సమాధానమిచ్చెను. అనగా, "ఈ మహర్షులు చిరకాలము ఈ కొండపైననే నన్ను, నా విమానము వెదకుచు నివసింపవలెనను" భావముతోనే సర్వేశ్వరుడు అట్లు చేసెను. వారి వాసముచే కొండకు, కొండలో వాసముచే వారికి, విశేషమైన మహిమ ఏర్పడవలెనను భావమే అట్లు తలంచుటకు కారణమైయుండువచ్చును. తిరిగి భగవానునకు వీరిపట్ల దయకల్గి తన సంకల్పముతోనే విమానమును దర్శించునట్లు చేసెను – అను ఈ విషయమును ఈ క్రింది శ్లోకముల ద్వారా తెలియనగును.

**సర్వం ఏతే మునిశ్రేష్ఠాః సుచిరం గిరిమూర్ధని ।**
**చరేయు రితి దేవేన హ్యదా వంతర్హితం కృతమ్ ॥**
**స్వేనైవ తేషాం సర్వేషాం మునీంద్రాణాం మహాత్మనామ్ ।**
**మాయా మపాస్య స్వాం దివ్యాం విమానం దర్శితం పునః ॥**

తిరిగి వీరు పండ్రెండు సంవత్సరములకాలము స్వామి పుష్కరిణీలో స్నానాదులను చేయుచు, అష్టాక్షరీమంత్రమును జపించుచూ విమానమును సేవించుచున్నపుడే ఒక సమయమున ఆ విమానము అంతర్హితమయ్యెను. దానిని గమనించిన మహర్షులు "ఇదేమి ఆశ్చర్యము!" మొదట కన్పింపకుండనున్నది, తిరిగి కన్పించినది, ఇపుడే మరల పూర్వమువలె అదృశ్యమైనది. అన్నియు సర్వేశ్వరుడగు శ్రీనివాసుని మాయ" అని ఆశ్చర్యమును, చింతను పొందిరి. ఈ వృత్తాంతమును

**పున శ్చాపి జగద్ధాతుః మాయయా దివ్యయా స్వయా ।**
**అంతర్హితం కృతం చాసీత్ తదద్భుత మివాభవత్ ॥**
**పున శ్చ దేవదేవేన హరిణ్యా ద్భుతకారిణా ।**
**ఇదానీం చ పున స్తేన మాయయాఽంతర్హితం కృతమ్ ॥** (వామన–40)

అను మొదలగు పురాణశ్లోకములు తెలుపుచున్నవి. ఈ వృత్తాంతములన్నియు ఈ కలియుగములో జరిగినవికావు. యుగాంతములలో సంభవించినవి. ఇట్లు ఈ విమానము అదృశ్యమైన పిమ్మట చింతను పొందిన మహర్షులను చూచి అగస్త్యుడు. "మహర్షులారా! ఇపుడు మనము సేవించిన విమానము ఈ పర్వతములో స్వామిపుష్కరిణికి

దక్షిణతీరములో ఎల్లప్పుడు ఉన్నదేసుమా! అయినను, భగవానుని సంకల్పమువలన అది అదృశ్యమగుట ఎవరికిని తెలియదు. ఆయా యుగములలో ఎవరైన ఒక మహాత్ములు తపస్సుచేసి, సిద్ధిని పొందినచో, అతడు స్వామి దయవలన (ఇపుడు శంఖరాజువలె) దీనిని దర్శింపవచ్చును. అయినచో, రాబోవు కలియుగమున ఈ విమానము (ఆనందనిలయము) విష్ణుభక్తులగు మానవులచేతనే సర్వలక్షణములతో నిండినదిగా పరిష్కరింపబడి, ఎల్లప్పుడు అందఱికిని కన్పించునట్లు సాక్షాత్ శ్రీనివాసమూర్తితో (అర్చామూర్తితో) కూడి వెలుగగలదు. దీనిని దీనిలో వేంచేసియుండు శ్రీనివాసుని సేవించినవారికి సర్వపాపములును నశించును"-అని పల్కెను. ఈ విషయమును

**ఆగామిని కలౌచాపి సంప్రాప్తే పుణ్య ముత్తమమ్ ।**
**విమానం సర్వపాపఘ్నం విష్ణునాఽధిష్ఠితం సదా ॥**
**మనుజై రేవ తద్భక్తై కారితం లక్షణాన్వితమ్ ॥**

అను మొదలగు శ్లోకములందు గమనింపవచ్చును.

ఇచట మాయ అనగా, భగవానునకుకల, ఆశ్చర్యకరమైన, కార్యములను చేయుటకు అనుకూలమైన ఒక శక్తివిశేషమే. లేక, గీత మొదలగు ప్రమాణములనుబట్టి సర్వేశ్వరుని సంకల్పమును కావచ్చును. ఇది రాబోవు పురాణవచనములవలన స్పష్టము కాగలదు. కావున తన విచిత్రశక్తితో విమానమును పలు పర్యాయములు అదృశ్యము చేసిన శ్రీవేంకటేశ్వరుని శరణు పొందుచున్నాను-అని ఈ నామభావము.

ఈ విషయములవలన సారముగా మనము గ్రహింపతగినది ఏమనగా - మిక్కిలి పుణ్యాత్ములగు అగస్త్యుడు మొదలగు మహర్షులచేతనుకూడ ఎంతోదీర్ఘమైన కాలము మిక్కిలి తీవ్రమైన తపస్సును చేసి, కొంచము కాలమే సేవింపగల్గిన ఈ ఆనందనిలయ విమానము, ఎల్లప్పుడు పలు అపరాధములను చేయుచున్న, పరమపాపిష్ఠివారగు ఈ కలికాలములోనివారు ఎప్పుడును సేవించురీతిలో వేంచేసియున్నదనగా, దీనికి ముఖ్యమైన కారణము, కలియుగములో పుట్టినవారు తపస్సు మొదలగు కఠినమైన సాధనములను అనుష్ఠించుటకు శక్తిలేనివారు అగుటచే, వీరిని ఉపేక్షించినచో, నిర్గతియై చెడిపోవుదురు. కావున ఎవడైన ఈ కొండకు వచ్చి, ఈ విమానమును ఒకసారి అయినను సేవించినచో సద్గతిని పొందవచ్చును- అనుటకు అనుకూలముగా, "సర్వదా నేను నా విమానముతో ఇచటనే వేంచేసియుండును" అనెడి శ్రీనివాసుని పరమకరుణయే-అను విషయమును వివరించి చెప్పనవసరము లేదు. అగస్త్యుడు మొదలగు మహర్షులును భగవానుని మంగళాశాసనము చేసి, "కలియుగములో నీ విమానముతోపాటు నీవు ఈ కొండపై నిత్యసాన్నిధ్యము చేయవలెను" అని, కలియుగములోనివారిపట్ల దయతో ప్రార్థించుటయును పూర్వము తెలిపిన భగవానుని సంకల్పమునకు సహాయకారి. భగవానుడు భక్తపరాధీనుడు కదా!



**30. ఓమ్ గరుడస్కంధవాసినే శ్రీవేంకటేశాయ నమః**

(గరుడుని భుజస్కంధములపై సేవను అనుగ్రహించు శ్రీవేంకటేశునకు నమస్కారము)

పూర్వనామములో అగస్త్యుడు, శంఖరాజు మొదలగువారికి భగవానుడు, తిరుమలలోని స్వామిపుష్కరిణీ తీరమున దర్శనమును ఇచ్చిన సమయములో భగవానుని విమానము పలుమార్లు ఆ స్వామి శక్తి విశేషముచే అంతర్ధానమగుట వామన పురాణానుసారము వర్ణింపబడినది. ఈ తిరునామమునుండి, అదే సమయములో వారికి భగవానుడు సేవను అనుగ్రహించిన రీతిలో తెలుపబడుచున్నది. ఇదికూడ వామనపురాణములో ఆ సందర్భములోనున్న కథను అనుసరించియే ఏర్పడినది.

చిరకాలము తపస్సును చేసిన శంఖరాజుకు, మఱియు అచటకు వచ్చి సమావేశమైన అగస్త్యుడు, బ్రహ్మ, రుద్రుడు, శుక్రాచార్యులు, బృహస్పతి, శ్వేతదీపవాసులగు ముక్తులు, పలువురు మహర్షులు మొదలగువారికి మొదట భగవానుడు ప్రత్యక్షమై, దర్శనమిచ్చుట గరుడుని భుజస్కంధములపై వేంచేసియుండియే. పెరియాళ్వార్లు పరతత్త్వ నిర్ణయమును చేసినపుడు వారికి మధురానగరములో సేవను అనుగ్రహించిన రీతిలోనే, ఇచట సన్నివేశమును అమరియున్నది. ఈ అంశమును

**దదృశు స్తే సమారూఢం వైనతేయం మహాబలమ్ ।**
**హరిం హేమాద్రిశిఖరే నీలమేఘ మివ స్థితమ్ ॥**
**........................................**
**తుష్టావాథ తదా బ్రహ్మా దేవాధిపతి మవ్యయమ్ ।**
**పతత్రిరాజ మారూఢం శిరోభిః ప్రణిపత్య తమ్ ॥**
**ఏవ ముక్తే తత స్తేషు సనకాద్యా శ్చ యోగినః ।**
**ప్రణమ్య తుష్టువు ర్దేవం వైనతేయోపరి స్థితమ్ ॥** (వామన-35 అధ్యాయం)

అను మొదలగు శ్లోకములందు గమనింపవచ్చును. భగవానుడు ఇట్టి సమయములలో గరుడునిపై దర్శనమిచ్చుటలో ఒక రహస్యము ఇమిడియున్నది. అనగా, **"శాస్త్రయోనిత్వాత్"** అనెడి బ్రహ్మసూత్రములో పరమపురుషుని ప్రకృతిమండలముననున్నవారు మొదట శాస్త్రమును ఆధారముగా చేసికొనియే తెలియుటకు వీలున్నదని వ్యాసభగవానుడు నిర్ణయించెను. ప్రమాణములో ఉత్తమమైన ప్రమాణము అగు వేదమనెడి శాస్త్రప్రమాణము చేతనే పరబ్రహ్మను తెలిసికొనుటకు వీలున్నది. ఆ వేదము అనెడి ఉత్తమప్రమాణము గరుడుని రూపములోనున్నది-అని పూర్వమే బాగుగా (28వ నామ వ్యాఖ్యలో) నిరూపింపబడినదికదా! కావున ఈ ఉత్తమప్రమాణముచే విష్ణురూపములోనున్న నేనే ప్రతిపాద్యుడను. ఎట్లు ప్రమాణములన్నిటిలో వేదము ఉత్తమమో, అట్లే ప్రమేయములలో నేనే ఉత్తముడను - అని అట్లు ప్రమాణప్రమేయభావమును తెలుపుటయే గరుడునిపై అధిరోహించి సేవను అనుగ్రహించుటలోని స్వామి ఉద్దేశ్యము. మఱియు, ఆ గరుడుని

హస్తములపై రెండు పాదములపై నిలిపి దర్శనమిచ్చుటలో, సంస్కృతవేదముతోపాటు సమానమైన ద్రావిడ వేదమును కలిసి, ఉభయవేదములును ఆస్వామి శ్రీపాదములనే ప్రతిపాదించుచున్నవి అనుటకూడ ఇచట గ్రహింపతగినది. ఈ విశేషమును దృష్టిలోనుంచుకొనియే భగవానుని గరుడసేవను వైదికులు విశేషముగా ప్రశంసింతురు. పెరియాళ్వార్లు ఏ ప్రమాణములను ఆధారముగా చేసికొని, ఎవరిని పరతత్త్వమని నిర్ణయించిరో, ఆ ప్రమాణము, ప్రమేయమును గరుడుడుగా, స్వామిగా సేవను అనుగ్రహించుచున్నారు. కావున, అట్టి గరుడారూఢుడైన శ్రీనివాసుని శరణు పొందుచున్నాను – అని ఈ నామముయొక్క భావము.

31. **ఓమ్ అనంతశిరసే శ్రీవేంకటేశాయ నమః**

32. **ఓమ్ అనంతాక్షాయ శ్రీవేంకటేశాయ నమః**

33. **ఓమ్ అనంతచరణాయ శ్రీవేంకటేశాయ నమః**

(అసంఖ్యాకములైన శిరస్సులను, లెక్కలేనన్ని నేత్రములను, అంతులేని చరణములను కలవాడై, విశ్వరూపముతో సేవను అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో భగవానుడు గరుడారూఢుడై, సేవను అనుగ్రహించిన తీరు తెలుపబడినది. ఈ తిరునామములలో. అట్లు గరుడవాహనములో సేవను అనుగ్రహించిన పిమ్మట, ఆ అగస్త్యుడు మొదలగువారికి స్వామి పరమకరుణతో విశ్వరూపమున సేవను అనుగ్రహించుట చెప్పబడుచున్నది. ఇట్లు విశ్వరూపములో భగవానుడు ప్రత్యక్షమైన విషయము వామనపురాణములో 36వ అధ్యాయములోనున్నది. ఈ మూడు నామములును కలిసి, విశ్వరూపమును ప్రతిపాదించుటచే, మూడును కలిపి వివరింపబడుచున్నవి. **"సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్"** అని పురుషసూక్తమునందు,

**అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్ ।**
**అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥**
**రూపం మహ త్తే బహువక్త్రనేత్రం మహాబాహో బహుబాహూరుపాదమ్ ।**
**బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వా లోకాః ప్రవ్యథితా మహాత్మన్ ॥**

అను మొదలగు శ్లోకములతో భగవద్గీతయందు పొగడబడు శ్రీనివాసుడు అపుడు విశ్వరూపములో సేవను అనుగ్రహించెను. విశ్వరూపములో సేవను అనుగ్రహించుట అనగా ప్రపంచమునంతటిని భగవానుడు తన దివ్యదేహములో కన్పింపజేయుటయే కదా! జరిగినవి, జరగబోవునవి మొదలగువానినికూడ అచట దర్శింపవచ్చును. వేలాది శిరస్సులును, వేలాది కన్నులును, పాదములును, ఆ రూపములో కన్పించును. ఇట్టి విశ్వరూపమును శ్రీకృష్ణుడు అర్జునునకు దర్శింపజేసినపుడు "నీవు చూచిన ఈ విశ్వరూపము అందఱిచే సేవింపతగినది కాదు. దేవాదులును దీనిని చాలాకాలముగా దర్శింపగోరుచున్నారు. గొప్పభక్తిని కల్గిన వానికే నన్ను ఈ రూపములో దర్శింప



సాధ్యము." అనుచు పలురీతులలో స్వామి పొగడియున్నాడు. ఇట్లు పరమభక్తులు మాత్రమే దర్శింపవీలయిన ఆ విశ్వరూపమును అపుడు అగస్త్యుడు మొదలగువారుకూడ దర్శించి ఆనందించిరి. వారు అట్లు దర్శించిన విధమును

**అహో భగవత స్తస్య మాహాత్మ్య మమితౌజసః ।**
**బ్రహ్మాండక్రమశేషం తత్ తేన వ్యాప్తం స్వతేజసా ॥**
**ప్రసన్నా స్తే కటాక్ష శ్చ దీపయంతో దిశో దశ ।**
**చకాశిరే స్వతేజోభిః శతశ స్తస్య శార్ఙ్గిణః ॥**
**శతశో బాహవ శ్చాపి హరేః కరికరోపమాః ।**
**వదనాని జ్వలంతిస్మ పూర్ణేందుసదృశానివై ।**
**శోభితాన్యమలై ర్దివ్యైః సరత్నైః మండలై స్తదా ॥**

అను మొదలగు శ్లోకములద్వారా వ్యక్తీకరించిరి.

కావున అర్జునుని విషయములోవలె అగస్త్యుడు మొదలగువారిపట్లకూడ పరమకరుణతో విశ్వరూపమునందు తనను దర్శించునట్లు చేసిన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను – అనునది ఈ మూడు నామముల అర్థము.

34. **ఓమ్ శ్రీశైలనిలయాయ శ్రీవేంకటేశాయ నమః**

(శ్రీశైలమనెడి వేంకటాచలమును తనకు వాసస్థానముగా కల్గిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో తెల్పిన రీతిలో అగస్త్యుడు మొదలగువారికి విశ్వరూపములో సేవను అనుగ్రహించిన భగవానుడే, ఇపుడు తిరుమలలో అర్చారూపిగా శ్రీవేంకటేశుడనెడి తిరునామములో వేంచేసియున్నాడు–అనుటను తెలుపుటకై ఈ నామము అవతరించినది.

**శ్రీప్రదత్వాత్ శ్రియో వాసాత్ శబ్దశక్త్యా చ యోగతః ।**
**రూఢ్యా శ్రీశైల ఇత్యేవం నామ చాస్య గిరే రభూత్ ॥** (వరాహ36)

సంపత్తును అనుగ్రహించుటచేతను, ఆ సంపదకు అధిదేవత అగు మహాలక్ష్మి నిత్యవాసము చేయుటచేతను, ఈ పర్వతమునకు శ్రీశైలమను పేరు కల్గినది ఈ స్వభావము అన్యపర్వతములకుకూడ ఉన్నను, యోగరూఢి అనెడి శబ్దశక్తిచే ఈ శ్రీశైలమనెడి పదము ఈ పర్వతమునే తెలుపును. ఈ "శ్రీశైల" మనెడి సంస్కృతపదముయొక్క అనువాదమే తిరుమలై అను ద్రావిడపదము. కావున, శ్రీవైష్ణవసంప్రదాయములో ఈ పేరుతోనే పెద్దలు ఈ కొండను వ్యవహరించుచున్నారు. ఈ కొండలో చిరకాలము శ్రీనివాసుని ఆరాధించుటచేతనే, భగవద్రామానుజులకు శ్రీమద్రామాయణ రహస్యార్థములను బోధించిన వారికి **"తిరుమలైనమ్బి"** (శ్రీశైలపూర్ణులు) అను నామము కల్గియుండవచ్చునని కొందఱి భావన. ఇట్టి విశేషస్వభావమును కల్గిన ఈ పర్వతములో చాలకాలము అర్చారూపములో నివసింపవలెనని కోరి, భగవానుడు ఇచట నిత్యవాసమును చేయుచు, కలియుగములో సర్వజనుల అభీష్టమును నెఱవేర్చుచు, వేంచేసియున్నాడు. ఇట్లు ఆ

స్వామియే కోఠి, ఇచట వేంచేసియున్నాడు అనునది వామనపురాణములో ముందు ఉదాహరించిన సందర్భమువలననే తెలుపబడినది.

35. **ఓమ్ దామోదరాయ శ్రీవేంకటేశాయ నమః**

(దారముచే ఉదరమునందు కట్టబడి, ఆశ్రితులకు పరాధీనుడైయున్న శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందునామములో విశ్వరూపిగా అగస్త్యాదులకు సేవను అనుగ్రహించిన భగవానుడు. అర్చారూపములో వేంచేసియుండు శ్రీనివాసుడే-అని నిరూపింపబడినది. భగవానుడు, ఋషులు మొదలగువారికి దర్శనము నిచ్చుట కొఱకు ఆవిర్భవించినపుడు అచట కూడియున్న భక్తులు భగవానుని ఆశ్రితపారతంత్ర్యము మొదలగు దివ్యాత్మగుణములందు, నీలమేఘవర్ణము మొదలగు దివ్యమంగళ విగ్రహగుణములందును అభినివిష్టులై, భగవానుని స్తుతించిరి. ఆ రెండు గుణములలో మొదటిది అగు ఆశ్రిత పారతంత్ర్యము అను ఉత్కృష్టమైన గుణము ఈ తిరునామములో అనుభవింపబడుచున్నది. తరువాతి నామములో దివ్యమంగళవిగ్రహగుణమగు నీలమేఘశ్యామలవర్ణము అనుభవింపబడుచున్నది. ఇది ఆ వామనపురాణములోనే 35వ అధ్యాయమునందే కలదు. ఇంద్రాదిదేవతలు స్తోత్రమును చేయునపుడు-

**యోగాత్మనే నమో నిత్యం నమో దామోదరాయ చ ।**
**క్షయవృద్ధివిహీనాయ నిర్గుణాయ నమో నమః ॥**

(యోగస్వరూపిగానున్న శ్రీనివాసునకు నమస్కారము. దామోదరుడగు శ్రీనివాసునకు నమస్కారము, క్షయమును, వృద్ధిని లేనివాడగు శ్రీనివాసునకు నమస్కారము) అని చెప్పబడినది.

ఇదియేకాక, **"శ్రీశైలనిలయాయ నమః"** అను నామమునకు పిమ్మటగల **"దామోదరాయ నమః"** అను ఈ తిరునామము ఏర్పడుటకుగల కారణమును శ్రీ నమ్మాళ్వార్లు అనుగ్రహించిన శ్రీసూక్తిబట్టియు తెలియవచ్చును. అది ఏమనగా-

**"దామోదరః"** అనెడి పదము కృష్ణావతారములో యశోదాదేవి శ్రీకృష్ణుని రోటికి కట్టవలెనని పలుమార్లు ప్రయత్నమును చేసినను వీలుకాకుండుటచే, ఆమె మిక్కిలి అలసటను, చెంది, పరితపించుచుండగా, అపుడు చిన్నదారముతో తనను కట్టుబడునట్లు చేసికొని, **"అనీత మగ్రే నిజబంధనార్థం దామాఖిలం సంహిత మప్యపూర్ణమ్, నిరీక్ష్య నిర్విణ్ణధియో జనన్యాః సంకోచశక్త్యా స బభూవ వంధ్యః"** (తనను బంధించుటకు తల్లి తీసికొచ్చిన అంతపెద్ద దారముకూడ చాలకపోవుటచే ఆమె చాల చింతించినది. ఆమెను అట్టి స్థితిలో చూచి జాలిపడి, తనను సంకోచించుకొని, ఆమె తనను కట్టునట్లు చేసికొనెను) అని శ్రీయాదవాభ్యుదయములో శ్రీదేశికులు అనుగ్రహించినరీతిలో యశోదకు భవ్యుడైయున్న గొప్ప మాయకాడు అగు శ్రీకృష్ణుని స్థితిని తెలుపును. దీనిని బట్టి **"ఏష సర్వస్వభూతో మే పరిష్వంగో హనూమతః"** అని హనుమానునకు తననే దానము చేసిన రామావతారములోని పరమోదారత్వమును ఈ అవతారమునందును దామోదరబంధ వృత్తాంతములో అనుభవింపవీలయినది అని ఏర్పడుచున్నది. సర్వప్రపంచనిర్మాత అగు సర్వేశ్వరుడు తనను మనకు అధీనునిగా, మన చేతిలో తనను అప్పగించుటకంటె ఉత్తమమైన ఔదార్యము వేఱొకటి కలదా! కావున దామోదరుడనుటచే తననే దానము చేయునట్టి పరమౌదార్యమును కలవాడని ఏర్పడుచున్నది. ఈ ఔదార్యగుణమును శ్రీనివాసునివద్ద ఈ కాలమునను మనము కూడ దర్శించి, ఆనందించుచున్నాము. ఇట్టి గుణము ఈ శ్రీనివాసునకు కల్గుట అతడు శ్రీశైలనిలయుడగుటచేతనే. అనగా, ఈ తిరుమలలో అతడు నిత్యవాసము చేయుటచేతనే అనునది తెలియజేయుటకే **"శ్రీశైలనిలయాయ"** అను నామమునకు పిమ్మట ఈ తిరునామము అమరియున్నది. ఈ విషయమును



**పఱ్పనాబ నుయఱ్వఱవుయిరుమ్ పెరున్దిఱలోన్**
**ఎఱ్పర నెన్నై యాక్కి క్కొణ్డెనక్కే తన్నై త్తన్ద**
**కఱ్పకమ్, ఎన్నముదమ్ కార్ముకిల్ పోలుమ్ వేఙ్గడనల్**
**వెఱ్పన్ విశుమ్బోర్ పిరా నెన్దై దామోదరనే**

(తిరువాయ్-2-7-11)

అనెడి నమ్మాళ్వార్ల శ్రీసూక్తివలన, దానికిగల పూర్వాచార్య వ్యాఖ్యానములవలన తెలియనగును. ఇచట "ఎనక్కే తన్నై త్తన్ద పరమోదారనాయ్...తిరుమలైయోడుళ్ళ సంబంధత్తాలే లబ్ధమాన (అడైయప్పట్ట) ఇన్ద ఔదార్యత్తై యుడైయనాయ్...ఆశ్రితపరాధీననాన ఎమ్బెరుమాన్ ఎన్నై యల్లదు అఱియాన్" అని ఆఱాయిరప్పడి వ్యాఖ్యానసూక్తి. ఇచట **"ఆశ్రితపరాధీననాన"** అనునది **"దామోదర"** పదముయొక్క అర్థము - అని ఇరుపత్తునాలాయిరప్పడిలో కలదు.

కావున, దామోదరుడు తననే ఆశ్రితులకు దానము చేసికొనును అనెడి రీతిలో పరమౌదార్యము అతనికి కల్గుటకు హేతువు **"వేఙ్గడ నల్ వెఱ్పన్"** అనెడి పదముచే తెలియజేయబడిన తిరుమలతోగల సంబంధమే - అనునది పైన ఉదాహరింపబడిన వ్యాఖ్యానసూక్తిచే స్పష్టమగుచున్నది. ఇట్లు **"వేఙ్గడనల్ వెఱ్పన్ దామోదరన్"** అనుచు నమ్మాళ్వార్లు అనుగ్రహించుటను దృష్టిలో నుంచుకొని గమనించినచో, ఈ అష్టోత్తరములోనున్న **"శ్రీశైలనిలయాయ, దామోదరాయ"** అనెడి రెండు తిరునామముల అర్థము తెలియబడుటతోపాటు, ఈ రెండింటికినిగల పౌర్వాపర్యసంగతి (ఒకదానికి పిమ్మట వేఱొకటి వచ్చుటలోగల కారణము) కూడ బాగుగా అర్థమగుచున్నది. **"తత స్తు దామోదరతాం స యయౌ దామబంధనాత్"** అని నిర్వచించిన రీతిలో స్వాత్మదానమును చేయునట్టి ఔదార్యమును కల శ్రీవేంకటేశ్వరుడగు దామోదరుని శరణు పొందుచున్నాను - అని ఈ నామముయొక్క భావము.

36. **ఓమ్ నీలమేఘనిభాయ శ్రీవేంకటేశాయ నమః**
(నీలమేఘవర్ణుడగు శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

ముందు నామములో పరమౌదార్యమనెడి దివ్యాత్మగుణము వర్ణింపబడినది. ఈ తిరునామములో దివ్యమంగళవిగ్రహముయొక్క ఔదార్యము అనుభవింపబడుచున్నది. పూర్వము తెల్పినట్లు ఋషులు భగవానుని

**నమః కిరీటినే నిత్యం నమః కౌస్తుభధారిణే ।**
**నీలమేఘప్రతీకాశవపుషే బ్రహ్మణే నమః ॥** (వామన-35)

("నీటిని తాగిన కారుమబ్బువంటి తిరుమేనినికల, పరబ్రహ్మ రూపియైన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను") అని పల్కి సేవించిరి అని ఈ నామమువలన తెలియుచున్నది.

మఱియు, ఈ తిరునామములో ప్రస్తావింపబడిన ఔదార్యము అనెడి గుణమే ఇందు వివరింపబడుచున్నదనియు చెప్పవచ్చును. అపుడు భగవానుని దివాత్మస్వరూపములో నున్న ఔదార్యగుణము, దివ్యవిగ్రహములోని నీలమేఘసదృశమైన నీలవర్ణరూపమునందు అమరియున్నది - అని తాత్పర్యము. అనంతరక్షణములో వర్షింపబోవు, నీటిని గ్రహించిన మేఘము నీలముగా నుండును ఆ మేఘము (ఎవరి సహాయమును) ప్రత్యుపకారమును ఎదురుచూడకనే అమృతమువంటి జలమును లోకమునకు అనుగ్రహించును. అట్టి, నీటిని నిండుగాకల మేఘమును దర్శించిన వెంటనే, తాపమును పొందినవారు పరమసంతోషమును పొందుటతో పాటు, దాని వర్షమువలన తాపము తీరి, పరమానందమును పొందెదరు. ఆ విధముగానే, పరమాత్మ అగు శ్రీనివాసుడు తన ఔదార్యముతో ఎట్టి ప్రతికృతిని ఆశింపకుండ సర్వపురుషార్థములను అనుగ్రహించును. ఈ శ్రీనివాసుని దర్శించిన వెంటనే సంసారమున కల్గిన పలు విధములైన దుఃఖములు అపుడే నశించుటతోపాటు, క్రమముగా సర్వవిధతాపములును తీరి, అమృతము అనదగిన మోక్షమును పొందుదురు. అందుచేతనే, ఆళ్వార్లవంటి మహనీయులు వేఱు దేవతలను ప్రార్థింపకుండ ఉత్తమ దేవతయగు శ్రీవేంకటేశ్వరునిమాత్రమే ప్రార్థింతురు. ఇది అంతయు నీలమేఘపదముచే సూచితము. ఈ అర్థమును వేదాంతదేశికులు దయాశతకమనెడి తమ స్తోత్రములో -

**వృషగిరికృష్ణమేఘజనితాం జనితాపహరం**
**త్వదభిమతం సువృష్టి ముపజీవ్య నివృత్తతృషః ।**
**బహుషు జలాశయేషు బహుమాన మపోహ్య దయే**
**న జహతి సత్పథం జగతి చాతకవత్ కృతినః ॥**

అని ప్రశంసించిరి. ఆళ్వార్లవంటి భక్తులు భగవానుని ఈ నీలవర్ణమునందు మిక్కిలి అభినివేశమును కల్గినవారయ్యిరి. ఇట్లు అందఱిని వశీకరించునట్టి కృష్ణవర్ణము భగవానునకు కలియుగవర్ణమని శాస్త్రములు తెలుపుచున్నవి. అట్టి మేఘవర్ణుడగు వేంకటేశ్వరుని శరణు పొందుచున్నాను - అని ఈ తిరునామముయొక్క భావము.



38. **ఓమ్ బ్రహ్మాదిదేవదుర్దర్శవిశ్వరూపాయ శ్రీవేంకటేశాయ నమః**
(బ్రహ్మ మొదలగువారిచేకూడ దర్శించుటకు వీలుకాని తేజస్సును, విశ్వరూపమును కల్గియున్న శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వము 31 నుండి మూడు తిరునామములలో భగవానుడు విశ్వరూపములో సేవను అనుగ్రహించిన తీరు తెలుపబడినది. దానికి పిమ్మట ప్రసంగవశమున మూడు నామములు వామనపురాణములోని ఆ ప్రకరణములోను అనుసరించియే ఏర్పడినవి. ఈ తిరునామములో ఆ విశ్వరూపముయొక్క గొప్పతనము, అపుడు చతుర్ముఖుడు మొదలగువారు పొందిన స్థితి వర్ణింపబడుచున్నది. భగవానుని దివ్యరూపమున ఈ బ్రహ్మాండమంతటిని దర్శించినపుడు చతుర్ముఖుడు మొదలగువారు మిక్కిలి ఆశ్చర్యమును, దిగ్భ్రాంతిని పొంది, భీతిల్లిరి. ఈ విషయము-

**వ్యాకులీకృతనేత్రా స్తే వ్యాకులీకృతమానసాః ।**
**వ్యాకులీకృతసర్వాంగాః ఆసన్ సర్వే భయాకులాః ॥**

(వారికన్నులు, మనస్సు, సర్వాంగములును వ్యాకులపడి, మిక్కిలి భయమును పొందినవి) అనెడి శ్లోకములో చెప్పబడినది. స్వామి విశ్వరూపసేవను అనుగ్రహించుటకు పూర్వక్షణములోనే భగవానుని తేజస్సును చూడలేక, కన్నులు మూసికొనిరి అనుటను -

**ఏతే సర్వే హరే స్తస్య రూపం పరపురంజయమ్ ।**
**ద్రష్టుం నాశక్నువన్ నేత్రైః తేజసా తస్య తాపితాః ॥**

అనెడి శ్లోకములో వర్ణింపబడినది.

తిరుమలలో వేంకటేశ్వరునకు ప్రతిదినము రాత్రివేళలో బ్రహ్మవచ్చి ఆరాధనము చేయుననీ, అతడు ఆరాధించిన తీర్థము మొదలగునవియే ఉదయమున విశ్వరూపదర్శన సమయములో సేవార్థులకు వినియోగింపబడుచున్నవనెడి ఐతిహ్యమును పెద్దలు చెప్పుదురు. దీనిని పరిశీలించినచో, బ్రహ్మకు భగవానుడు విశ్వరూపములో రాత్రిసేవను అనుగ్రహించుననియు, అదే సేవలో ఉదయమున మొదటదర్శనమును చేయువారికిని స్వామి తన సేవను అనుగ్రహించుచున్నాడనియు, అందుచేతనే మొదటిదర్శనమునకు విశ్వరూపదర్శనమను పేరు ఏర్పడినదనియు, అర్చారూపములో విశ్వరూపముతో సేవను చూపినది ఈ తిరుమలలో మాత్రము ఏర్పడుటచే, దానిని చూచి ఇచట విశ్వరూపసేవ అనునది ఉచితమనియు, ఈ దివ్యదేశమును చూచి మిగిలిన దివ్యదేశములలోను ఉదయమున మొదటి దర్శనమునకు విశ్వరూపదర్శనమని పేరు పెట్టిరనియు తోచుచున్నది - అని కొందఱు పెద్దలు చెప్పుట కలదు.

38. **ఓమ్ వైకుంఠాగతసద్ధేమవిమానాంతర్గతాయ శ్రీవేంకటేశాయ నమః**
(శ్రీవైకుంఠమునుండి వచ్చినదియు, మిక్కిలి ఉన్నతమై స్వర్ణముతో చేయబడిన విమానములోనుండి సేవను అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను.

శంఖరాజుయొక్క తపస్సునకు ఫలమును అనుగ్రహించుటకై భగవానుడు ప్రత్యక్షమై వచ్చినపుడు, చతుర్ముఖుడు మొదలగు దేవతలు, అగస్త్యుడు మొదలగు ఋషులును, ఇంకను పలువురు వచ్చి, స్వామిని విశ్వరూపములో సేవించి, ఆనందించిన వృత్తాంతము ఇంతవరకు తెలుపబడినది. ఇట్లు భగవానుడు సేవను అనుగ్రహించినపుడు వైకుంఠమునుండి ఈ తిరుమలకు వచ్చిన స్వర్ణమయమైన విమానము వారిచే సేవింపబడినది అనియు, ఆ విమానము అపుడపుడు అంతర్ధానమై, తిరికి తిరిగి కన్పించెననియును **"మాయాగూఢ"** ఇత్యాది 29వనామ వ్యాఖ్యలో వివరింపబడినది. ఆ విమానముయొక్క మహిమ ఈ తిరునామమునందు అనుభవింపబడినది.

మరీచి మహర్షి ప్రోక్త విమానార్చన కల్పము మొదలగు వైఖానసగ్రంథములలో విమానమను పదము సాక్షాత్తు భగవానుని నిర్దేశించునని వ్యాఖ్యానింపబడినది. భగవానునకుకల మహిమ విమానమునకును కలదు. విమానమునకు అధిష్ఠాతలగు దేవతలేకాక, సాక్షాత్తు భగవానుడే విమానమునందు సాన్నిధ్యమును కల్గియుండునని అభిప్రాయముతోనే పెద్దలు విమానమును మిక్కిలి భక్తితో సేవించుట, దాని నీడనుకూడ కాలితో తొక్కకుండ, మిక్కిలి గౌరవించుటయును ఆచారములోనికి వచ్చినది. ఇట్లు అన్ని ఆలయములలోగల విమానములకు విశేషమైన మహిమ ఉన్నపుడు ఈ తిరుమలలోనున్న ఆనందనిలయవిమానము స్వయంవ్యక్తమె - అనగా, సాక్షాత్తు వైకుంఠమునుండి వచ్చినది, అప్రాకృతమైనదియును అగుటచే దీని మహిమ మిక్కిలి అధికము. ఈ విషయము **"విమానం సర్వపాపఘ్నం సర్వలోకేషు విశ్రుతమ్, అప్రాకృత మనాద్యంతం వైకుంఠా దాగతం మహత్"** (వామన-39-7) అను మొదలగు శ్లోకములందు తెలుపబడినది. ఇట్టి మహిమనుకల ఈ విమానములో శ్రీనివాసప్రభువు వేంచేసియుండి, అగస్త్యుడు మొదలగువారికి సేవను అనుగ్రహించెను. కొంతకాలము భగవానుడు అంతర్ధానమై, ఈ విమానము మాత్రము వారికి గోచరించినదని, అందు ఆ అగస్త్యుడు మొదలగువారు 12 సంవత్సరముల కాలము తపస్సును చేసి, అష్టాక్షరీమహామంత్రమును జపించిరనియును వామనపురాణములోని ఈ ప్రకరణములో కలదు. ఈ విధముగా స్వామి అంతర్హితుడైనపుడు ఈ విమానములోనే చేరి, విమానరూపిగానే వేంచేసియుండెననుటయును ఈ తిరునామమువలన స్పష్టమగును. వైకుంఠమునుండి వచ్చిన ఆ విమానమే కలియుగములో మానవులచే పరిష్కరింపబడి, ఈ నాటికిని అందఱిచే సేవింపబడుచు, ఆనందనిలయవిమానముగా వ్యవహరింపబడుచున్నదని ఆ పురాణములోనే తెలుపబడినది. విమానమను పదము విశిష్టమైన మానము - ప్రమాణము - గొప్ప ప్రమాణము. అనగా భగవానుడు అనెడి. ఉన్నత ప్రమేయమును చూపు గొప్ప ప్రమాణము అను అర్థములో వ్యవహరింపబడినదని పెద్దలు వచించిరి. దీని మహిమకు అంతులేదు అను అర్థమునను ఈ పదము వ్యవహరింపబడవచ్చును. ఇట్టి విమానములో వేంచేసియున్న శ్రీనివాసుని శరణు పొందుచున్నాను-అని ఈ నామముయొక్క తాత్పర్యము.



39. **ఓమ్ అగస్త్యాభ్యర్థితాశేషజనదృగ్గోచరాయ శ్రీవేంకటేశాయ నమః**

(అగస్త్యమహర్షిచే ప్రార్థింపబడి, అందఱు జనుల కన్నులకును గోచరించు రీతిలో వేంచేసియుండు శ్రీవేంకటేశుని శరణు వేడుచున్నాను)

పూర్వనామములో అగస్త్యాదులకు భగవానుడు విమానములో సేవను అనుగ్రహించిన తీరు తెలుపబడినది. ఈ తిరునామములో అపుడు అగస్త్యుడు ప్రార్థించిన వరముయొక్క వివరము తెలుపబడుచున్నది. భగవానుడు, చతుర్ముఖుడు మొదలగు దేవతలను, ఋషులను చూచి, వారివారికి అవసరమైన వరములను ప్రార్థించినచో, నేను అనుగ్రహించుటకు సిద్ధముగానున్నాను-అని పల్కినపుడు, చతుర్ముఖుడు మొదలగువారు పలు వరములను ప్రార్థించిరి. వారికి ఆయా వరముల నిచ్చి, స్వామి పిమ్మట అగస్త్యుని చూచి, "నీవు నీకు అవసరమైన దానిని ప్రార్థింపుము" అని పలుకగా, అపుడా మహర్షి మొదట తనకు భగవానుని పట్ల నిరంతరమైన విశేషభక్తి నిలచియుండవలెనని ప్రార్థించి, పిమ్మట ప్రపంచములోనున్న, కలియుగమున జన్మించినవారివిషయమున మిక్కిలి కరుణను చూపి, ఉత్తమమైన ఒక వరమును వేడెను. అది ఏమనగా - ప్రపంచములో నున్న సర్వజనులును (జాతిమతభేదరహితముగా) భగవానుని ఆశ్రయించి, ఉజ్జీవించుటయే తనకు గొప్ప ఆనందమును కల్గించునని పల్కిన అగస్త్యుడు **"త్వం చ దృశ్యో వసేహేశ సర్వేషాం ప్రాణినా మపి"** (వామన-37-59) "స్వామీ! మీ పర్వతములో సకలప్రాణులను ఉజ్జీవించురీతిలో వారు కన్నులార దర్శించి ఆనందించునట్లు నిత్యసాన్నిధ్యమును వహించి, సేవను అనుగ్రహింపవలెను. నిన్ను సేవించి, అందఱును తమ కోఱికలను ఫలము చేసికొని, ఆనందింపవలెను. ఇదియే నా ముఖ్యమైన వరము''-అని ప్రార్థించెను. భగవానుడును ఈ మునియొక్క జీవకారుణ్యమును చూచి, ఆశ్చర్యపడి - **"అహం దృశ్యో వసామీహ శ్రీభూమిసహితోఽనఘ"** (వామన-37-59) నీవు కోఱినట్లే నన్ను అందఱును సేవించి, క్షేమమును పొందునట్లు నేను ఈ పర్వతముపై నిలచి, శ్రీదేవీ భూదేవీ సహితుడనై వసింతును -అనెను. ఆ మునికి వాగ్దానము చేసిన రీతిలోనే ఈనాటికిని ఈ పర్వతమునందు అందఱును సేవించునట్లు వేంచేసియుండి, సమస్తఫలములను ఇచ్చుచున్నాడు. ఇదియేకాక అపుడు అగస్త్యుని చూచి భగవానుడే క్రింది విధముగా పల్కెను.

**అన్యేఽపి యే మునీంద్రాస్మిన్ నారాయణగిరౌ నరాః ।**
**సమారుహ్యామలాం చేమాం స్వామిపుష్కరిణీం శుభమ్ ॥**
**దృష్ట్వా స్నాత్వాఽథ పీత్వా తు తస్యాః పుణ్యజలం శుభమ్ ।**
**అస్యా స్తీరే మహత్యస్మిన్ విమానే మదధిష్ఠితే ॥**
**మమ ప్రీతికరే పుణ్యే సర్వపాపహరే శుభే ।**
**భక్తా మా మర్చయిష్యంతి మయి సన్న్యస్తమానసాః ॥**
**దదామీష్టతమాన్ కామాన్ తేషా మపి సుదుర్లభాన్ ।**

**యే నరాః కుర్వతే విప్ర యోజనానాం శతేష్వపి ॥**
**ప్రణామం దిశ ముద్దిశ్య భక్త్యా మత్పర్వతోత్తమే ।**
**తే నరా మత్ప్రసాదేన పాపరాశిం వ్యపోహ్య వై ।**
**ప్రాప్నువంతి పదం పుణ్య మప్రవిష్టం దురాత్మభిః ॥** (వామన-37-61-66)

(ఓ మహర్షీ! ఎవరు ఈ నారాయణగిరిని ఎక్కి వచ్చి, స్వామిపుష్కరిణీ పుణ్యతీర్థములో నీరాడి, పరమపవిత్రమైన విమానములోనున్న నన్ను మనస్సున భక్తితో సేవించి పూజింతురో, వారికి గల అన్ని విధములైన ఇష్టములను పూర్తి చేసి, అనుగ్రహింతును. అట్లే, నూఱుయోజనముల దూరములోనున్నను ఎవడు ఈ కొండను ఉద్దేశించి నమస్కరించునో, అతడు నా అనుగ్రహముతో ఉన్నతపుణ్యలోకములను పొందగలడు) ఇట్లు అగస్త్యుని ప్రార్థనను అంగీకరించి, సర్వజనులకును సాక్షాత్కరించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని ఈ నామభావము.

40. **ఓమ్ వాసుదేవాయ శ్రీవేంకటేశాయ నమః**

(పరవాసుదేవరూపియగు శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

పూర్వనామములో అగస్త్యమహర్షికి వరమిచ్చిన విధము వర్ణింపబడినది. ఈ తిరునామములో వరము ఇచ్చిన శ్రీనివాసుడు వైకుంఠలోకములోనున్న సాక్షాత్ పరవాసుదేవుడే అనునది వివరింపబడుచున్నది. ఇచట పాఠకులు ముఖ్యముగా గమనింపవలసినది ఏమనగా-ఈ అష్టోత్తరము, మొదటినుండి చాలావరకు వామనపురాణమునే అనుసరించి ఏర్పడియున్నది అనునది అపుడు ఆయా స్థలములలో తెలియజేయబడినది. ఈ తిరునామము ఇచట ఏర్పడుటకు హేతువైన వామనపురాణ వృత్తాంత మిచట పేర్కొనబడుచున్నవి.

ఒకానొకసమయమున జనకమహారాజు, తన పుత్రికలగు సీత మొదలగువారి వివాహముకొఱకు చింతాక్రాంతుడైన సమయమున, అతని పురోహితుడగు శతానందుడు అతనికి కల్గిన చింతను పోగొట్టదలచి, భగవత్కథలను చెప్ప ప్రారంభించెను. వాల్మీకి ఆశ్రమములో నారదునిచే చెప్పబడిన వేంకటాచలమహాత్మ్యమును, శ్రీనివాసుని ప్రభావమును తాను వినిన రీతిలో తెలిపెను. దానిని వినిన జనకుడు అందు తృప్తిని పొందకుండ, ఇంకను ఆ మాహాత్మ్యమును తెలుపుమని శతానందుని అడిగెను. అపుడు మరల శతానందుడిట్లు పల్కెను. "ఓ జనకమహారాజా! నీ పేరునే కల్గిన నిమి అను ప్రభువుయొక్క పుత్రుడగు వేఱొక జనకుడు పూర్వము ఒకానొక సమయమున గంగానదీతీరములో యాగదీక్షను పొంది, యాగమును చేసినపుడు పలువురు మహర్షులు కూడియుండిరి. అపుడు వామదేవుడను మహర్షియు వారితో కలిసెను. అతడు భూమండలమందు అంతట తిరిగి వచ్చుటచే, అతనిని చూచి "శ్రీనివాసప్రభువు అపుడు ఎచట వేంచేసియున్నాడు? ఈ జనకునకును ఈ భగవత్కథను వినవలెనని మిక్కిలి ఆశగా ఉన్నది. అందుచే ఆ విషయమును తెలుపవలయును" అని మునులు కోరిరి.



అపుడు వామదేవుడు ఇట్లు సమాధానమిచ్చెను "నారాయణగిరి అనబడు వేంకటాచలముపై (గంగకు రెండువందల యోజనముల దూరములో నున్న) దేవగంధర్వవిద్యాధరాదులు తపస్సును చేయుచున్నారు. అచటికి నేను పోయినపుడు అగస్త్యుడు మొదలగు మహర్షులను చూచితిని. మీరు ఇచట నివసించుటకు ఏమి కారణములు? అని నేను అడుగగా, అగస్త్యుడు ఇట్లనెను. గోదావరీ తీరములో తపస్సును చేయు నారదుడు శ్రీవైకుంఠలోకములో పరవాసుదేవును చూడలేక బాధపడి, బ్రహ్మను చేరి, **"నివాస స్సర్వభూతానాం పరమాత్మా సనాతనః, క్వ ప్రయాతః పరో దేవః తన్మే బ్రూహి పితామహ"** (వామన-25-20) ప్రాణులన్నిటికిని నివాసమై, ఆధారమైన పరవాసుదేవుడు ఎచటికి పోయెను? చెప్పవలెను - అని అడిగెను. అపుడు బ్రహ్మ కొంచెము ధ్యానమును చేసి, నారదుని చూచి **"నారాయణ గిరిర్నామ భూమౌ క్వాపి మహామునే, తస్మిన్ హి రమయా సార్థం రమతే పురుషోత్తమః ప్రీత స్సుమహతీ జాతా తస్మిం స్తు గిరిమూర్ధని, గచ్ఛ నారద సర్వేశం ద్రష్టు మిచ్ఛసి చేత్ప్రభుమ్"** (వామన-25, 22-24) (భూలోకములోనున్న నారాయణగిరి పట్ల మిక్కిలి ప్రీతిని పొంది, పరమపురుషుడు అచటికి పోయెను. నీవు అచటికి పోయి స్వామిని సేవింపవచ్చును) అని పల్కెను. దానిని వినిన నారదుడు ఆ పర్వతమునకు పోవునపుడు మేము (అగస్త్యుడు మొదలగువారు ) దారిలో కలిసితిమి. అచట చతుర్ముఖుడును తన పరివారముతో కలిసి వచ్చెను. భగవానుడు ఎచట వెదకిన కన్పించలేదు. పిమ్మట బ్రహ్మ నారదుని, మమ్ములను చూచి, ఈ పర్వతముపై అన్ని చోట్ల పుణ్యతీర్థములలో ప్రదక్షిణముచేసి, వెదకి వచ్చుచున్నారు. ఎన్నినాళ్లకు పిమ్మట భగవానుడు ప్రత్యక్షమగునో, అంతవరకు ఇచటనే సంచరింపుడు - అని పల్కి అంతర్ధానమయ్యెను. పిమ్మట అగస్త్యుడు ఆ మునిసమూహముతో

**అగస్త్యోఽథ మహీపాల! తై రేవ మునిభి స్సహ ।**
**ప్రణమ్య తస్మై దేవాయ బ్రహ్మణే వ్యక్తజన్మనే ॥**
**చింతయన్ వాసుదేవాఖ్యం పరబ్రహ్మస్వరూపిణమ్ ।**
**ద్రష్టుకామ శ్చ తం దేవం వృషభాద్రినివాసినమ్ ॥**
**"ఉదీచీదిశ మభ్యాయాత్ తపసా చ సమన్వితః"** (వామన-25,34-35)

పరవాసుదేవరూపియగు శ్రీనివాసుని ఈ వృషభాద్రిలో చూడగోరి అన్ని దిక్కులలో వెదకిరి -అనుచు ఇట్లు కథను చెప్పి, చివరలో అగస్త్యాదులకు భగవానుడు ప్రత్యక్షమై సేవను అనుగ్రహించిన వృత్తాంతమును అంతటిని తెలిపి, చివరలో వామదేవుడు, జనకుడు అడుగకున్నను అతనిపట్లగల వాత్సల్యముతో ఒక రహస్యమును వ్యక్తపఱచెను. అది ఏమనగా-

**త్వయా స పృష్టం రాజేంద్ర గుహ్యాద్గుహ్యతమం మహత్ ।**
**అత్యద్భుత మిదం భూప శ్రుణుష్వ గదతో మమ ॥**
**నారాయణ గిరా వస్మి న్నాస్తే నారాయణః స్వయమ్ ।**
**గుహాసు చాపి సర్వాసు సర్వేషు శిఖరేషు చ ॥**

**కందరేషు చ సర్వేషు నిర్ఘరేషు శుభేషు చ ।**
**భగవాన్ దేవదేవేశః సర్వస్మిన్ గిరిమూర్ధని ॥**
**నానావిధాని రూపాణి బిభ్ర ద్విహరతి స్వయమ్ ।**
**క్వచి చ్చ మృగరూపేణ క్వచి న్మానుషరూపతః ॥**
**క్వచి చ్చ మృగరూపేణ క్వచి దృక్షాదిరూపతః ।**
**యత్ర కుత్రచి దాసీనః తస్మిన్ దివ్యే మహాగిరౌ ॥**
**దేవదేవం సమారాధ్య య ఉపాస్తే జనార్దనమ్ ।**
**కరోతి తస్య సాన్నిధ్యం భగవా నధిహృద్ధరిః ॥** (వామన-42,21-26)

ఈ నారాయణగిరిలో నారాయణుడు, వాసుదేవుడు అనెడి తన నామమునకు తగినట్లు, అన్నిచోట్ల - అనగా అన్ని గుహలయందు, అన్ని కొండవాగులయందు, పుణ్యతీర్థములలో, వృక్షములు, లతలు, మొదలగు వానియందును నివసించుచున్నాడు. ఆయా రూపములలో నున్నాడు. ఇట్లే, ఈ పర్వతమునందు దేవతలరూపములో, మనుష్యరూపములో, పక్షి-మృగరూపములో భగవానుడు నివసించుచున్నాడు. అన్నియు భగవత్స్వరూపములే. శ్రీవైకుంఠమును విడచి వచ్చిన పరవాసుదేవుడు **"సర్వభూతనివాసోఽసి వాసుదేవ నమోఽస్తు తే"** అనురీతిలో సర్వప్రాణిరూపమై నివసించుచున్నాను. అందుచే ఎవరైన ఈ పర్వతముపై ఎచటనైనను ఉండి, భగవానుని ధ్యానించి, పూజను చేసినను, అచట భగవానుడు సాన్నిధమును వహించి, అతని మనోవ్యాధిని పోగొట్టును - అని ఈ రీతిలో ఈ పర్వతముయొక్క, పరవాసు దేవరూపియగు శ్రీనివాసునియొక్క మహిమను వామదేవుడు వర్ణింపగా విని, జనకుడు (నిమిపుత్రుడు) ఆనందించి, తాను కూడ ఈ పర్వతమును చేరి, పరవాసుదేవుని శరణు పొంది సద్గతిని పొందెను - అను ఈ కథవామన పురాణములో నున్నది. అందువలన వామనపురాణమును అనుసరించి, ఏర్పడిన ఈ అష్టోత్తరములోనున్న ఈ సందర్భములోని **"వాసుదేవాయ నమః"** అనెడి ఈ నామమునకు సందర్భానుగుణముగా ఈ పురాణములో తెల్పిన రీతిలో పూర్వోదాహృత వృత్తాంతముయొక్క ఆద్యంతభాగములను (ఉపక్రమోసంహారములను) అనుసరించి, పరవాసుదేవుడే శ్రీనివాసునిగా అవతరించెననియు, అతడే ఈ పర్వతముపై సర్వచరాచరరూపిగానున్నాడని, అట్టి స్వామిని శరణు పొందుచున్నాననియు అర్థమును చెప్పుటయే పొసగును. కావున ఉపక్రమోసంహారాదుల తాత్పర్యమునుబట్టి పరవాసుదేవ మాహాత్మ్యమునే వామనపురాణము తెలుపుచున్నదని, ఆ పురాణమును అనుసరించి, అవతరించిన అష్టోత్తరశతనామస్తోత్రముకూడ ఆ మాహాత్మ్యమునే తెలుపుచున్నదని పల్కుట అతిశయోక్తి కాబోదు. అందుచే ఈ నామావళిలో ఈ నామమునకు అత్యంతము ముఖ్యమైన స్థానము కలదనియు చెప్పవలెను. వాసుదేవపదఘటితమగు మంత్రమును, ఉపనిషద్వాక్యములును, పలు ఇతిహాసపురాణ శ్లోకములును కలవు. అచట అచట ఆ వాసుదేవపదమునకు చెప్పబడు అర్థములు ప్రకృతకథాసందర్భానుగుణముగా ఈ



నామమునందుకూడ అన్వయించినచో వానినికూడ గ్రహింపవచ్చును. శ్రీనివాసుని కృష్ణునిగా భావించుట సంప్రదాయమగుటచే వాసుదేవపుత్రుడగు శ్రీకృష్ణుని శరణు పొందుచున్నాను అనెడి అర్థముకూడ ఇచట గ్రహింప వీలునున్నను అది ప్రకృతసందర్భానుగుణము కాదు.

41. **ఓమ్ హరయే శ్రీవేంకటేశాయ నమః**

(హరిస్వరూపియైన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందు నామములో వైకుంఠవాసియైన పరవాసుదేవుడే ఈ తిరుమలలో వేంకటేశుని రూపములో, ఈ కొండపైనున్న సకలచరాచరజీవులందును, దర్శనమిచ్చున్నాడని వామనపురాణములోని వృత్తాంతమునందలి ఆద్యంతభాగములను బట్టి నిర్ణయింపబడినది. ఇట్లు వాసుదేవుని నిర్ణయించుప్రకరణములోని

**యత్ర కుత్రచి దాసీనః తస్మిన్ దివ్యే మహాగిరౌ ।**
**దేవదేవం సమారాధ్య య ఉపాస్తే జనార్దనమ్ ॥**
**కరోతి తస్య సాన్నిధ్యం భగవా నధిహృద్ధరిః ।** (వామన-42,25-26)

అనెడి వామనపురాణశ్లోకము **"హరి"** అని వేంకటేశుని నిర్దేశింపబడెను. అచటగల **"హరిః"** అనెడి తిరునామమే ఇచట 41వ తిరునామముగా అమరియున్నది. **"వాసుదేవః"** అనెడి తిరునామమునకు పిమ్మట **"హరిః"** అనెడి ఈ తిరునామము ఏర్పడియుండుటకు కారణమేమి? అనగా, పరవాసుదేవుడు ఆ తిరునామమునకు తగినట్లు ఈ కొండలో అన్ని రూపములలో వేంచేసియున్నాడు. ఈ కొండలో ఏ వస్తువును ఎవడు దర్శించినను అతడు పరమాత్మనే దర్శించినట్లగును. అతని పాపములు వెంటనే నశించును. **"హరిః"** అనెడి నామమునకు **"హరిః ర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః, యదృచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యే వ హి పావకః"** (దుష్టచిత్తమును కలవారిచే స్మరింపబడినను భగవానుడు అతని పాపములను పోగొట్టును. అగ్ని తనస్వరూపమునకు తగినట్లుగా అబుద్ధిపూర్వకముగా తనను తాకినవానినికూడ దహించునుకదా) అనుమొదలగు ప్రమాణములనుబట్టి పాపములను హరించువాడని అర్థము. కావున సర్వజనముల పాపములను పోగొట్టుటకై, ఆ పరమపురుషుడగు వాసుదేవుడు ఇచట వేంకటేశుని రూపములో మిగిలిన చరాచరవస్తురూపములందును సన్నిహితుడైయున్నాడు. ఇట్లు ఆ రెండు తిరునామములకు గల (వాసుదేవః, హరిః) సంబంధమును తెలుపుటకే పూర్వము తెల్పిన వామన పురాణశ్లోకములో **"భగవానధిహృ ద్ధరిః"** అని నిర్దేశింపబడినది.

మఱియు ప్రళయకాలములో బ్రహ్మరుద్రాదులతో పాటు సర్వప్రపంచములను హరించువాడు ఈ వేంకటేశుడే అను అర్థమును చెప్పవచ్చును. దీనిచే బ్రహ్మమునకు చెప్పిన లక్షణములలో జగత్సంహారకర్తృత్వము అనెడి లక్షణము ఇచట వేంకటేశునకు చెప్పినట్లు ఏర్పడుటచే ఇతడే పరబ్రహ్మమని సిద్ధించుచున్నది. ఇట్టి వేంకటేశుని శరణు పొందుచున్నాను-అని ఈ తిరునామముయొక్క అర్థము.

**42. ఓమ్ తీర్థపంచకవాసినే శ్రీవేంకటేశాయ నమః**

(పంచతీర్థమనెడి పుణ్యతీర్థములో నివసించు శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

పూర్వనామములో శ్రీవేంకటేశుడు తిరుమలలో చరాచరరూపియైయుండి, అందటి పాపములను పోగొట్టుచున్నాడని వర్ణింపబడినది. ఈ నామములో అందులకొక ఉదాహరణము వామనపురాణమును అనుసరించి చూపబడుచున్నది. ఈ పర్వతములో అనేక పుణ్యతీర్థములున్నవి. వానియందు భగవానుడు సాన్నిధ్యమును పొందియున్నాడు. అందుచే అవి విశేషపుణ్యతీర్థము లనబడుచున్నవి. వానియందు స్నానపానాదులను చేయువారికి సర్వపాపములును తొలగును. ఇట్టి వైభవమును కల్గిన వేలాది సంఖ్యలోనున్న ఈ పర్వతమునందలి పుణ్యతీర్థములలో పంచతీర్థములనబడు అయిదు తీర్థములందు భగవానుడు వరాహరూపియైయుండి భక్తులను అనుగ్రహించుచున్నాడు – అనెడి వృత్తాంతము వామనపురాణములో 30వ అధ్యాయమునందు వర్ణింపబడినది.

జనకుడు ఈ పర్వతములోనున్న పుణ్యతీర్థముల మహిమను మరింతగా వినుటకై మిక్కిలి ఆసక్తిని కలవాడై, దానిని చెప్పుమని వామదేవుని అడిగెను. అతడును "వానిని అన్నిటిని 100 వర్షముల పాటు చెప్పినను పూర్తికాదు, అయినను సంగ్రహముగా తెల్పెదను వినుము" అని పల్కి, కొన్ని తీర్థముల పేర్లను పేర్కొనినపుడు పంచతీర్థమనబడు ఒక తీర్థము అను యొక్క మహిమను తెలుపవలసినదిగా ప్రార్థింపగా, వామదేవుడు పల్కెను. కపిలతీర్థ మనెడి పుణ్యతీర్థమునకు పడమటిభాగమున ఈ పంచతీర్థము నెలకొనియున్నది. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, ఛండాలురు – అనెడి అయిదు జాతులకు చెందినవారికొఱకు ఈ అయిదు తీర్థములు ఏర్పడినవి. ఈ తీర్థములలో ఈ అయిదు జాతుల అభిమాని దేవతలు నివసింతురు. వారు సాక్షాత్తు వేంకటేశుని ధ్యానము చేయుచు తపస్సును చేయుదురు. అందు పడమరభాగములో బ్రాహ్మణతీర్థము, దానికిక్రింద క్షత్రియతీర్థము. ఇట్లు మెట్టు మెట్టుగా క్రింది క్రింది భాగమున ఆయా తీర్థములును, చివరిది అగు పంచమతీర్థము పర్వతపాదప్రాంతమున కలవు. వానిలో స్నానమును చేయువారు సర్వపాపములను పోగొట్టుకొని, తమ మనోరథములను పొందెదరు వర్ణాశ్రమధర్మములు లోపించినవాడు వీనియందు స్నానమును చేసినచో ఆ లోపము పోయి, ఆ ఆచారములందు ఆసక్తిని కలవాడగును. వరాహరూపియగు భగవానుడు వీనియందు సర్వదా సాన్నిధ్యమును పొందియుండును. ఈ వృత్తాంతమును ఈ క్రిందిశ్లోకములు తెలుపుచున్నవి.

**జనకః నామాని తేషాం తీర్థానాం పర్వతేంద్రనివాసినామ్ ।**
**మాహాత్మ్యం చాపి సర్వేషాం పాపహాని వదస్వ మే ॥**
**వామదేవః–శ్రూయతాం నృపతే వక్ష్యే యత్పృష్టేహ మిహ త్వయా ।**
**విస్తరా న్నైతదాఖ్యాతుం శక్యం వర్షశతై రపి ॥**
**సంక్షేపేణ మయా త్వేత త్కథ్యమానం నిశామయ ।**



**వారాహం వామనం సౌమ్యం దివ్యం పంచనదం తథా ॥**
**పంచతీర్థం మహాపుణ్యం సర్వలోకేషు పూజితమ్ ।**
**తీర్థాన్యేతాని పుణ్యాని విద్యతే వేంకటాచలే ॥**
**జనకః – పంచతీర్థ మితి ప్రోక్తం యత్త్వయా మునిసత్తమ ।**
**త న్మే బ్రూహి మహాభాగ శ్రోతు మిచ్ఛామి తత్త్వతః ॥**
**వామదేవః–కాపిలం నామ యత్తీర్థం తస్య పశ్చిమభాగతః ।**
**పంచతీర్థ మితి ఖ్యాతం పావనం పుణ్యవర్ధనమ్ ॥**
**విప్రక్షత్రియవిట్శూద్రాః యే చాన్యాః పాపయోనయః ।**
**తేషాం క్రమేణ తీర్థాని పంచైతాని నరోత్తమ ॥**
**దేవా స్తత్ర తపస్యంత పంచజాత్యభిమానినః ।**
**వారాహరూపిణం దేవ మంజనాద్రినివాసినమ్ ॥**
**అర్చయంత స్తువంత శ్చ సదా తద్భావభావితాః ।**
**ఉపరి ప్రథమం తీర్థం బ్రాహ్మణానాం శుభోదకమ్ ॥**
**సద్య స్సిద్ధికరం తేషాం స్నానపానజపాదిభిః ।**
**చతుర్ణా మప్యధస్తా త్తు చండాలానాం చ పాపినామ్ ॥**
**వారాహరూపీ భగవాన్ విష్ణు ర్భక్తానుకంపయా ।**
**తేషు పంచసు తీర్థేషు సాన్నిధ్యం కురుతే సదా ॥**
**తేషా మన్యతమం తీర్థం సేవమానో నరో నృప ।**
**తాం స్తాం శ్చ సర్వ మాప్నోతి కామాం స్తీర్థప్రభావతః ॥** (వామన–30–1–22)

**43. ఓమ్ వామదేవప్రియాయ శ్రీవేంకటేశాయ నమః**

(వామదేవునకు ప్రియుడగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వపునామములో వామదేవుడు జనకునకు చెప్పిన పంచతీర్థమాహాత్మ్యము వర్ణింపబడినది. ఈ తిరునామములో ఆ వామదేవమహర్షియొక్క ప్రభావమును వర్ణించుట ద్వారా శ్రీవేంకటేశుని మహిమ వర్ణింపబడుచున్నది.

వామనపురాణము (వేంకటాచలమహాత్మ్యవర్ణనాభాగము) నిమిపుత్రుడగు జనకునకును, వామదేవమహర్షికిని ఏర్పడిన వేంకటాచలవిషయమైన సంవాదమును వేఱొకకాలములో శతానందుడు, సీతాదేవితండ్రి అగు జనకమహారాజునకు చెప్పినట్లుగా ఉన్నదనుట 40వ తిరునామవ్యాఖ్యలో విశదముగా తెలుపబడినది.

ఈ పర్వతమునందున్న తీర్థములు మొదలు దేనియొక్క ప్రభావము వర్ణింపబడినను, అవి అన్నియు భగవానునకు చెందినవియే అగును. భగవద్రూపముగను, అతని సాన్నిధ్యము వానియందు ఉన్నట్లును ఒక్కొక్క వస్తువును నెలకొనియుండుటచే అతనివలన వానికి అట్టి మహిమ ఏర్పడుచున్నదనుటలో సందేహము లేదు. కావున

వామదేవమహర్షి నూఱు వర్షములకుపైగా ఈ పర్వతములో బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి, తన్మూలముగా ఈ పర్వతములోని స్వామిపుష్కరిణిమాహాత్మ్యమును తాను విన్నట్లు జనకమహారాజునకు ఉపదేశించుటకూడ భగవానుని మహిమను వ్యక్తీకరించుటయందే పర్యవసించును. వామదేవుడు తనవృత్తాంతమును తెల్పిన కథ వామనపురాణము 43వ అధ్యాయములో కలదు.

వామదేవుడు నూఱు సంవత్సరములు తపస్సు చేసి, బ్రహ్మదేవుని ప్రత్యక్షముచేసికొని, అతనిని ఈ తిరుమలలోనున్న స్వామిపుష్కరిణీమహాత్మ్యమును, దాని తీరములో చేయు దానమునకుగల మహిమను యథాతథముగా నాకు చెప్పవలెనని ప్రార్థించెను. బ్రహ్మయు చంద్రుడు, మన్మథుడు, ఇంద్రుడు, కుచేలుడు, వాక్పతి అనెడి బ్రహ్మణుడు - వీరు ఈ పుష్కరిణీ తీరమునందు చేసిన ఆయా దానములవలన వారు కోటిన ఉత్తమఫలములను పొందిరి. దీనికంతటికిని ఇచట వేంచేసియుండు భగవానుడే కారణము. ఆ స్వామికి నేను భాద్రపదమాసములో ఉత్సవమును జరిపించితిని. ఈ ఉత్సవమును సేవింపవలెనని వచ్చు భక్తులకు సేవచేయుటచే ఏర్పడు పుణ్యము చాల అధికము" అని పలురీతులలో భగవానుని ప్రభావమును వర్ణించెను. వామదేవుడు దానిని విని ఆనందించెను. ఇట్లు వామదేవునకు మిక్కిలి ప్రియమైన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని ఈ తిరునామముయొక్క అర్థము.

ఇంతియేకాక, వామదేవుడు ఏ పరమపురుషునకు మిక్కిలి ప్రియమైనవాడో, ఆ వేంకటేశుని శరణు పొందుచున్నాను-అను అర్థమునుకూడ ఈ నామమునకు చెప్పవచ్చును. వామదేవుడు శాస్త్రము తెలిపినవారిలో ఉత్తముడనుట **"శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్"** (1-1-31) అనెడి బ్రహ్మసూత్రమువలన, **"యథా వామదేవః పరస్య బ్రహ్మణః సర్వాంతర్యామిత్వం, సర్వస్య చ తచ్ఛరీరత్వం, శరీరవాచినాం శబ్దానాం శరీరిణి పర్యసానం పశ్యన్, అహ మితి స్వాత్మశరీరకం పరం బ్రహ్మ నిర్దిశ్య, తత్సామానాధికరణ్యేన మనుసూర్యాదీన్ వ్యపదిశతి"** అనెడి శ్రీభాష్యసూక్తి మొదలగు ప్రమాణములందు స్పష్టము. ఇట్టి జ్ఞానిని భగవానుడు **"జ్ఞానీత్వా త్మైవమే మతమ్"** అని గీతలో తెల్పిన రీతిలో తనకే అంతరాత్మవలె లెక్కించెను. అందుచే శ్రీవేంకటేశునకు ఆత్మ అనునంతటి ప్రియమైనవాడు బ్రహ్మజ్ఞానియైనవాడు వామదేవుడు. ఇట్లు వామదేవుని ప్రియముగా కల్గిన శ్రీనివాసుని శరణు పొందుచున్నాను అని ఇచటి భావము-ఈ వామదేవుడు తాను తపస్సు చేసి, చతుర్ముఖుని మూలమున తెలిసిన భగవత్ప్రభావముయొక్క వివరము ఈ క్రింది శ్లోకములందు వ్యక్తము.

**వామదేవః-పూర్వం భూమిధరేంద్రేఽస్మిన్ బ్రహ్మాణం కమలాసనమ్ ।**
**ఉపాసీన స్సమాసీనో వర్షాణాం మధికం శతమ్ ॥**
**స్వయ మేవ చతుర్వక్త్రః మాం ప్రబోధ్య జనాధిప ।**



**వరం వరయ భద్రం తే యదిచ్ఛసి మహామునే ॥**
**స్వామిపుష్కరిణీ యేయ మత్రాస్తే పర్వతోత్తమే ।**
**తస్యా ఏవ తు మాహాత్మ్యం జ్ఞాతు మిచ్ఛామి తత్త్వతః ॥**
**అస్యా స్తీరే చ దానానాం యుత్ఫలం తద్వదస్వ మే ।**
బ్రహ్మ - **ధరణ్యాం నిత్యసాన్నిధ్యం వేంకటాద్రౌ విశేషతః ।**
**తస్మా త్తత్రైవ కార్యాణి మహాదానాని పార్థివైః ॥**
**మాసి భాద్రపదే పుణ్యే శుక్లపక్షే తు చైత్రభే ।**
**స్వామిపుష్కరిణీతీరే దేవస్య పరమాత్మనః ॥**
**ఉత్సవః కారితః పూర్వం మయైవ ప్రీతయే హరేః ।**
**కిమనేన బహునోక్తేన యః స్వామిసరస స్తటే ॥**
**యత్కించి త్కురుతే పుణ్యం తస్యాంతో నైవ విద్యతే** (వామన 43-18-40)

44. **ఓమ్ జనకేష్టప్రదాయ శ్రీవేంకటేశాయ నమః**
(జనకమహారాజునకు ఇష్టమును అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందునామములో నిమిపుత్రుడగు జనకునకు ఉపదేశించిన వామదేవుని మహిమ తెలుపబడినది. ఇందు అతనివద్ద ఉపదేశమును పొందిన జనకుని వృత్తాంతము చెప్పబడుచున్నది. అట్లే, ఈ ఇద్దఱిమధ్య జరిగిన సంభాషణను సీతాదేవి తండ్రి అగు జనకునకు శతానందుడు చెప్పగా, దానిని వినిన జనకుడు పొందిన ఫలములు వామనపురాణములోని 43,4వ అధ్యాయములలో వర్ణింపబడినవి. జనకుని ప్రభావము, ఛాందోగ్యము మొదలగు ఉపనిషత్తులయందు, **(జనకో జనక ఇతి జనా ధావంతి) "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః"** అను గీతావాక్యమున, పురాణములందును విశేషముగా వర్ణింపబడియున్నది. అట్టి ప్రభావమునుకల జనకుడు శతానందునివలన శ్రీనివాస ప్రభువుయొక్క, ఈ తిరుమలయొక్క, ఇచటగల పుణ్యతీర్థములయొక్క మహిమను వినగానే, మంత్రులతో తాను నేరుగా ఈ కొండకు వచ్చి, స్వామిపుష్కరిణిలో స్నానమును చేసి, శ్రీదేవి, భూదేవులతో కూడియున్న పరమపురుషుని చిరకాలము సేవించి, సర్వఫలములను పొంది, తిరిగి తన రాజ్యమునకు చేరి సుఖముగా రాజ్యపరిపాలనమును చేసెను. ఈ కథను క్రింది శ్లోకములందు గమనించపవచ్చును.

శ్రీవేదవ్యాసః - **ఏతచ్ఛ్రుత్వా తు జనకః శతానందోదితం సదా।**
**ప్రహర్ష మతులం లబ్ధ్వా మంత్రిభి స్సహితో నృపః ॥**
**గత్వా వృషాచలం తీవ్రం స్వామిపుష్కరిణీజలే ।**
**స్నాత్వా దృష్ట్వాథ దేవేశం శ్రీభూమిసహితం తతః ॥**
**తత్ర స్థిత్వా చిరం కాలం సర్వాన్ కామా నవాప్య చ ।**
**ఆగత్య మిథిలాం రాజా శశాస పృథివీ మిమామ్ ॥**
(వామన 44-42-44)

ఈ విధముగానే, నిమిపుత్రుడగు జనకుడును వామదేవునివద్ద ఉపదేశమును పొందిన పిమ్మట మిక్కిలి సంతోషమును పొంది, తాను చేసిన యాగమును ముగించుకొని, మంత్రులవద్ద రాజ్యపాలనమును అప్పగించి, ఈ పర్వతములో సాక్షాత్తు పరబ్రహ్మరూపియైన శ్రీనివాసుని సేవించుటకు వచ్చెను - అనెడి వృత్తాంతముకూడ ఈ క్రిందిశ్లోకములందు తెలుపబడినది.

**వామదేవః- ఇత్యుక్త్వా భగవాన్ బ్రహ్మా లోకకృ ల్లోకపూజితః ।**
**అంతర్దధే తదా తస్మాత్ శ్రుతమేత న్మయా పురా ।**
**శతానందః- ఇతీరితం తన్మునినా సమస్తం శ్రుత్వా మహౌజా జనకో మహాత్మా ।**
**ప్రఫుల్లనేత్రః పులకాంచితాంగః నారాయణాద్రిం ప్రయయౌ ప్రహృష్టః ॥**
**సమాప్య యజ్ఞం జనకో మహాత్మా ధురం ధరిత్ర్యా స్సచివే నియోజ్య ।**
**ద్రష్టుం పరం బ్రహ్మ వృషాద్రిమూర్ధ్ని స్వయం యతా మైథిలిరాజరాజః**
(వామన-43-41-43)

45. **ఓమ్ మార్కండేయమహాతీర్థజాతపుణ్యప్రదాయ శ్రీవేంకటేశాయ నమః**
(శ్రీమార్కండేయమహర్షికి, అన్ని పుణ్యతీర్థముల సమూహమందు స్నానము చేయుటచే ఏర్పడు పుణ్యమును అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో, వామనపురాణములో చివరగా 43వ అధ్యాయములో తెలుపబడిన జనకుని వేంకటాచలయాత్ర వర్ణింపబడినది. ఈ తిరునామములో అదే అధ్యాయములో చెప్పబడు మార్కండేయ మహర్షియొక్క వేంకటాచలయాత్ర వర్ణింపబడుచున్నది. అది ఈక్రిందివిధముగా నున్నది. శతానందమునిని జనకమహారాజు ఈ వేంకటాచల పర్వతములోనున్న స్వామిపుష్కరిణిలోనికి ముల్లోకములోనున్న సర్వపుణ్యతీర్థములును ఎట్లు ఎప్పుడు వచ్చును? అని ప్రశ్నించినపుడు శతానందుడు ఇట్లు పల్కెను. ''పూర్వము ఒకానొక సమయమున మార్కండేయమహర్షి గంగానదీతీరములో చతుర్ముఖునిగూర్చి తపస్సును చేయగా, అతడును ప్రత్యక్షమై, అపేక్షితవరములను అడుగుమని మార్కండేయునితో పలుకగా, "స్వర్గము, భూమి, పాతాళము - అను మూడులోకములలో ఎన్ని పుణ్యతీర్థములున్నవో అన్ని తీర్థములందు స్నానము చేసి వచ్చుటకు తగిన శక్తిని నాకు అనుగ్రహింపుమని" ఆ ముని ప్రార్థించెను. బ్రహ్మ నవ్వి, "ఇది ఎవరికిని సాధ్యము కాని పని, నావలన కూడ వీలుకాదు. అందుచే, అన్ని పుణ్యతీర్థములందు స్నానమాడిన పుణ్యము నీకు వచ్చు. ఒక ఉపాయము కలదు. దానిని తెలిపెదను. తదనుగుణముగా చేయుము.'' అని పల్కి, ఈ వేంకటాచల ప్రభావమును విశేషముగా వర్ణించి, "అచటగల స్వామి పుష్కరిణి లోకములోని తీర్థముల కన్నిటికిని **''స్వామి''** అనగా గొప్పది. మార్గశిరమాసము శుక్లపక్షద్వాదశినాడు అరుణోదయసమయమున మూడు లోకములలో గల 31/2 కోట్ల పుణ్యతీర్థములును



అందు వచ్చి చేరును. మిగిలిన తీర్థములు తమవద్దగల పాపములను ఇచటకు వచ్చి చేరుటద్వారా పోగొట్టుకొనుచున్నవి. ఓ మార్కండేయమునీ! నీవు ఇంతటి మహిమను కల్గిన ఆ పుష్కరిణీతీర్థమునకు మార్గశీర్షశుక్ల ద్వాదశినాడు పోయి స్నానము చేసినచో, అన్ని పుణ్యతీర్థములందు స్నానము చేయుటవలన కల్గు పుణ్యమును పొందవచ్చును" అనెను. మార్కండేయుడును ఆ విధముగానే ఆ పర్వతమునకు వచ్చి, అచట మూడు సంవత్సరముల కాలముండి, ఆ పుణ్యకాలములో ఆ స్వామిపుష్కరిణిలో స్నానము చేసి, అన్ని పుణ్యతీర్థములు స్వామి పుష్కరిణిలో చేరు రీతిని దర్శించి, శ్రీనివాసుని అనుగ్రహముతో అన్ని పుణ్యతీర్థములందు స్నానమాడిన పుణ్యమును పొందెను. ఈ వృత్తాంతము మార్కండేయపురాణములో ఇంకను వివరముగా చెప్పబడినది. మార్కండేయుడు తీర్థయాత్రను చేయదలచి వచ్చినపుడు కాశిలోని గంగలో స్నానము చేయు సమయమున గరుడునితో కలిసి, అతనితో తనకుగల సర్వతీర్థములందు స్నానమాడవలెనను తన కోరికను తెలుపగా, గరుడుడు అది అసాధ్యమని పల్కి, వేంకటాచల మహిమను వర్ణించి, అచటగల స్వామి పుష్కరిణిలో స్నానము చేసినచో అన్ని పుణ్యములు లభించునని ఉపదేశింపగా, మార్కండేయుడును, **"శుద్ధ"** దను అగస్త్యముని శిష్యునితో కలసి, ఈ పర్వతమునకు వచ్చి, స్వామి పుష్కరిణిలో స్నానమాడి, భగవానుని దర్శించి, తాను భగవానునిపట్ల నిరంతరమైన భక్తికి కల్గియుండవలెనను వరమును పొంది, సర్వపుష్కరిణీ తీర్థ స్నాఫలమును పొందెనని ఆ మార్కండేయపురాణవృత్తాంత సారాంశము. అపుడు మార్కండేయుడు శ్రీనివాసుని మిక్కిలి విశేషముగా స్తుతించెను. అచటగల కొన్ని వాక్యములు ఈనాడు నిత్యము అనుసంధింపబడు శ్రీనివాసస్తోత్రములో కన్పించుచున్నవి. అవి ఏవి? అనగా -

**వినా వేంకటేశం న నాథో న నాథ స్సదా వేంకటేశం స్మరామి స్మరామి ।**
**హరే వేంకటేశ ప్రసీద ప్రసీద ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ ॥**
**అహం దూరత స్తే పదాంభోజయుగ్మప్రణామేచ్ఛయాగత్య సేవాం కరోమి ।**
**సకృత్సేవయా నిత్యసేవాఫలం త్వం ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో వేంకటేశ॥**
**అజ్ఞానినా మయా దోషా నశేషా న్విహితాన్ హరేః ।**
**క్షమస్వ త్వం క్షమస్వ త్వం శేషశైలశిఖామణే ॥**

ఇట్లు మార్కండేయ మునికి అన్ని పుణ్యతీర్థసమూహములో స్నానమొనర్చుటవలన కల్గు పుణ్యమును అనుగ్రహించిన శ్రీవేంకటేశుని ఈ శరణు పొందుచున్నాను అని ఈ నామము యొక్క భావము.

46. **ఓమ్ వాక్పతిబ్రహ్మదాత్రే శ్రీవేంకటేశాయ నమః**
(ఏ వేంకటేశుని అనుగ్రహముతో **'కావ్యవిత్'** అను బ్రాహ్మణుడు వేఱొక బ్రాహ్మణునకు బ్రహ్మజ్ఞానమును ఉపదేశించి, వాక్పతి అను బృహస్పతి పదమును పొందెనో, అట్టి వేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందునామములో మార్కండేయునకు సర్వపుణ్యతీర్థఫలమును స్వామి పుష్కరిణీప్రభావమువలన లభించినదని వామనపురాణము 44వ అధ్యాయములోగల కథను అనుసరించి తెలుపబడినది. ఈ తిరునామములో, దీనికి పిమ్మటగల తిరునామములోనే అదే వామనపురాణము 43వ అధ్యాయములోగల విషయములను అనుసరించి, ఆ స్వామి పుష్కరిణియొక్క ప్రభావమును వర్ణించి, దానిద్వారా శ్రీనివాసుని మహిమ తెలుపబడుచున్నది.

నిమికుమారుడగు జనకునకు ఉపదేశమును చేసిన వామదేవుడు తన అనుభవమును తెలుపునపుడు తనకు సాక్షాత్తుగా చతుర్ముఖుడు ఉపదేశించిన ఈ వేంకటాచలముయొక్క, స్వామి పుష్కరిణియొక్క ప్రభావమును, దీనికంతటికిని మూలమైన పరమపురుషుడు అగు శ్రీనివాసుని మహిమను వర్ణించెను. అపుడు కావ్యవిత్ అనెడి ఒక బాహ్మణుడు ఈ తిరుమలలోని స్వామి పుష్కరిణీతీరమున బ్రహ్మజ్ఞానమును పొందగోరి వచ్చిన ఒక బ్రాహ్మణుని తానుగానే పిలచి, బ్రహ్మజ్ఞానమును ఉపదేశించి, దానికి ఫలముగా తాను వాక్పతి (బృహస్పతి) అయ్యెను-అనెడి వృత్తాంతమును తెలిపెను. ఇట్లు ఆ కావ్యవిత్ బృహస్పతి అగుటకు ఈ తిరుమల క్షేత్రము కారణమనగా, దానికి ఆ క్షేత్రాధిపతి అయిన శ్రీనివాసుడే కారణమని పర్యవసించుటచే, ఈ గొప్పతనమును భగవానునకే చెందునని ఈ తిరునామము పల్కుచున్నది. లేక, 48వ తిరునామములో భగవానుడే నారాయణగిరి రూపిగా వర్ణింపబోవుటచే ఈ పర్వతము ఈ ఫలమును అనుగ్రహించినదనగా, అది పర్వతరూపియైన భగవానుడే ఇచ్చినట్లయినదనియు చెప్పవచ్చును. ఈ విషయమును ఈ క్రిందిశ్లోకముల ద్వారా తెలియవచ్చును.

**అస్మిన్ గిరౌ పురా కశ్చి దాగత్య బ్రాహ్మణోత్తమః ।**
**జిజ్ఞాసుం కావ్యవి న్నామ బ్రహ్మజ్ఞానస్య మానద ॥**
**స్వయ మాహూయ విప్రేంద్రం బ్రహ్మజ్ఞాన మనుత్తమమ్ ।**
**దదత్పరమధర్మాత్మా వాచస్పతి రభూ న్మునే ॥**
(వామన-43-29-30)

ఇచట **"వాక్పతిబ్రహ్మధీదాత్రే"** అను వేఱొక పాఠము ప్రాచీనతెలుగులిపిలో ముద్రించిన ఒకానొక ప్రతిలో కనుపించుచున్నది. దానికికూడ పూర్వము తెల్పినదే భావము. ఇదికాక, ఈ తిరునామమునకు వాక్పతి అనగా వాక్ అనబడు సరస్వతికి భర్త అయిన చతుర్ముఖునకు, సృష్ట్యారంభకాలములో బ్రహ్మ మనబడు వేదమును అనుగ్రహించుటచే శ్రీనివాసుడు వాక్పతిబ్రహ్మదాత అగుచున్నాడు, ఇదియే ఈ తిరునామముచే తెలుపబడుచున్నది అని, ఈ వామనపురాణములోనే ఆరంభమున శంఖరాజుతో పాటు భగవానుని సేవింపవచ్చిన బృహస్పతికి బ్రహ్మ మనబడు తననే అనుగ్రహించిన శ్రీనివాసుని ఈ తిరునామము తెలుపుచున్నదనియు అర్థమును చెప్పువారును కలరు. వామనపురాణములో ఒకవిధమైన క్రమమును అనుసరించి క్రమముగా ఈ నామావళి



ఏర్పడినదియై, మొదటినుండి తెలుపబడుటచే, దానికి తగినట్లు ఈ ప్రకరణములో తెలుపబడిన వృత్తాంతమే పొసగును కనుక ఇట్లు వ్యాఖ్యానింపబడినది. **"వాక్పతిః బ్రహ్మధీదేవతా యస్మాత్ సః"** - ఏ పరమపురుషునిచే బ్రహ్మజ్ఞానమును అనుగ్రహించిన కావ్యవిత్ వాక్పతి అయ్యెనో (బృహస్పతి అయ్యెనో) ఆ శ్రీనివాసుని శరణు పొందుచున్నాను - అని ఈ తిరునామముయొక్క భావము.

47. **ఓమ్ చంద్రలావణ్యదాయినే శ్రీవేంకటేశాయ నమః**
(చంద్రునకు లావణ్యమును అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ఈ తిరునామమునకు సంబంధించిన అవతారిక పూర్వనామవ్యాఖ్యలోనే తెలుపబడినది. దీనియందున్న వృత్తాంతముకూడ అదే వామనపురాణము 43వ అధ్యాయములో వామదేవుని ఉపదేశప్రకరణములోనున్నది. ఈ స్వామిపుష్కరిణీతీరములో చంద్రుడు స్వర్ణాభరణదానమును చేసి, గొప్ప లావణ్యమును పొందెను - అని ఉపదేశించి, ఈ పర్వతముయొక్క గొప్పతనమును తెలుపబడినది. దీనిని ఈ క్రింద ఉట్టంకింపబడిన శ్లోకమువలన తెలియవచ్చును.

**బ్రహ్మ-అస్యా స్తీరే పురా బ్రహ్మన్ చంద్రః క్షీరోదసంభవః ।**
**సౌవర్ణం భూషణం దత్వా లావణ్యం పరమం యయౌ ॥** (వామన-43-26)

43. **ఓమ్ నారాయణనగేశాయ శ్రీవేంకటేశాయ నమః**
(నారాయణగిరికి అధిపతియైన వేంకటేశుని శరణుపొందుచున్నాను)

ముందు నామములో స్వామిపుష్కరిణీతీరములో తపస్సు చేసి ఫలము పొందిన చంద్రుని వృత్తాంతము వర్ణింపబడినది. ఇందు ఆ స్వామిపుష్కరిణీ తీరములోనే తపస్సుచేసి ఫలమును పొందిన నారాయణుడనెడి బ్రాహ్మణుని వృత్తాంతము వెల్లడింపబడుచున్నది. ఈ నారాయణుడనెడి బ్రాహ్మణుని చరిత్ర బ్రహ్మాండపురాణములోని మూడవ అధ్యాయములో కలదు. **"నారాయణార్థితాశేషజనదృగ్విషయాయ నమః"** అనెడి 78వ తిరునామములో ఆ చరిత్రవిశదముగా తెలుపబడును. ఇచట వామనపురాణమును అనుసరించి నామావళి ఏర్పడియుండుటచే, ఈ వామనపురాణము 40వ అధ్యాయములోగల కథ అనుసరింపతగినది. అది ఏమనగా - అగస్త్యుడు మొదలగువారు చిరకాలము ఈ పర్వతమునందు భగవానుని అన్వేషించి, అలమటించు సమయములో ఒకనాడు వాయవ్యదిశలో ఒక పెద్దరాతి ఫలకముపై కూర్చునియున్న ఒక మహాపురుషుని వారు చూచిరి. అతని తేజస్సును, రూపమును వీరి కన్నులను ఆకర్షించినవి. ఆ మహాపురుషుని 'నీవు ఎవరు?" అని అగస్త్యుడు అడిగెను. అయినను, ఆ మహాపురుషుడు తనను స్తుతించునట్టి అగస్త్యునిచూచి, ఏ బదులును ఇవ్వకనే అంతర్ధానమయ్యెను- అను ఈ వృత్తాంతమునకు వామదేవుడు జనకునకు ఉపదేశించినట్లు వామనపురాణము 25వ అధ్యాయములోనున్నది. పిమ్మట, దీనిని మనస్సులో ఉంచుకొన్న జనకుడు

వామదేవుని ఉపదేశము పూర్తి అగు సమయమున (వామనపురాణము 40వ అధ్యాయములో) "పూర్వము వాయవ్యమున ఒక మహాపురుషుని అగస్త్యుడు మొదలగువారు దర్శించినట్లు చెప్పిరికదా! ఆ మహాపురుషుడు ఎవరు? అని వామదేవుని ప్రశ్నింపగా, వామదేవుడును "నారాయణ పర్వతమనెడి కొండయే అట్లు దివ్యరూపమును దాల్చి, వారికి సేవను అనుగ్రహించెను." అని సమాధానమిచ్చెను. ఈ కథను

**జనకః- వాయవ్యాం దిశి యో దేవః గిరే స్తస్య మహీయసః ।**
**దృష్టో మునివరైః పూర్వం కోఽసౌ బ్రహ్మన్ వదస్వ మే ॥**
**వామదేవః - స రాజన్! నాగరాజ స్తు నారాయణగిరి స్స్వయమ్ ।**
**ఆసీనో వపు రాస్థాయ స్వకం దివ్యం మహాద్భుతమ్ ॥** (వామన-40-1-2)

అను శ్లోకములలో గమనింపవచ్చును. **"నారాయణనగేశాయ"** అను పదమునకు **"నారాయణనగస్య ఈశః"** నారాయణగిరికి అధిపతి అనెడి అర్థమును గ్రహించి, ఇంతవరకు వ్యాఖ్యానింపబడినది. అగస్త్యుడు మొదలగువారు దర్శించిన మహాపురుషుని రూపము సాక్షాత్తు పరమపురుషుని రూపమువంటిదియేగానే ఉండెనని వర్ణింపబడుటచే, **"నారాయణనగేశాయ నమః"** అనెడి తిరునామమునకు **"నారాయణ ఇతి నగేశః, తస్మై"** నారాయణుడను పేరును కల పర్వతశ్రేష్ఠురూపియైన శ్రీనివాసుని శరణు పొందుచున్నాను - అనెడి అర్థమును గ్రహింపవచ్చును. సాక్షాత్తు శ్రీనివాసుడే ఈ పర్వతరూపిగా ఉండుటచే అతడే ఆ ఉత్తమరూపమును దాల్చి, వారికి సేవను అనుగ్రహించెననియును చెప్పవచ్చును. స్వామిపుష్కరిణికి వాయువ్యదిశలోనున్న ఆ పర్వతమునకు నారాయణగిరి అను పేరు కల్గుటకు కారణమును నారాయణుడు అనెడి బ్రాహ్మణుని చరిత్ర, ఆ చరిత్రను ఆధారముగాకల ఐతిహ్యమును, ఇంతవరకును చేయబడుచున్న ఒక అనుష్ఠానమును 78వ తిరునామవ్యాఖ్యలో చూడవచ్చును.

49. **ఓమ్ బ్రహ్మక్లుప్తోత్సవాయ శ్రీవేంకటేశాయ నమః**

(బ్రహ్మచే చేరుపబడిన ఉత్సవమును కల్గిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామమువరకు చతుర్ముఖుడు వామదేవునకు స్వామిపుష్కరిణీతీరమున చేయు ధర్మకార్యములకు విశేషప్రాధాన్యము కలదనుటను ఉపదేశించిరి - అని తెలుపబడినది. ఈ తిరునామమునందును, అట్లే, చతుర్ముఖుడు ఒకానొక సమయమున శ్రీనివాసునకు ఈ స్వామిపుష్కరిణీతీరములో భాద్రపదమాసమున శుక్లపక్షము చిత్రానక్షత్రమునందు ఆరంభించి 9నాళ్ళు విశేషోత్సవమును నిర్వహించినట్లును, ఆ ఉత్సవమునే ఈనాటివరకును అందఱును బ్రహ్మోత్సవము పేరుతో చేయుచున్నారనియును ఉపదేశించిన వృత్తాంతము అనుసంధింపబడినది. ఈ విషయముకూడ వామనపురాణములో అదే అధ్యాయములో చెప్పబడియున్నది. ఈ ఉత్సవమును సేవించువారికి విశేషఫలములు లభించుననియు, దీనిని సేవించుటకొఱకు



తిరుమలయాత్రను ఉద్దేశించి, ఒక అడుగువేసినను, ఒక్కొక్క అడుగునకును యాగము చేసినంతటి ఫలము దొరుకుననియు, ఈ ఉత్సవమును సేవింపవచ్చు జనములకు అన్నదానము, విశ్రమించుటకు చోటును ఇచ్చుట ఇత్యాది దానములను చేయువారికి విశేషమైన సుకృతము కల్గుననియు వర్ణింపబడినది. ఈ విషయమును ఈ క్రింది శ్లోకములలో గమనించవచ్చును.

**బ్రహ్మ- మాసి భాద్రపదే పుణ్యే శుక్ల పక్షే తు చైత్రభే ।**
**స్వామిపుష్కరిణీతీరే దేవస్య పరమాత్మనః ॥**
**ఉత్సవః కారితః పూర్వం మయైవ ప్రీతయే హరేః ।**
**తత్ర తత్ర యుగే చాస్య విష్ణోః స్వామిసరస్తటే ॥**
**ఉత్సవాన్ కారయిష్యంతి నరా పుణ్యకృతోఽమలాః ॥**
**యాని త్వా దధతే పదాని చ మునే నారాయణాద్రిం ప్రతి**
**స్తోకం స్తోక మపి ద్విజా అపి జనా స్తే? ఫలం యచ్ఛృణు**
**యావద్వేంకటశైల మాతృగృహతః తావత్పదానాం క్రమాత్**
**ప్రాయశ్చైవ పదే పదే క్రతుఫలం భూయా ద్భువి ప్రాణినామ్ ॥**
**యే సేవార్థముపాగతాన్ వృషగిరౌ దేవస్య దివ్యోత్సవే**
**యావచ్ఛక్త్యుపలాలయంతి భగవాం స్తేషా మభీష్టప్రదః ।**
**య స్తేషా ముపకార మీష దపి వా కుర్యా న్న లోభాదినా**
**తస్యా కల్పమవస్థితిః శృణు మునే ఘోరే మహారౌరవే ॥** (వామన-43,33,34)

ఇట్లు చతుర్ముఖుడు భగవానునకు ఉత్సవమును చేసిన విషయము వరాహపురాణము 50వ అధ్యాయములో విస్తృతముగా వర్ణింపబడినది. అది ఎట్లనగా - వేంకటాచలములో నున్న అసురులను భగవానుడు చక్రాయుధముతో సంహరించి, బ్రహ్మాది భక్తుల కోరికలను చేసిన పిదప, బ్రహ్మ మిక్కిలి భక్తితో భగవానునివద్ద తాను ఆ స్వామికి ఉత్సవమును చేసి పూర్తి సేవింపవలెనని ఆశపడుటను విన్నపించెను. భగవానుడును దానిని అంగీకరింపగా, చతుర్ముఖుడు విశ్వకర్మద్వారా విశేషనగరములను, వీథులను, ఉద్యానవనములను సృష్టింపజేసి, భూమండలములోనున్న సర్వజనులకును తెలిపి, వారిని రప్పించి, సర్వదేవతలు సహకరింపగా విశేషవైభవముతో భాద్రపదమాసమున ధ్వజరోహణమును చేసి, 9నాళ్ళు (రథోత్సవముతో పాటు) వాహనముల ఉత్సవమును నడపెను. పిమ్మట భగవానుడు తృప్తిపడి, బ్రహ్మ నిర్వహించిన ఈ ఉత్సవమును ప్రతి సంవత్సరము ఈ భాద్రపదమాసములో ఎవరు చేసెదరో, వారు ఈ లోకములో అనుభవింపవలసిన సర్వసౌఖ్యములను అనుభవించి, బ్రహ్మలోకమును పొందెదరని వరమిచ్చెను. ఈ కథకు మూలమైన శ్లోకముల క్రింద ఉట్టంకింపబడుచున్నవి.

**బ్రహ్మ - ధ్వజారోహణపూర్వ శ్చ కార్య స్తవ మహోత్సవః ।**
**స చ త్వయా మహాభూమన్ అంగీకార్యః శ్రియా సహ ॥**

**ఇతి బ్రువన్ విధి స్తేన చోదితః క్రియతా మితి ।**
**విధి శ్చకార మునిభిః వైఖానసముఖై స్సహ ॥**
**ఉత్సవం ధ్వజపూర్వం చ కన్యామాసం గతే రవౌ ।**
**ఆహూతా శ్చ సురా స్సర్వే సర్వాభ్యో దిగ్భ్య ఏవ చ ।**
**ఆగతా విబుధా స్సర్వే రాజానః పుణ్యకృత్తమాః ॥**
**గిరే శ్చ పరిత స్తత్ర నగరాణి చకార హ ।**
**విశ్వకర్మా తు విధివత్ మనోజ్ఞాని పురాణి చ ॥**
**శ్రీభగవాన్ – బ్రహ్మన్ ప్రీతోఽస్మి నితరాం త్వద్భక్త్యా చోత్సవేన చ ।**
**శృణుధ్వం మునయో దేవాః రాజానో యోగిన శ్చ యే ॥**
**వర్షే వర్షే తు మాసేఽస్మిన్ కన్యారాశిం గతే రవౌ ।**
**యే కేచి దత్ర కుర్వంతి బ్రహ్మక్లుప్తోత్సవం మమ ॥**
**తే యాంతి బ్రహ్మణో లోకం భూమౌ కామా నవాప్య హ ।**
**సేవంతే యే హి మా మస్మిన్ ఉత్సవే బ్రహ్మకల్పితే ।**
**సేవంతే తాన్ మహీపాలాః స్నేహా ద్దద్యు శ్చ వాంఛితమ్ ॥**
(వరాహ–50,52 అధ్యాయ)

ఉత్సవమను పదమునకు సంతోషమని, **"ఉత్సూతే హర్షమ్"** అనెడి వ్యుత్పత్తివలన సంతోషమును కల్గించు వస్తువనియును అర్థము. భగవానుని ఉత్సవకాలములలో విశేషాలంకారములతో వీథులలో వేంచేసియునట్టి ఆ భగవానుని దర్శించుటవలన కల్గు ఆనందమునకు మించిన ఆనందము భక్తులకు వేఱొకటి లభింపకపోవుటచే, ఇదియే ముఖ్యమైన ఉత్సవమని పెద్దలు వ్యవహరింతురు. ఇదికాక, సవమనగా యాగమని అర్థము. ఉత్సవమనగా గొప్ప యాగమని అర్థము. వేదములో చెప్పబడు అమూర్తార్చనము అనబడు జ్యోతిష్టోమము మొదలగు భగవదారాధనరూపమైన యాగములకంటె ఆగమములలో చెప్పబడిన సమూర్తార్చనము అనబడు, ఇట్టి అర్చామూర్తుల ఆరాధనమే గొప్ప యాగమని పెద్దల అభిప్రాయము అనుటయును ఇచట గ్రహింపనగును.

50. **ఓమ్ శంఖచక్రవరానమ్రలసత్కరతలాయ శ్రీవేంకటేశాయ నమః**
(శంఖము, చక్రము, వరముద్ర,కటిముద్ర – అను వీనిచే ప్రకాశించు హస్తములను కల శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను.

ఇంతవరకు వ్యాఖ్యానింపబడిన తిరునామములు వామనపురాణములో గల కథలను అనుసరించియే ఎక్కువగా ఏర్పడినవి అనుట నిరూపింపబడినది. ఇకపై గల నామములు వామనపురాణమువలె వరాహపురాణము మొదలగు పంద్రెండు పురాణములలో వివరింపబడిన వేంకటాచలమాహాత్మ్యవృత్తాంతములను అనుసరించి ఏర్పడినవి. అందు ఈ నామము అన్ని పురాణములలో వర్ణింపబడు రీతిలో ఈ శ్రీనివాసుని అర్చామూర్తికి అసాధారణమై అమరియున్న శ్రీహస్తములను, సౌలభ్యాదిగుణములను



తెలుపుచున్నది. పాంచజన్యమనెడి శంఖమును, సుదర్శనమనబడు చక్రము రెండు చేతులలో ఆయుధరూపముగను, భూషణరూపముగను అమరియుండి సేవను అనుగ్రహించుటను పరదేవత అగు విష్ణువుయొక్క అర్చామూర్తులలో సాధారణముగా సేవింపవచ్చును. ఇట్లు పరదేవతాచిహ్నమగు ఆ రెండు ఆయుధములు ఇచట శ్రీనివాసుని శ్రీహస్తములలో అమరియున్నవి. అభయముద్ర అనునది వరదరాజస్వామి, రంగనాథుడు మొదలగు మూర్తులకు క్రింది కుడిహస్తములోనున్నది. అనగా వ్రేళ్ళు పైదిశలో నున్నవియై, విస్తరించిన అరచేతిలో సేవించువారికి అభయమును అనుగ్రహించు రీతిలో అమరియున్నది. ఇట్లు కాకుండ ఈ శ్రీనివాసమూర్తికి క్రింద కుడిచేయి వరముద్రతో వెలుగుచున్నది. అనగా – వేళ్ళు క్రింది దిశను చూపుచు, విస్తరించిన అరచేతితోనున్నది. తన శ్రీపాదములను చూపుచు, **"మా మేకం శరణం వ్రజ"** అనుచు ఆనాడు గీతలో చివర ఉపదేశించుటను అర్చాసమాధికి తగినట్లు ఈ ముద్రతో, "ఈ శ్రీపాదములే మీకు పరమోపాయము, ఉపేయమును" అని తెలుపుచున్నది. శరణుపొందినవారికి తన శ్రీపాదములనెడి వరమును చూపుటచే ఇది వరముద్ర అని పెద్దలు వ్యవహరింతురు. నాల్గవది అగు ఎడమవైపు క్రింది చేయి కటిభాగములో మడచియుంచబడినది. ఇది కటిముద్ర. దీని తాత్పర్యమేమి? అనగా, పూర్వము తెల్పినరీతిలో భగవానుని శ్రీపాదములను ఉపాయముగా ఆశ్రయించినవారికి సంసారమనెడి సముద్రము నడుములోతు మాత్రమే అగును. అనగా – సుఖముగా దాటవచ్చునని అర్థము. దీనిని తెలుపుట కొఱకే ఆ శ్రీహస్తము ఇట్లున్నదట. ఇది అంతయు ఈ క్రింద తెలిపిన పురాణశ్లోకమువలన తెలియవచ్చును.

**దర్శయన్ పాణినైకేన దక్షిణేన వృషాకపిః ।**
**పదపద్మం సురారాధ్యం గతిం చ పరమాం నృణామ్ ॥**
**కటిన్యస్తకరేణాపి నిజపాదాబ్జగామినామ్ ।**
**నృణాం భవ పయోరాశిం కటిదఘ్నం ప్రదర్శయిన్ ॥**
**విరాజతే వేంకటేశః సంప్రత్యపి రమాపతిః ॥** (భవిష్యోత్తర–13 అధ్యాయే)

ఇందు శంఖము, చక్రమును పరదేవతా చిహ్నములగుటచే భగవానుని పరత్వమును తెలుపుచున్నవి. పెరియాళ్వార్లు పరదేవతా నిర్ణయమును చేసిన తరుణములో భగవానుడు గరుడుని అధిరోహించి దర్శన మిచ్చినపుడు, పల్లాణ్డునుపాడు సమయమునందు భగవానుని పరత్వనిరూపక అగు లక్ష్మీదేవికి **"వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాళ్గిన్ఱ మజ్గైయుమ్ పల్లాణ్డు"** అని పల్లాణ్డు పాడిన వెంటనే ఆ రీతిలోనే పరత్వచిహ్నములగు శంఖచక్రములకును **"వడివార్ శోది వలత్తుఱైయుమ్ శుడరాళియుమ్ పల్లాణ్డు పడైపోర్ పుక్కు ముళ్గుమ్ అప్పాఞ్చశన్నియముమ్ పల్లాణ్డే"** అని పల్కిరి. ఇట్లే, పూర్వము తమిళప్రబంధమునకు ప్రథమవక్తలు అగు ముదలాళ్వార్లలో ఇద్దఱు దీపము వెల్గించగానే, భగవానుని సేవించిన పేయాళ్వార్లును **"పొన్నాళి కణ్డేన్ పురిశజ్గమ్ కైక్కణ్డేన్"** అని తన

మొదటిపాశురములో పాడిరి. శ్రీసుదర్శనుని భగవానుని సంకల్పరూపముగా శాస్త్రములు తెలుపుచున్నవి. పాంచజన్యము, సుదర్శనమును భగవానునకు ఏయే సమయములలో ఎట్లెట్లు ఉపచారములను చేయుచున్న వనుటను మహాభారతము మొదలగు గ్రంథములందు గమనింపవచ్చును. కావున అవి భగవానుని పరత్వచిహ్నములు. మిగిలిన రెండు చేతులును సౌలభ్యమును తెలుపుచున్నవి. "కర్మ-జ్ఞాన-భక్తి యోగాదులలో శక్తిలేనిచో, నన్ను శరణువేడినచో నేనే వాని స్థానములో నిలచి, నీకు మోక్షమును అనుగ్రహించెదను" అని ఉపదేశించి, మనము చేయు శరణాగతికి అతడు లక్ష్యమై నిలచు దశను ఈ రెండు హస్తములును తెలుపుటచే ఇది పరమసౌలభ్యమును వ్యక్తీకరించుటకై ఏర్పడినవి. ఇట్లు పరత్వముతోకూడిన సౌలభ్యమునుకల వ్యక్తియే మనకు ఉపాదేయమగుటచే, అట్టి వ్యక్తియే ఈ శ్రీనివాసుని అర్చామూర్తి అనుటను ఈ హస్తములతో తెలుపబడినది. ఇట్టి వేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈ నామముయొక్క తాత్పర్యము.

51. **ఓమ్ ద్రవన్మృగమదాసక్తవిగ్రహాయ శ్రీవేంకటేశాయ నమః**

(కఱగిన కస్తూరి, పునుగు మొదలగు సువాసనాద్రవ్యములచే పూయబడిన దివ్యవిగ్రహమును కల శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వము తిరునామములో భగవానుని పరత్వసౌలభ్యములను తెలుపునట్టి చిహ్నములను (దేహములో నున్నవి) వర్ణింపబడినవి. ఈ తిరునామము, దీనికి పిమ్మట తిరునామమును క్రమముగా ఆ సౌలభ్యమును, పరత్వమును పురాణప్రసిద్ధములగు వృత్తాంతములను ఆధారముగా చేసికొని నిర్ధారించుచున్నవి. ఈ తిరునామముతో, శ్రీవేంకటేశ్వరుడు తన ప్రభావమును లెక్కింపకుండ భక్తులుండు చోటికి తానే వేంచేసి, వారి కోరికలను పూర్తి చేయును – అను విషయము, ఈ వేంకటేశ్వరుని ఒక దివ్యలీలచే జ్ఞాపకము చేయబడుచున్నది. దీనిచే భగవానుని సౌలభ్యగుణము నిరూపితమైనది. వరాహపురాణము 37వ అధ్యాయములోనున్న కథ ఇచట అనుసంధేయము. అది ఏమనగా

ఒకానొక సమయమున పలువురు మహర్షులు ఒకటిగా చేరి, ఈ తిరుమలలో తపస్సు చేయువారికి అవసరమైన తీర్థసౌకర్యము, యాగమునకు అవసరమైన అన్ని వృక్షముల ఫలవిశేషములు అవసరమైనంతగా దొరుకుచుండుటచే, ఈ ప్రదేశమునందే పరమపురుషుని ఉద్దేశించి, ఒక యాగము చేయవలెనని తీర్మానించి యాగమును చేయుచుండిరి. అపుడు ఈ కొండపై శ్రీనివాసుడు విటవేషమును దాల్చి, మహాలక్ష్మిని తన వేషమునకు తగిన రీతిలో దాసీవేషమును ధరింపజేసి, విహరించుచుండెను. ఆ వేషముతోనే, మహాలక్ష్మితోపాటు ఈ మహర్షుల యాగశాలకు వచ్చెను. అపుడు భగవానుడు ప్రత్యక్షమైన విధమును



**సోఽపి మాయ స్త్రియా సార్థం యజ్ఞవాట ముపాగమత్ ।**
**సువర్ణచిత్రితం వస్త్రం వసానః శుభదర్శనః ॥**
**సోష్ణీష శ్చ కరేణైవ వామేన చ్ఛురికాం దధత్ ।**
**తాంబూలేన శుచిస్నిగ్ధమందస్మితముఖాంబుజః ॥**
**మృగోత్థమదగంధేన సురభీకృతదిఙ్ముఖః ।**
**పుండరీకవిశాలాక్షః కంబుగ్రీవో మహాహనుః ॥**
**జగన్మోహనసౌందర్యః సాక్షాత్ కందర్పసన్నిభః ।**
**హేమయజ్ఞోపవీతాంగః కోమలాంగో మనోహరః ॥**
**ప్రవివేశ సభాం యాజ్ఞీం మధ్యేబృందం మహాత్మనామ్ ।** (వరాహ–38)

అని పురాణము వర్ణించుచున్నది. మాఱువేషమును దాల్చిన లక్ష్మీదేవిలో, పీతాంబరము దాల్చి, తలపాగను దాల్చి, ఎడమ చేతిలో కత్తిని ధరించి, తాంబూలమును వేసికొని, కస్తూరి మొదలగు సువాసనాద్రవ్యములను విశేషముగా పూసికొనుటచే బాగుగా నాల్గు దిక్కుల యందు విశేషమైన సువాసన వ్యాపించునట్లు చేసి, జగన్మోహనరూపముతో సాక్షాత్తు మన్మథునివలె స్వర్ణయజ్ఞోపవీతమును దాల్చి, ఆ మహాత్ముల మధ్యలో యజ్ఞశాలలో ప్రవేశించెను. ఇచట **"మృగోత్థమదగంధేన సురభీకృతదిఙ్ముఖః"** కస్తూరివాసనచే అన్ని దిక్కుల యందు సువాసను వ్యాపించునట్లు చేయుచు వేంచేసెనని వర్ణించినదియే **"ద్రవస్మృగమదాసక్త"** అనెడి ఈ తిరునామముయొక్క విషయము. ఆ విధముగా ఆ ఋషుల యాగశాలకు వేంచేయు సమయమును జ్ఞాపకమును చేయురీతిలో ఈ తిరునామము ఇట్లు ఏర్పడుటచే, ఆ కథను ఇచట అనుసంధించి, భగవానుని సౌలభ్యమును ఈ తిరునామములో అనుసంధింపవలెనని వ్యాఖ్యానింపబడినది.

ఇట్లు భగవానుడు ప్రవేశించగానే, అంతకుముందు చూచి ఎఱుగని ఈ దంపతుల సౌందర్యము, రాజలక్షణములు, మొదలగువానిని దర్శించిన ఋషులు "మీరు ఎవరు? ఏ ఊరు? తల్లిదండ్రులు ఎవరు? పేరేమి?" అని ఈ విధముగా పలు ప్రశ్నలను అడిగిరి. భగవానుడును "నాకు తల్లిదండ్రులు లేరు. నాకు స్థిరమైన నివాసమును లేదు. ఎచటనైనను ఉందును. ఏ రూపమును అయినను ధరింతును. పేరు, ఊరు లేదు. మిమ్ములను చూడవలెనని ఇచటకు వచ్చితిని" అని బదులు పల్కి, కొన్ని శాస్త్రీయములైన విచారములను చేసెను. పిమ్మట వపాహోమమునకు సంబంధించిన గడియ దాటిపోకుండనుండుటకై మహర్షులు వపాహోమమును శాస్త్రానుసారము మంత్రశేషముతో చేసిరి. ఆ సమయములో విలువేషములోనున్న భగవానుడు శంఖచక్రాధారియై సాక్షాత్తు మహావిష్ణుస్వరూపములో యాగాగ్నిలో ప్రత్యక్షమై, వారు హోమమును చేయు వపను నేరుగా తన రెండు చేతులతో స్వీకరించెను. అపుడు కోటిసూర్యసమయైన భగవానుని తేజస్సును చూచి మహర్షులు కన్నులను మూసికొనిరి. ఏమిచేయుటకు తోచనివారై, అట్లే స్తంభీభూతులయ్యిరి. అపుడు భగవానుడు" మీ

యాగముచే నేను తృప్తిని చెందితిని" అని పల్కి అంతర్ధానమయ్యెను. మహర్షులును తమ మహాభాగ్యమును తలచి, సంతోషించి, మిగిలిన యాగక్రమమును పూర్తిచేసిరి. మహర్షుల భక్తిని చూచి తానే నేరుగా వచ్చి, వారి హోమద్రవ్యమును స్వీకరించి, వారిని కృతార్థులనుగా చేసిన భగవానుని సౌలభ్యము ఈ కథచే స్పష్టమగుచున్నది కదా! కావున, ఇట్లు మృగమదమనెడి కస్తూరిని ధరించి, మహర్షుల యజ్ఞవాటికకు వేంచేసిన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను అని ఈ నామతాత్పర్యము.

52. **ఓమ్ కేశవాయ శ్రీవేంకటేశాయ నమః**

(బ్రహ్మరుద్రాదులకు స్వామియైన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

పూర్వనామములో భగవానుని సౌలభ్యము ప్రస్తుతమైనది. ఇట్లు సౌలభ్యమును కలవాడు సామాన్యుడు కాదు. మహోన్నతమైన పరత్వమును కలవాడు అని ఈ తిరునామముచే తెలుపబడుచున్నది.

**"కేశవః"** అను నామమునకు శాస్త్రజ్ఞులు పలు రీతులలో వ్యుత్పత్తులను తెలుపుచున్నారు. అందు ముఖ్యముగా

**క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినామ్ ।**
**ఆవాం తవాంగే సంభూతౌ తస్మా త్కేశవనామవాన్ ॥** (హంవంశ-131-48)

'కః' అనగా చతుర్ముఖునకు పేరు. ఈశ్వరుడనగా నా పేరు. మేమిరువురము నీశరీరము నుండి పుట్టినవారము. కావున నీవు కేశవనాముడవైతివి - అని హరివంశములో భగవానునితో రుద్రుడు పల్కిన మాటను బట్టి. అందఱికంటె గొప్పవారగు బ్రహ్మ, రుద్రులకంటె విష్ణువు అధికుడను అర్థమును ఈ నామము తెలుపుచున్నదని అందురు. అందుచే ఈ పదము భగవానుని సర్వాధికత్వమును తెలుపుచున్నది. భగవానునకు చతుర్ముఖునికంటె, రుద్రునికంటె పరత్వము కలదు. అతడే మూలకారణము. **"జన్మాద్యస్య యతః"** అని బ్రహ్మసూత్రములో పల్కిన రీతిలో జగత్సృష్టి పాలనసంహారములను చేయువాడు అతడే అను విషయమునకు ఉపనిషత్తులు, గీత, రామాయణము, విష్ణుపురాణము, మహాభారతము, ఆళ్వార్ల శ్రీసూక్తులు మొదలగువానినుండి పలు ప్రమాణములను గమనింపవచ్చును. వానిలో కొన్ని ప్రమాణములు మాత్రము ఇచట ఉదాహరింపబడుచున్నవి.

**"నారాయణా ద్బ్రహ్మా జాయతే, నారాయణా ద్రుద్రో జాయతే" (అథర్వణే)**
**"స బ్రహ్మా స శివ స్సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్ (ఉత్తమ నారాయణే)**
**అహం ప్రసాదజ స్తస్య కస్మింశ్చిత్ కారణాంతరే ।**
**త్వం చైవ క్రోధజ స్తాత పూర్వసర్గే సనాతనే ॥ (మహాభారత-శాంతి-352-62)**
**పశ్యామి దేవాం స్తవ దేవ! దేహే సర్వాం స్తథాభూతవిశేషసంఘాన్ ।**
**బ్రహ్మాణ మీశం కమలాసనస్థమ్ ఋషీం శ్చ సర్వా నురగాం శ్చ**



**దివ్యాన్(గీతాయాం-11-15)**
**బ్రహ్మా స్వయంభూ శ్చతురాననో వా రుద్ర స్త్రినేత్ర స్త్రిపురాంతకో వా ।**
**ఇంద్రో మహేంద్ర స్సురనాయకో వా త్రాతుం న శక్తా యుధి రామవధ్యమ్ ॥**
**(రామా-సుందర-51-45)**
**బ్రహ్మా దక్షాదయః కాలః రుద్రః కాలాంతకాద్యా శ్చ (విష్ణువు-1-22)**
**నాన్ముకనై నారాయణన్ పడైత్తాన్ నాన్ముకనుమ్ తాన్ముకమాయ్ శఙ్కరనై త్తాన్ పడైత్తాన్ (నాన్ముకన్-1)**
**పేశనిన్ఱ శివనుక్కుమ్ పిరమన్ తనక్కుమ్ పిఱర్క్కుమ్ నాయకనవనే -(తిరువాయ్-4-10-4)**

అను మొదలగు పలు ప్రమాణములలో విష్ణుపారమ్యమును తెలియనగును. ఇవియేకాక, కేశవనామమునకు కేశి అను అసురుని సంహరించినవాడని, అందమైన కేశపాశమును కలవాడని - ఈ విధముగా పలు అర్థములనుకూడ చెప్పుదురు. ఈ అర్థములన్నిటికంటె భగవానుని పరత్వమును ప్రకటించునట్టి, మొదట తెలుపబడిన అర్థమే ఈ సందర్భమునకు అనుగుణమైనది.

ఇట్లు పరత్వమును తెలియజేయురీతిలో ఈ కేశవపదము పూర్వము తెల్పిన వామనపురాణములోని 37వ అధ్యాయములో రుద్రుడు, బ్రహ్మ, అగస్త్యుడు మొదలగువారు అందఱును తిరుమలలోని స్వామి ఆవిర్భవింపగానే, ఆ స్వామిని సేవించిన ప్రకరణములోనున్న దానిని పూర్వము ఉదహరించిన శ్లోకములలో గమనింపనగును. అందుచే ఆ వృత్తాంత మిచట అనుసంధేయము.

**ఏవంభూతం తదా దృష్ట్వా బ్రహ్మాద్యాః విస్మితేక్షణాః ।**
**ప్రణేముః ముదితా స్సర్వే శిరోభి ర్భువి కేశవమ్ ॥**
**ప్రస్తూయ చ జగద్యోనిం స్తుతిభి శ్శుభలోచనాః ।**
**నిశ్చక్రముః తదా తస్మా ద్విమానా ద్దీప్తచక్రిణః ॥**
**నిష్క్రమ్య సహితా నేముః శిరోభి ర్భువి కేశవమ్ ।**
**పితామహ శ్చ భగవాన్ ఖేచరైః పరివారితః ॥**
**...........నిజలోక మధ్యాఽభ్యయాత్ ।**
**పినాకపాణి ర్భగవాన్ శంకర స్త్రిపురాంతకః ॥**
**జగామ విశ్రుతం దివ్యం కైలాసం రజతాచలమ్ ।**

(వేంకటాచలమాహాత్మ్యే వామన-37)

బ్రహ్మ, రుద్రులు మొదలగువారు శ్రీనివాసుని శిరసా నమస్కరించి, తాముండు చోటికి చేరిరి.

ఇచట **"ద్రవన్మృగమదాసక్త"** అనెడి తిరునామములో ఆశ్రితులను తానుగా

వెదకి, చేరు సౌలభ్యము, **'కేశవాయ'** అనెడి ఈ తిరునామములో సర్వస్మాత్పరత్వము ఎట్లు చెప్పబడియున్నదో, అట్లే శ్రీగోదాదేవియు తన ప్రబంధమగు తిరుప్పావై చివరలో గల **"వఙ్గక్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై"** అను సూక్తిలో ఓడలనుకల క్షీరసముద్రమును మథించిన మాధవుని అనుటచే ఆశ్రితయగు లక్ష్మీదేవిని **"ఆశ్రితేత్యానృశంసతః"** అని శ్రీరామాయణములో పల్కిన రీతిలో అన్వేషించి, సముద్రమును చిలికిన సౌలభ్యమును, అనంతరపదమగు **''కేశవనై''** అనుదానిచే పరత్వమును చెప్పబడియుండుట గమనింపతగినది. భగవానుని పరత్వ, సౌలభ్యములే భక్తులకు అనుసంధింపతగిన గుణములలో ముఖ్యమైనవి. కావుననే కేశవాది ద్వాదశనామములలో మొదటిది అగు కేశవనామము పరత్వమును, చివరిది అగు దామోదరనామము (భగవానుడు చిన్ని దారముతో కట్టుబడియుండుటను తెలుపుటచే) సౌలభ్యమును తెలుపుచున్నవి. ఇట్లు సర్వదేవతాసార్వభౌముడగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నానని ఈ నామముయొక్క తాత్పర్యము.

53. **ఓమ్ నిత్యయౌవనమూర్తయే శ్రీవేంకటేశాయ నమః**

(ఎల్లప్పుడును యౌవనమునుకల దివ్యదేహమును కల్గిన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

పూర్వనామమున వామనపురాణములోగల, అగస్త్యాది మహర్షులు శ్రీనివాసుని దేవతాంతరములకంటె అధికుడు, సర్వదేవతాసార్వభౌముడు అను రీతిలో దర్శించి, అతని పరత్వమనెడి దివాత్మగుణమున అభినివిష్టులైన విషయము తెలుపబడినది. ఈ తిరునామములో ఆ అగస్త్యాదిమహర్షులే ఆ శ్రీనివాసుని దివ్యమంగళవిగ్రహమును అనుభవించిన విధము వివరింపబడుచున్నది. శ్రీనివాసుని దివ్యదేహము ఎల్లప్పుడు యౌవనముతో కూడియుండును. మన శరీరములోనున్నట్లు బాల్యము, యౌవనము, వార్ధక్యము మొదలగు అవస్థలు పరమపురుషుని మేనికి లేవు. యౌవనమనెడి ఒక అవస్థయే ఎల్లప్పుడును కలదు దీనిని **"యువా సువాసాః పరివీత ఆగాత్ స ఉ శ్రేయాన్ భవతి జాయమానః"** అని శ్రుతి **"న తస్య ప్రాకృతా మూర్తిః మాంసమేదోస్థిసంభవా"** అని పురాణములును వర్ణించుచున్నవి. ఈ యౌవనమును **"అచింత్యదివ్యాద్భుతనిత్యయౌవనస్వభావలావణ్యమయామృతోదధిమ్"** అని యామునులు, **''నిత్యయౌవనాద్యనంతగుణనిధిదివ్యరూప''** అని భగవద్రామానుజులు, **"అనిమేషనిషేవణీయ మక్ష్ణోః అజహద్యౌవన మావిరస్తు చిత్తే, కలహాయితకుంతలం కలాపైః కరణోన్మాదకవిభ్రమం మహో మే"** అని శ్రీదేశికులును, ఇట్లే పలువురు దివ్యసూరులును, పూర్వాచార్యులును భగవానుని నిత్యయౌవనమును అనుభవించిరి. యౌవనమనగా బాల్యమునకు పిమ్మట లోకమున కన్పించు, రమణీయమైన ఒక సన్నివేశవిశేషము. **''యౌవనే లోకే బాల్యానంతర్యేణోపలక్షణీయః కశ్చి ద్రమణీయసంస్థానవిశేషః, స ఏవ స్వభావః స్వాసాధారణధర్మః యస్య సః"** అని



స్తోత్రరత్నభాష్యములో శ్రీదేశికులు నిరూపించిరి. లావణ్యమనగా సముదాయశోభ అని, ఆ సందర్భముననే నిరూపించిరి. కావున యౌవనమునకు ప్రమాణములను చూపదలచినవారు లావణ్యమునకు ప్రమాణములను చూపినచో కృతార్థులు కాలేరు. ఇట్టి యౌవనమును శ్రీనివాసుని అర్చామూర్తిలో ఎల్లప్పుడు మనము సేవింపవచ్చును. కల్యాణమునకు సిద్ధమైయున్న పెండికుమారుని స్ఫూర్తిని, గాంభీర్యమును నిత్యయౌవనమునుకల శ్రీనివాసుని తిరుమేనితో ఎల్లప్పుడును దర్శింపవచ్చునుకదా! ఈ గుణమును సనకాది మహర్షులు దర్శించినట్లు వామనపురాణములోని 35వ అధ్యాయములో

**ఏతత్పరం రూప మపేతజన్మజజరాదిదోషం విమలం విశోకమ్ ।**
**అదృష్టపూర్వం మనుజామరాద్యైః నతాస్స్మ విద్యుజ్జ్వలితోరుశోభమ్ ॥** అనియు,
క్షయవృద్ధివిహీనాయ నిర్గుణాయ నమో నమః - అనియును వర్ణింపబడినది.

54. **ఓమ్ అర్థితార్థప్రదాత్రే శ్రీవేంకటేశాయ నమః**

(భక్తులచే కోరబడు అన్ని పురుషార్థములను అనుగ్రహించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ఈ తిరునామము ఆ వామనపురాణములోని 36వ అధ్యాయమునందలి కథాసందర్భమును అనుసరించియే ఏర్పడియున్నది. అందుచే ముందుతిరునామముతో ఈ తిరునామమునకు సంగతి కలదు. అగస్త్యసనకాది సప్తర్షులు మొదలగువారు భగవానుని విశ్వరూపములో సేవించిన తరుణములో వారినిగూర్చి భగవానుడు ఈ క్రింది విధముగా పల్కెను.

**మునీంద్రా నవలోక్యాఽథ భగవా నిద మబ్రవీత్ ।**
**నృపతే సర్వలోకేశో విశ్వరూపధరో హరిః ॥**
**మేఘగంభీరయా వాచా శ్రావ్యయా శ్లక్ష్ణరూపయా ।**
**జగదాపూరయన్ సర్వం సుతరాం ప్రియయా తదా ॥**

శ్రీభగవాన్

**యుష్మాభిః భూరితేజోభిః మత్తో యత్ప్రార్థ్యతే ద్విజాః ।**
**ప్రీయతాం తదశేషేణ నాత్ర కార్యా విచారణా ॥**
**మాం దృష్ట్వా ప్రార్థితాన్ కామాన్ ప్రాప్నువంతి నరా భువి ।**
**అచిరేణైవ కాలేన ముక్తిం చాపి సుదుర్లభామ్ ॥**
**అప్రాప్య ప్రార్థితాన్ కామాన్ న యాస్యంతి ద్విజోత్తమాః ।**
**మయి దృష్టే చిరా త్తస్మాత్ బ్రూత ప్రార్థిత ముత్తమమ్ ॥** (వామన-36 అధ్యాయ)

(ఓ మహర్షులారా! మీలో ఎవరెవరికి ఏమేమి కావలయునో, అవి మీకు లభించునో! లభింపదో! అను సందేహము లేకుండ అడుగుడు. నన్ను సేవించినవాడెవడైనను, అతడు

తన మనోరథమును, అది మోక్షమైనను, శీఘ్రముగా పొందును. నన్ను సేవించిన పిదప తాము కోరిన ఫలములను పొందక, తిరిగిపోవు వారెవ్వరును లేరు. అందుచే మీకు కోఱిన ఫలమును (ప్రార్థింపుడు) ఇట్లు అపుడు మహర్షులకు చెప్పిన రీతిలోనే ఈనాటికిని శ్రీవేంకటేశ్వరుడు తనను సేవింపవచ్చు కోట్లానుకోట్ల భక్తజనులకు వరమదయతో వారు వారు కోరిన ఫలములను అనుగ్రహించి, వారిని కృతార్థులను చేయువిధమున కన్నులార మనము దర్శించుచుండుటచే శ్రీనివాసుని విషయమున దీనికి వేఱొక ప్రమాణము చూపవలసినపనిలేదు. వేంకటాచలమాహాత్మ్యమునందును శ్రీనివాసుని ఆశ్రయించిన పలువురు భక్తులు తాము తాము కోరిన ధర్మార్థకామమోక్షములను ఆయా పురుషార్థములను పొందిన వృత్తాంతములు పలు చెప్పబడినవి. ఉపనిషత్తులు,గీత మొదలగు శాస్త్రములలో విషయములను విచారింపగా, పరమపురుషునికాక, వేఱు దైవములను ఉపాసించువారికి ఆయా దేవతలకు అంతర్యామియైయుండి, వారుచేయు ఆరాధనను తానే స్వీకరించి, వారికి ఫలములను తానే అనుగ్రహించుననుట స్పష్టమగుచున్నది. ఈ విషయమును ఈ క్రింది సూక్తులు ధ్రువీకరించుచున్నవి.

**యే త్వన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః ।**
**తేఽపి మా మేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్ ॥**
**అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ (భగవద్గీతా-9-24-25)**
**తత్ర తత్ర ఫలప్రదాతా చ అహ మేవేత్యర్థః - గీతాభాష్యమ్**
**యో యో యాం యాం తనుం భక్త శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి ।**
**తస్య తస్యాచలాం శ్రద్ధాం తా మేవ విదధామ్యహమ్ ॥**
**స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే ।**
**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్ ॥** (గీతా 8-21,22)

55. **ఓమ్ విశ్వతీర్థాఘహారిణే శ్రీవేంకటేశాయ నమః**
(అన్ని పుణ్యతీర్థముల పాపములను పోగొట్టు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ఈ నామముకూడ వామనపురాణములోగల, పూర్వము ప్రస్తుతమైన వృత్తాంతమును అనుసరించి, ఏర్పడినది. తిరుమలలోనున్న స్వామిపుష్కరిణి అనెడి పుణ్యతీర్థముయొక్క మహిమ చాల గొప్పది. ఇది వైకుంఠమునుండి వచ్చిన పుణ్యతీర్థము "ముల్లోకములలోనున్న అన్ని పుణ్యతీర్థములకును నీవు స్వామివై వెల్గుదువు. అయా పుణ్యతీర్థములు పాపిష్ఠిజనులచే తమయందు విడువబడిన పాపములను ఒక్కొక్క సంవత్సరము మార్గశీర్షమాసము శుక్లపక్షములో అరుణోదయకాలమున నీవద్దకువచ్చి, నీతో కలసి పోగొట్టుకొనును" అని స్వామిపుష్కరిణికి భగవానుడు వరమిచ్చెనని వామనపురాణ కథనము.

ఈ విషయము జనకశతానందసంవాదరూపముగానున్న వామనపురాణ



వృత్తాంతము చివరలో శతానందుడు జనకునకు ఉపదేశించిన 44వ అధ్యాయములో కలదు. మార్కండేయుడు బ్రహ్మనుగూర్చి తపస్సును చేయగా, బ్రహ్మ వరమును అనుగ్రహించుట కొఱకు ప్రత్యక్షమైనపుడు "ముల్లోకములలోనున్న అన్ని పుణ్యతీర్థములందు స్నానమును చేయవలెనని ఆశపడుచున్నాను. దానికి అవసరమైన శక్తిని నాకు నీవు అనుగ్రహింపవలెను." అని వేడెను. బ్రహ్మ అపుడు "అది ఎవరికిని వీలుకాని కార్యము. నీకు అన్ని పుణ్యతీర్థములందు స్నానము చేసిన ఫలముకావలెనన్నచో, వేంకటాచలములో నున్న స్వామిపుష్కరిణిలో మార్గశీర్షశుక్ల పక్షద్వాదశిలో అరుణోదయ సమయమున స్నానమును చేసినచో, ఆ ఫలమును పొందవచ్చును. అపుడు మూడులోకములలోనున్న 31/2 కోటి పుణ్యతీర్థములును అందు, తమ పాపములను పోగొట్టుకొనుటకై కలియును" అని ఉపదేశించెను. మార్కండేయుడును అట్లే చేసి, అతడు కోరిన ఫలమును పొందెను. అందుచే ఓ జనకచక్రవర్తీ! నీవును అచటికి పోయి, ఆ స్వామి పుష్కరిణిలో స్నానము చేసినచో నీవు కోరిన ఫలమును పొందగలవు" అని శతానందుడు ఉపదేశించెను. ఈ విషయము మార్కండేయ పురాణమునందు, వారాహము మొదలగు పురాణములందును కలదు. వామనపురాణప్రోక్తవృత్తాంతములందలి కథయే ఈ తిరునామములో అనుసంధేయము. అపుడే పూర్వనామముతో సంగతి ఏర్పడును. పైన పేర్కొనబడిన వృత్తాంతమును తెలుపు వామనపురాణవచనములు ఈ క్రింద చూపబడుచున్నవి.

**బ్రహ్మ - తస్య శృంగే సుమహతీ పుణ్యా పాపవినాశినీ ।**
**స్వామిపుష్కరిణీ నామ సరసీ సర్వకామదా ॥**
**త్రైలోక్యవర్తినాం బ్రహ్మన్ తీర్థానాం స్వామినీ హి సా ।**
**మాసే తు మార్గశీర్షాఖ్యే ద్వాదశ్యాం పూర్వపక్షకే ॥**
**అరుణోదయవేళాయాం త్రిషు లోకేషు విశ్రుతాః ।**
**త్రిస్రః కోట్యోఽర్ధకోటీ చ తీర్థానాం సుమహామతే ॥**
**సాన్నిధ్యం తత్ర కుర్వంతి స్వామిపుష్కరిణీజలే ।**
**పాపం స్వేషు వినిర్ముక్తం లోకై రఘుసమన్వితైః ॥**
**నిర్హరంతీహ తీర్థాని తస్యా స్తీర్థసమన్వయాత్ ।**
**మార్కండేయ! మహాభాగ! భావనత్రయవాసినామ్ ॥**
**తీర్థానాం తత్ర గత్వా త్వం సేవాఫల మవాప్నుహి ।**
**స్వామిపుష్కరిణీత్యేత న్నామధేయం చ తత్కృతమ్ ॥**
**మార్కండేయ సమస్తానాం తీర్థానాం స్వామినీ యతః ।** (వామన-44-అధ్యాయే)

56. **తీర్థస్వామిసరస్స్నాతజనాభీష్టప్రదాయినే శ్రీవేంకటేశాయ నమః**
(స్వామిపుష్కరిణి అనెడి సరస్సులో స్నానము చేసిన మానవుల కోరికలను అనుగ్రహించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందు తిరునామములో సర్వలోకములలోగల అన్ని పుణ్యతీర్థములును స్వామి పుష్కరిణిలోనికి వచ్చి కలసి, తమ పాపములను పోగొట్టుకొనుచున్నవి అని, అట్లు ఆ పుష్కరిణికి శ్రీనివాసుడు వరమును అనుగ్రహించెనని వర్ణింపబడినది. దీనిచే పాపమును పోగొట్టుట అనెడి అనిష్టనివృత్తి స్వామిపుష్కరిణివలన కల్గుచున్నది–అని చెప్పినట్లయినది. ఇట్లు అనిష్టనివృత్తిమాత్రమే దానివలన కల్గునని భావింపనక్కరలేదు. ఇష్టప్రాప్తి అనబడు, ఎవరెవరు ఏమేమి ఫలములను కోయిదురో, ఆయా ఫలముల ప్రాప్తియును ఈ స్వామిపుష్కరిణీస్నానాదులచే ఏర్పడునని ఈ తిరునామములో వ్యాఖ్యానింపబడుచున్నది. మిగిలిన పుష్కరిణీతీర్థములు ఈ స్వామి పుష్కరిణీలో స్నానమాడి పరిశుద్ధమగుచున్నవి–అని ముందు తిరునామములో చెప్పబడినది. ఈ తిరునామములో ప్రాణులన్నియును ఈ తీర్థములో స్నానము చేసినచో సర్వభీష్టములను పొందవచ్చును. అట్లు దీనికి శ్రీవేంకటేశ్వరుడు వరమునిచ్చెను – అని వర్ణింపబడుచున్నది–అనునదియును ఇచట సంగతిగా చెప్పవచ్చును. ఈ తిరునామములో అనుసంధింపవలసిన వృత్తాంతము కూడ వామనపురాణములో 32వ అధ్యాయమునుండి చెప్పబడినది. వరాహపురాణము మొదలగు పురాణములందును ఈ స్వామిపుష్కరిణీమహిమ ఇందు స్నానము చేసిన, మానవులు తాము కోరిన కోరికలను పొందిన రీతిని పలు రీతులలో వివరింపబడియున్నది.

హేహయకులములో పూర్వము ఒకానొకసమయమున జన్మించిన శంఖుడను మహారాజు భూమిని పాలించుచుండెను. అతడు పరమపురుషుడగు నారాయణుని సాక్షాత్కరింప చేసికొనవలెనని అశ్వమేథాది పలు యాగములను విశేషదక్షిణలతో శాస్త్రీయమైన రీతిలో చేసెను. ఎన్నియాగములను చేసినను సర్వేశ్వరుడు ప్రత్యక్షము కాకపోవుటచే అతడు మిక్కిలి బాధపడెను. ఇట్లుండగా, ఒకనాడు భగవానుడు ఆకాశములో మఱుగుననుండి, "ఓ శంఖమహారాజా!, నీవు నారాయణగిరి అనబడు వేంకటాచలముపై నన్ను సాక్షాత్తుగా దర్శింపగలవు. ఆ పర్వతముపై స్వామిపుష్కరిణి అను ఒక పుణ్యతీర్థము కలదు. దాని మహిమ ఇంతటిది అని చెప్ప వీలు లేదు. గంగ మొదలగు సకలపుణ్యతీర్థములకును సమమైనది. దాని తీరములో నీవు వేయి సంవత్సరములకాలము తపస్సును చేసిన పిమ్మట అచట అగస్త్యుడు మొదలగు ఋషులు నన్ను సేవింపవచ్చెదరు. అపుడు నీవు నన్ను దర్శింపగలవు." అని పల్కెను. శంఖరాజును భగవానుని నియమనమును శిరసా వహించి, తన పుత్రునకు రాజ్యభారమును అప్పగించి, స్వామిపుష్కరిణిని చేరి, తపస్సుచేసి, భగవానుని సాక్షాత్కరింపజేసికొనెను. ఇట్లు పలువురు ఈ స్వామిపుష్కరిణీతీరములో తపస్సుచేసియు, ఇందు స్నానము చేసి, తమ తమ కోరికలను పొందిరి. చాల దినములు సంతతి లేకుండనున్న దశరథచక్రవర్తి ఈ కోనేటిలో స్నానము చేసిన మహిమచే పుత్రసంతతిని పొందెను. శ్రీరాముడును ఇందు నీరాడిన పిదప తాను రావణసంహారమును చేసి, సీతను పొందెను. పరీక్షిత్ మహారాజును తక్షకుడు



కఱచిన విషయమును తెలిపిన కాశ్యపుడు అనెడి బ్రాహ్మణుడు ఆ మహారాజును బ్రతికించుటకొఱకు పోవునపుడు దారిలో తక్షకుని కలిసి, అతనివద్దనుండి ద్రవ్యాశచే విశేషదక్షిణను పొంది, తిరిగిపోయెను. అతడు (కాశ్యపుడు) ఈ స్వామిపుష్కరిణిలో స్నానముచేసి, తన పాపములను పోగొట్టుకొనెను. ఇట్లు పలు వృత్తాంతములు ఈ స్వామిపుష్కరిణినిగూర్చి పలుపురాణములలో తెలుపబడినవి. ఈ పుష్కరిణికి "స్వామి తీర్థము" అను పేరు వచ్చుటకు రెండు విధములైన కారణములు కలవనుట పూర్వము పలు సందర్భములలో వివరింపబడినది. శంఖరాజునకు భగవానుడు స్వామి పుష్కరిణీ విషయముగా ఉపదేశించిన శ్లోకము లిట్లున్నవి –

**వామదేవః– శంఖో నామ పురా రాజా రాజ న్నాసీ న్మహాద్యుతిః ।**
**హేహయానాం కులే జాతః కర్మణా విశ్రుతో భువి ॥**
**సోఽయజ త్సర్వభూతేశమ్ అశ్వమేథాదిభి ర్మఖైః ।**
**నాచాద్రాక్షీత్ స తై ర్యజ్ఞైః భగవంతం సనాతనమ్ ।**
**సోఽభవ ద్దుఃఖసంతప్తః తతోఽపశ్య జ్జనార్దనమ్ ।**
**ఏకదా తు మహాత్మానం భూపతే భూపతిం విభుః ।**
**అంతర్హితో జగాదైవం భగవాన్ పురుషోత్తమః ।**
**నారాయణగిరౌ మాం త్వం ద్రక్ష్యసే హే మహీపతే ।**
**భక్తిభావేన మనసా తప స్తప్త్వా సుదుస్తరమ్ ॥**
**తత్ర పుష్కరిణీ దివ్యా విపులా పాపహారిణీ ।**
**త్రైలోక్యవిశ్రుతా పుణ్యా స్వామిపుష్కరిణీతి వై ।**
**గంగాద్యైః సకలై స్తీర్థైః సమానా విమలోదకా ।**
**తస్యాం స్నాత్వా భవిష్యంతి నరాః పాపవివర్జితాః ।**
**తస్యా స్తీరే మహాపుణ్యే పుష్కరిణ్యా నృపాత్మజ ।**
**మహతా తపసా యుక్తః తిష్ఠ త్వం సుసమాహితః ।**
**ఏనాం పురాతనీం పుణ్యాం సేవమానో న సీదతి ।**
**నర స్సమస్తపాపై స్తు సంయుక్తోఽపి సర్వేశ్వర ।**
**య స్త్వేనాం సేవతే భక్త్యా స గచ్ఛే త్పరమం గతిమ్ ।**
**దేవదేవ ప్రసాదేన కృష్ణస్య పరమాత్మనః ।**
**స కామాశ్చాపి సేవంతే యే నరా నియతేంద్రియాః ।**
**స్వామిపుష్కరిణీ మేనాం తాన్ కామా నాప్నువంతి హి ।** (వామన–32 అధ్యాయే)

ఇట్లు ఈ స్వామిపుష్కరిణి, తనయందు నీరాడినవారికి కోరిన ఫలములను ఇచ్చుట ఆ భగవానుని సంకల్పముచే ఏర్పడుటచే ఇందు స్నానము చేసినవారికి ఫలమును ఇచ్చువాడు ఆ శ్రీనివాసుడే అగుటచే, అతడే ఫలము నిచ్చువాడుగా ఇందు అనుసంధింపబడినది.

57. **ఓమ్ కుమారధారికావాసస్కంధాభీష్టప్రదాయ శ్రీవేంకటేశాయ నమః**

(కుమారధారిక అనెడి పుణ్యతీర్థముయొక్క తీరములో నివసించునట్టి స్కంధునకు అభీష్టములగు వరములను ప్రసాదించిన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

ముందు నామములో స్వామిపుష్కరిణీమాహాత్మ్యము వర్ణింపబడినది. ఇందు ఆ స్వామిపుష్కరిణికంటె మిక్కిలి మహిమను ఒకానొక సమయవిశేషములలో పొందునట్టి కుమారధారికా అనెడి తీర్థముయొక్క మహిమ తెలుపబడుచున్నది. ఈ తీర్థముయొక్క మహిమను బోధించు కథ మార్కండేయపురాణము 3వ అధ్యాయములో విస్తృతముగా తెలుపబడినది. మిగిలిన పురాణములందుకూడ సంగ్రహముగా కలదు.

ఈ పుణ్యతీర్థమునకు **''కుమారధార''** అను పేరు కల్గుటకు రెండు కారణములున్నవి–అని రెండు వృత్తాంతములనుద్వారా అగస్త్యమహర్షి మార్కండేయునకు తెలిపినట్లు మార్కండేయ పురాణము వర్ణించుచున్నది. అందు మొదటిది ఏమనగా – ఒక వృద్ధబ్రాహ్మణుడు తన వార్ధక్యమువలన, దారిద్ర్యమువలన శరీరముతో, ధనముతో చేయవలసిన ధర్మములను అనుష్ఠింప వీలులేకుండుటచే, కుటుంబమును భరింపలేకపోవుటచేతను మిక్కిలి దుఃఖించి, "నేను ఏ ధర్మమును అనుష్ఠింపలేకపోవుటచే నా జన్మ వ్యర్థమైనదే!" అని తనను తానే గర్హించి, ఈ వేంకటాద్రిశిఖరమును ఎక్కి, అచటినుండి క్రిందపడి, భృగుపతన మనెడి క్రమమున ప్రాణత్యాగము చేయవలెనని తలచి, ఆ తరుణములో సకలదేవతలను పిలిచి, ''నా దారిద్ర్యము చేతను, వార్ధక్యముచేతను ఏ విధమైన ధర్మమును అనుష్ఠింపలేకపోవుటచే, వ్యర్థమైన ఈ జన్మను విడచుటకు ఈ పర్వతమునుండి భృగుపతనమును చేసి, ప్రాణములను తీసికొందును" అని ఉచ్చైః స్వరమున పల్కి, క్రిందపడు సమయమున శ్రీవేంకటేశ్వరుడు పర్వతపాదభాగమున నిలచియుండి, ''ఓ వృద్ధబ్రాహ్మణా! క్రిందపడవద్దు. భృగుపతనమనునది బ్రాహ్మణులకు తగని కార్యము. అందుచే, ఆత్మహత్యతో ఇంకను అధికమైన పాపమును మూటకట్టుకొనవద్దు. క్రిందకు దిగిరమ్ము. నీవు కోఱినదానిని ఇచ్చెదను" అని అనునయించుచు పలుకగా, బ్రాహ్మణుడు క్రిందకు దిగివచ్చెను. అపుడు అతని చేయిని పట్టుకొని తీసికొని వచ్చి పాపనాశన తీర్థమునకు ఉత్తరమునగల ఈ కుమారధార అనెడి తీర్థమును చేర్చి, "ఇందు స్నానమును చేయుము. అన్ని పాపములు నశించును" అని పల్కెను. ఆ వృద్ధబ్రాహ్మణుడును ఆ తీర్థమునందు మునిగి, పైకి లేవగానే కుమారుడు (కౌమారదశలో నున్నవాడు) అయ్యెను. శరీరములో నున్న ముసలితనము పోయి, చక్కని బలము కల్గెను. కాని, తనను అచటికి పిలచుకొనివచ్చిన పురుషుని చూడలేక పోవుటచే చాల బాధపడెను. అపుడు ఆకాశమునుండి అ శరీరవాణి ఇట్లు విన్పించెను. "ఓ బ్రాహ్మణా! నిన్ను పిలుచుకొని వచ్చినవాడు సాక్షాత్తు వేంకటేశ్వరుడే! నీపట్ల అనుగ్రహముతో నీవు కోరినట్లు అవసరమైన ఐశ్వర్యమును, యౌవనమును నీకు అనుగ్రహించెను. అందుచే నీవు నీ సొంత ఊరుకు పోయి, భార్యాపుత్రులతో కలిసియుండి, సకల భోగభాగ్యములను అనుభవించుచు, శరీరముతో చేయదగిన సకలధర్మములను



చేయుచు, ధనముతో సకలదానములను చేయుచు, నీ కాలమును గడపుము. ఏ సత్కార్యమును చేసినను, **"శ్రీవేంకటేశః ప్రీయతామ్"** (వేంకటేశ్వరుడు సంతోషించుగాక) అని పల్కుచు చేయుము." అపుడు సర్వదేవతలును ఆ ఆశ్చర్యమును చూచి, "ఈ తీర్థముయొక్క ప్రభావముచే కదా! భగవానుడు బ్రాహ్మణునకు ఇంతగా అనుగ్రహించెను" అని ఆనందించి, ఈ తీర్థమునకు వృద్ధుని కుమారునిగా చేయుటచే **"కుమారధారా"** అను పేరు కలుగునుగాక! అని పల్కి వెడలిరి. బ్రాహ్మణుడును అశరీరిరూపములో పల్కిన భగవానుని ఆజ్ఞానుసారము స్వదేశమును చేరి, సకలధర్మములను అనుష్ఠించుచు, చివరలో విష్ణులోకమును చేరెను – అను ఈ కథద్వారా వృద్ధులను కుమారులునుగా చేయుశక్తిని కల్గియుండుటచే ఈ తీర్థమునకు కుమారధార అను పేరు ఏర్పడినదని తెలిపినట్లయినది.

రెండవ వృత్తాంతము ఇట్లున్నది. దేవసేనాధిపతి కుమారస్వామి ఒకానొక సమయమున తారకాసురుని వధించుటచే అతనికి ఏర్పడిన బ్రహ్మహత్యాదోషమును పోగొట్టుకొనుటకై తన తండ్రి అగు పరమశివుని ఉపాయముకొఱకు ప్రశ్నించెను శివుడును నారాయణ నామమును ఉచ్చరించినంత మాత్రముననే అన్ని పాపములును నశించును. అయినను నీకు వేఱొక ఉపాయమును తెలిపెదను వినుము. సువర్ణముఖినదీతీరమున వేంకటాచలమను ఒక పర్వతము కలదు. దాని మహిమ అవధిలేనిది. ఆ కొండపై అనేక పుణ్యతీర్థములున్నవి. స్వామిపుష్కరిణీ తీరమున శ్రీనివాసుడను రూపములో పరమపురుషుడగు శ్రీమన్నారాయణుడు వేంచేసియున్నాడు. నీవు అచటికి వెడలి, కుమారతీర్థములో కొంచెము కాలము స్నానము చేసి, తపస్సుచేసినచో, నీ పాపము తొలగును. నీవు తపస్సును చేయునపుడు ప్రణవముతో కూడిన **"శ్రీవేంకటేశాయ నమః"** అనెడి మహామంత్రమును జపింపవలెను–అని ఉపదేశించి, పంపెను. కుమారస్వామి ఆ విధముగానే అచటికి వెడలి, మొదట కొండపై చక్రతీర్థములో స్నానము చేయునపుడే బ్రహ్మహత్య అతనిని విడచి, పోయి క్రోశదూరములో నిలచినది. పిమ్మట స్వామిపుష్కరిణిలో స్నానము చేసి, శ్రీనివాసుని సేవించి, పాపనాశనతీర్థములో తీర్థమాడి, అచటినుండి అచటికి వాయవ్యదిశలో నున్న, ధారగా ప్రవహించు కుమారతీర్థమును చేరి, శివుడుపదేశించిన మంత్రమును జపించుచు పండ్రెండు సంవత్సరముల కాలము తపస్సు చేసెను. పిమ్మట ఒకానొక సమయమున, మాఘమాసము మఘానక్షత్రముతోకూడిన పౌర్ణమినాడు మధ్యాహ్నము శ్రీవేంకటేశ్వరుని ఇపుడు అర్చామూర్తి రూపములో సేవించు రీతిలో సర్వమోహనాకారముతో ప్రత్యక్షమై, భగవానుడు కుమారస్వామిని పిలచెను. కుమారస్వామి కన్నులను తెఱచి, చూచినపుడు భగవానుడు జగన్మోహనరూపముతో, మందస్మితముతో శ్రీభూదేవులతో తనకు వరమును అనుగ్రహించుటకై ఎదురుగా వచ్చి సాక్షాత్కరించుటను చూచి, పరమానందమును చెంది, విశేషముగా స్తుతించెను. భగవానుడును ''నీకు అభిమతములగు వరములను వేడుమ'' ని అనతి ఇవ్వగా,

కుమారస్వామి! “ ఓ ప్రభూ! నాకు నీ పాదసేవ తప్ప వేఱేమి వరము కావలయును! నీ పాదసేవకై దేవతలు, మనుష్యులును ఈ పర్వతముపై కాచుకొనియుందురు. ఈ పర్వతముయొక్క మహిమ ఇట్టిదని ఎట్లు చెప్పుదును? ఇందు కాలుపెట్టగానే నా బ్రహ్మహత్యాపాతకము దూరముగా పోయినదికదా! అట్టి ఈ పర్వతమునందుండి, నీ పాదసేవను పొందునట్లు వరమును అనుగ్రహింపుము.” అని వేడెను. అపుడు భగవానుడు సంతోషించి “ఈ కల్పాంతమువరకు నీవు ఈ తీర్థముయొక్క తీరములోనుండి నన్ను సేవింపుము. ఎవడు –

**కుంభమాసే పౌర్ణమాస్యాం ప్రాదుర్భావదినే హరేః ।**
**కుమారధారికాస్నానం కులకోటిం సముద్ధరేత్ ॥**

అనెడి మంత్రమును జపించి, మాఘమాసము మఘానక్షత్రముతోకూడిన పౌర్ణమినాడు ఇందు స్నానమును చేయునో, అతనికి సర్వఫలములును సిద్ధించును. ఆ దినములో ఈ తీర్థతీరమున ఏ దానము ఏ కొంచెము చేసినను అది మేరువుగా వృద్ధి చెందును. లోకములో గల క్షేత్రములన్నిటిలో వేంకటాచలము చాల గొప్పది. అందున్న స్వామిపుష్కరిణి అన్నితీర్థములందు మిక్కిలి గొప్పది. ఆ స్వామిపుష్కరిణికంటె నా అవతారదినమైన మాఘపూర్ణిమ దినమున ఈ తీర్థము విశేషమహిమను పొందినదియై ప్రకాశించును. ఓ స్కంధా! నీవు తపస్సు చేసి, నన్ను ఈ కుమారధారికా తీర్థప్రభావముతో సాక్షాత్కరించుకొన్నావు. ఈ కల్పాంతమువరకు నీవు తీర్థతీరములోనుండి, నన్ను సేవించుచుండుటచే ఈ తీర్థము నీ పేరున అనగా **“కుమారధార”** అను పేరు వ్యవహరింపబడును” అని వరమిచ్చి అంతర్ధానమయ్యెను. ఇట్లు భగవానుని దివ్యవాక్కువలననే “కుమారధారికా” అను పేరు దీనికి ఏర్పడినది. ఇది రెండవ కారణము. ఇట్లు రెండు విధములుగా కుమారధార అను పేరు ఏఱ్పడిన పుణ్యతీర్థముయొక్క తీరమున నిత్యవాసమును చేయు గొప్పభగవద్భక్తుడగు స్కందునకు అభీష్టమైన భగవత్సేవను అనుగ్రహించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను–అని ఈ తిరునామముయొక్క అర్థము. వేంకటాచలమాహాత్మ్యములో మార్కండేయ పురాణమునందలి 3వ అధ్యాయమును పఠించినచో, అందు పైన పేర్కొనబడిన వృత్తాంత ద్వయముయొక్క వివరము, ఈ తీర్థముయొక్క విశేషమహిమయును, భగవానుని భక్తపరాధీనత్వమును మనస్సు కఱుగురీతిలో తెలుపయుండుటను చక్కగా గమనింపవచ్చును. విస్తృతిభీతిచే ఆ శ్లోకము లిచట ఉట్టంకింపబడలేదు.

58. **ఓమ్ జానుదఘ్నసముద్భూతపోత్రిణే శ్రీవేంకటేశాయ నమః**

(మోకాలువరకు పుట్టలోనుండి బయటికివచ్చిన వరాహరూపియైన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

ముందుతిరునామములో స్కందుడు శ్రీనివాసుని ఈ కల్పాంతమువరకు



ఆరాధించుచున్నాడను విషయము ప్రస్తావింపబడినది. ఈ తిరునామములో, స్కందుడు అట్లు ఆరాధించుకాలములో జరిగిన (పద్మపురాణమునందు, వరాహపురాణమునందు వర్ణింపబడినది) జ్ఞాపకము చేయబడుచున్నది. తొండమాన్ అనెడి ప్రభువు, వసు అనెడి వేటగాడును భగవానుని సేవించినపుడు భగవానుడు మోకాలి ఎత్తులో దర్శనమిచ్చినట్లు, కుమారస్వామి మూడు సంధ్యలయందు భగవానుని ఆరాధించుచున్నట్లును వరాహపురాణము 2వ భాగము 9వ అధ్యాయములోని –

**స్కందేనారాధ్యమానం తం త్రిసంధ్యపురుషోత్తమమ్ ।**
**వల్మీకగూఢపాదాబ్జ మాజానుపురుషోత్తమమ్ ॥**
**తతో దృష్ట్వా ముదా దేవం ప్రణేమతు రుభా వపి ।** (77,78 శ్లో)

అనెడి శ్లోకములో తెలుపబడినది. కావున ముందు తిరునామములో ప్రస్తావింపబడిన స్కందునితో ఈ తిరునామములో అనుసంధింపవలసిన కథకు సంబంధముండుటచే ఆ తిరునామముతో దీనికి సంగతి కలదు. వసు అనెడి వేటగానియొక్క, తొండమాన్ అనెడి ప్రభువుయొక్క చరిత్రసంగ్రహము, వారికి భగవానుడు మోకాలి పరిమాణములో వరాహరూపిగా సేవను అనుగ్రహించిన వృత్తాంతమును పద్మపురాణ, వరాహపురాణములను రెండిటిని అనుసరించి సంగ్రహముగా వ్రాయబడుచున్నవి. తిరుమలకు ఈనాటికిని వరాహక్షేత్రమనియే పేరు. క్షేత్రప్రభువు వరాహస్వామియే. ఈనాడును స్వామిపుష్కరిణీ తీరమున ప్రత్యేకమైన కోవెలలో వేంచేసియుండు శ్రీభూవరాహమూర్తికే ప్రతిదినము ఆరాధన, నివేదనాదులు ముందుగా చేయబడుచున్నవి. పిమ్మటనే శ్రీనివాసునకు జరుపబడుచున్నవి. అట్టి వరాహమూర్తి ఆవిర్భావము ఈ తిరునామములో అనుసంధింపవలసిన కథలో కలదు.

పూర్వ మొకానొకసమయమున వసువు అనెడి వేటగాడు, అతని భార్యయు ఈ తిరుమలలో ధ్యానమును పండించి, ఆ ధ్యానమునువండి, అందులో తేనెను కలిపి, శ్రీనివాసునకు సమర్పించి పిమ్మట భుజించుచుండిరి. వారికి వీరుడను ఒక పుత్రుడు కలడు. ఒకనాడు వసువు తన కుమారుని ఆ ధాన్యమునకు కావలిగా పెట్టి, తేనెను వెదకి తెచ్చుటకు అరణ్యమునకు పోయెను. చాలసేపు అయినను తండ్రి తిరిగి కాకపోవుటచే, ఆ బాలుడు తండ్రివలె ధాన్యమును వండి, శ్రీనివాసునకు నివేదనము చేసి, భుజించెను. పిమ్మట తండ్రివచ్చి, ధాన్యము లేకుండుటను చూచి, భగవానునకు నివేదనము చేయకనే భుజించెనని తలచి, మిక్కిలి కోపముతో, ఆ బాలుని తన శక్తి కొలది కత్తితో నఱికి వధింపవలెనని తలచి, కత్తిని చేత బట్టెను. అపుడు భగవానుడు చెట్టుపై దాగుకొనియుండి, ఆ కత్తిని అతని చేతినుండి లాగికొనెను. వసువు వృక్షముననున్న భగవానుని చూచి, ఇదేమి ఆశ్చర్యమని ప్రశ్నింపగా, భగవానుడును “ఓ వేటగాడా! నీ పుత్రుడు నా పట్ల అపారమైన భక్తిప్రపత్తులను కలవాడు. అతడు నాకు నివేదన చేసిన పిమ్మటనే భుజించెను. నీకు స్వామిపుష్కరిణీ తీరమున ఒకచోట మాత్రమే దైవసన్నిధి

కలదు. అతనికి నేను అన్నిచోట్ల ఉన్నాను. అందుచే అతని నీవు వధింపవలదు" అని పల్కెను.

ఈ వృత్తాంతము ఇట్లుండగా, రంగదాసుడను ఒకానొక బాలుడు పాండ్యదేశమునుండి ఈ వేంకటాచలమునగల భగవానుని సేవింపవలెనను ఆశతో ఈపర్వతముపైగల శ్రీనివాసుని సేవించి, పరమానందమును పొంది, ఈ భగవానునకు పుష్పకైంకర్యమును చేయగోరి, ఒక పూదోటను నిర్మించి, ప్రతిదినము పలు పుష్పమాలలుగా కూర్చి, వైఖానసార్చకులకు ఇచ్చి, భగవత్కైంకర్యమును చేయుచు, ఆనందించుచుండెను. ఇట్లు దెబ్బది సంవత్సరములు జరిగిన తర్వాత ఒకనాడు అలవాటుచొప్పున రంగదాసుడు పూదోటకు వెడలినపుడు అచట కొలనులో ఒక గంధర్వుడు పలు స్త్రీలతో జలక్రీడను నల్పుటను చూచి, అతని మనసు చలించినది. అందుచే అతనికి శరీరములో ఒక విధమైన అశుద్ధి ఏర్పడినది. పిమ్మట వారందఱును వెడలిపోయిన పిమ్మట, మనస్సును దిటవుచేసికొని, స్నానమును చేసి, నూతన పుష్పములను కోసి, మాలను కట్టి, భగవత్సన్నిధికి ఆలస్యముగా వచ్చెను. అర్చకులు అంత ఆలస్యముగా వచ్చిన అతనిపై కోపించి, అంత ఆలసించుటకుగల కారణమును గూర్చి ప్రశ్నించిరి. రంగదాసుడు జరిగిన వృత్తాంతమును చెప్పుటకు సిగ్గుపడి, తలను వంచుకొని నిలచెను. అపుడు భగవానుడు సాక్షాత్తుగా రంగదాసుని చూచి, "ఓ రంగదాసా! ఎందులకు లజ్జించుచున్నావు! నావలననే నీవు మోహమును పొందితివి. నీవు ఇంకను నీవు పంచేంద్రియములను జయింపలేదు. ఆ గంధర్వరాజువలె నీవును ఒకరాజువై రాబోవు జన్మలో పుట్టి, అన్ని భోగములను అనుభవించి, పిమ్మట నాకు ప్రాకారము, విమానము మొదలగువానిని నిర్మింపజేసి, నాపట్ల విశేషమైన భక్తిని కలవాడవై, మోక్షమును పొందగలవు" అని పల్కెను. పిమ్మట రంగదాసుడు నూఱు సంవత్సరములు నిండువరకు భగవానునకు పుష్పకైంకర్యమును చేసి, కాలధర్మమును చెందెను.

ఈ రంగదాసుడే మరుజన్మలో తొండమాన్ అను ప్రభువుగా, చంద్రవంశమునకు చెందిన సువీరుడను మహారాజుకు, నందిని అనెడి రాణియందు జన్మించెను. ఇతడు అయిదవ సంవత్సరమునుండి, విష్ణుభక్తిని, సద్గుణములను కలవాడై వెల్గెను. పాండ్యదేశప్రభువు కుమార్తె పద్మావతిని వివాహము చేసికొని, నారాయణపురములో నివసించుచు, రాజ్యపరిపాలనమును చేయసాగెను. ఒకనాడతడు వేటాడనలెనని తలచి, ఈ తిరుమల ప్రాంతమునకు వచ్చినపుడు ఒక పంచవర్ణపు చిలుక "శ్రీనివాస" అని పలుకుచు ఎగిరిపోయినది. దానిని పట్టుకొనుటకై, వెంబడించుచు ప్రభువు పోయెను. కాని, ఆ చిలుక అతనికి దొరుకకుండ ఎగిరిపోయినది. దానిని వెదకుచు వచ్చిన ప్రభువు పూర్వము తెల్పిన వసువనెడి వేటగాని నివాసమును చేరి, అచట ఆ వ్యాధుని చూచి, పంచవర్ణపు చిలుకను నీవు చూచితివా! అని అడిగెను. ఆ వేటగాడు, "అది భగవానుని (శ్రీనివాసుని) చిలుక. శ్రీదేవి, భూదేవులచే పెంచబడుచున్నది.



దానిని పట్టుకొనుటకు ఎవరికిని సాధ్యముకాదు. అది పగటివేళలో అరణ్యములో తిరుగుచు, సంధ్యాసమయములో భగవానుని వద్దకు వచ్చును", అని పల్కి, "ఓరాజా! నీవు ఈనాడు ఇచటనే విశ్రమింపుము. నేను భగవత్సన్నిధికిపోయి. నివేదనను చేసి, సేవించివచ్చెదను. అంతవరకు నీను నా కుమారునితో కలసి ఇచటనే ఉండుము" అని పల్కెను. అది వినిన రాజు, "నేనుకూడ భగవానుని సేవింపవచ్చెదను" – అని పల్కి, అతనితో కలసి వెడలి, శ్రీనివాసుని సన్నిధిని చేరి, స్వామి పుష్కరిణిలో నీరాడి, శ్రీదేవి, భూదేవులతో, సర్వాయుధములతో, సర్వాభరణములతో కూడిన పరమపురుషుని కన్నులార దర్శించి, పరమానందమును చెందెను. వేటగాడును తాను తీసికొని వచ్చిన, తేనె కలిపిన ధాన్యపు వంటకమును, భగవన్నివేదనను చేసి ప్రభువునకు ఇచ్చి, తాను కూడ భుజించెను. వేటగాడు పిమ్మట తన నివాసమునకు పోయెను. అనంతరము ఒకానొక సమయమున శ్రీనివాసుడు శ్వేతవరాహరూపమును దాల్చి, వసువు పొలములోని ధాన్యమును రాత్రివేళలో మేయసాగెను. ఇట్లు కొంతకాలమున ప్రతిదినము జరిగినది. వేటగాడును ఈ శ్వేతవరాహ రూపమును చూచి, దానిని పట్టుకొనవలెనని తలచి, ఒకనాడు దానిని తరిమి, పరుగెత్తునపుడు అది ఒకపుట్టలో దూరినది. అపుడు సాధారణ వరాహమనియే తలచిన ఆ వేటగాడు ఆ పుట్టను తవ్వెను. వెంటనే అతడు మూర్ఛిల్లి కిందపడెను. అతని కుమారుడపుడు భగవానుని విశేషముగా స్తుతించి, నమస్కరించెను. అపుడు ఆ వేటగానిలో భగవానుడు ఆవేశించి, "నేను వరాహస్వామిని, ఈ పుట్టలో నివసించుచున్నాను. నీవు తొండమాన్ ప్రభువుకు తెలిపి, నా వరాహమూర్తిని ప్రతిష్ఠ చేసి, వైఖానసులద్వారా ఈ పర్వతముపై ఆరాధించునట్లు ఏర్పాటు చేయుము" అని నియమించెను. పిమ్మట మూర్ఛ నుండి తేరుకొని, ఈ వృత్తాంతమును వేటగాడు ప్రభువు వద్దకుపోయి, జరిగిన సంగతిని అంతటిని తెలియజేసెను. అది ఏమి? అనగా – భగవానుడు స్వామి పుష్కరిణీతీరమున ఒక పుట్టలో వేంచేసియుండుటచే ఆ పుట్టను కపిలజాతికి చెందిన ఆవుల పాలతో కఱిగించినచో, ఆ పుట్టలో ఒక శిల కన్పించును. ఆ రాతిలో భూదేవీ సహితుడగు వరాహమూర్తిని నిర్మింపజేసి, ఆ భగవానునకు ప్రాకారాదులను కట్టించి, ప్రతిష్ఠచేసి, వైఖానసార్చకులద్వారా ఆరాధనను చేయింపుము. అట్లే, ఆ స్వామిపుష్కరిణి దక్షిణతీరములో శ్రీనివాసుడు ఒక పుట్టలోని పాదప్రవేశమున మఱుగుపడియుండి సాక్షాత్కరించుచున్నాడు. ఆ పుట్టనుకూడ ఆవుపాలద్వారా కరిగించి, ఆ చోటకూడ – అనగా, స్వామి పుష్కరిణికి దక్షిణతీరమున, ఉత్తరతీరమున గల ఈ రెండు మూర్తులకును ప్రాకారాదులను, గోపురాదులను కట్టించి, ఆరాధనను ఏర్పాటుచేసి రావలయును – అని భగవానుడు నియమించెను –" అని పల్కెను. తొండమాన్ చక్రవర్తియు భగవానుని నియమనమును శిరసా వహించి, ఆ వేటగానితో ఈ పర్వతమునకు వచ్చి, భగవన్నియమనము ప్రకారము ప్రాకారగోపురాదులను కట్టించి, ఆరాధింపజేసి, ఉన్నతగతిని పొందెను. ఈ కథ వరాహపురాణములో కలదు. పద్మపురాణములో కూడ ఈ కథ చాలవరకు ఈ విధముగానే

వర్ణింపబడినది. వరాహమూర్తిని సాక్షాత్తుగానే పుట్టనుండి నిరంతరమైన క్షీరధారచే కఱగించి, తీసికొని రావలెనను భగవానుని ఆజ్ఞతో పుట్టను కపిలధేనువుల పాలయొక్క నిరంతర స్రావముతో కఱగించునపుడు శిరస్సునుండి మోకాలివరకు కరగిన తర్వాత, క్షీరధార అజాగరూకత కారణముగా కొంచెముసేపు నిలచిపోయినది. ఆ పిమ్మట ఎంత పాలను స్రవింపజేసినను, ఆపుట్ట కఱుగలేదు. అపుడు ప్రభువు ఆశ్చర్యపడగా, భగవానుడు – "ఓరాజా! వ్యర్థప్రయత్నమును చేయకుము. ఈ మోకాలివరకే చాలును. దీని పాదభాగము నీకు కన్పింపదు. ఈ వరాహరూపమునే శిలలో నిర్మింపజేసి, ప్రతిష్ఠను చేయించి, సర్వభోగములను సమర్పించి, వైఖానసార్చకులనుగొని ఆరాధన చేయింపుము" అని ఆజ్ఞాపించెను. అట్లే, తొండమాన్ చక్రవర్తి చేసి సద్గతిని చేరెను. ఇది పద్మపురాణములోగల కథాప్రకారము. పద్మపురాణగతములగు శ్లోకములీ సందర్భమున ఇట్లున్నవి –

**ఆజానుచావిర్భవతి పురుషే సూకరాత్మని ।**
**విచ్ఛిన్నా క్షీరధారాఽభూత్ ధారా సాతు ప్రమాదతః ।**
**తావాన్ ప్రత్యక్షదృష్ట స్సః తదథో న హ్యదృశ్యత ॥**
**పశ్చాద నేకవిధయా రాజాఽపి ద్రష్టు మక్షమః ।**
**ప్రయత్నా దప్రతీకారోఽతిష్ఠత్ తూష్ణీం స తృష్ణధీః ॥**
**.....................................**
**వరాహరూపవిభవః పురాణః పురుషోత్తమః ।**
**ఉవాచ వచనం శ్రీమాన్ కరుణాపరిణామభూః ॥**
**రాజన్ అల మలం వ్యర్థప్రయత్నేనాతిభూయసా ।**
**ఏతావాం స్తవ దృశ్యోఽహం తదధో న నరాధిప ॥**
**ఏతద్రూపం ప్రతిష్ఠాప్య శుద్ధయా శిలయా నృప ।**
**తస్మై దేహ్యఖిలాన్ భోగాన్ పూర్ణో భూత్వా సుపుష్కలాన్ ॥**
**అప్రాకృతాంగో విరజాః సాత్త్వికోఽయ మితి స్మరన్ ।**
**వైఖానసై ర్మహర్షిభిః అర్చాపయ నరాధిప ॥**
**పశ్చా న్మా మాప్నుయా గచ్ఛ సాధు శాధి వసుంధరామ్ ।**

(పాద్మ – 29 – 45నుండి53)

ఇట్లు మోకాలివరకు పుట్టనుండి అవతరించిన వరాహమూర్తి శ్రీనివాసుడే. ఒకే స్వామి శ్రీనివాసమూర్తియై, స్వామిపుష్కరిణీతీరమున, భూవరాహమూర్తియై ఉత్తరతీరమున సేవను అనుగ్రహించుచు, ఈ కలియుగములో భక్తజనుల కోరకలను పూర్తిచేయుచున్న తీరు పూర్వోక్త పురాణములలో తెలుపబడినది. ఇట్లు శ్వేతవరాహరూపములో సేవను అనుగ్రహించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈ తిరునామముయొక్క తాత్పర్యము.



### (59) ఓమ్ కూర్మమూర్తయే శ్రీవేంకటేశాయ నమః
(కూర్మరూపమును దాల్చిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ప్రళయకాలము ముగిసి, సృష్టి ఆరంభమగునపుడు జలమయమైన సముద్రములో మఱ్ఱిఆకుపై బాలకుడై శయనించియున్న పరమపురుషుడు శ్వేతవరాహరూపమును దాల్చి, పాతాళమునకు వెడలి, భూమిని పైకి ఉద్ధరించి తీసికొనివచ్చి స్థాపించి, వైకుంఠమునుండి క్రీడాద్రి అనెడి పర్వతమును రప్పించి, సువర్ణముఖీ తీరమున వేంకటాచలమనెడి పేరుతో స్థాపించి, అందు ఈ కల్పాంతమువరకు వేంచేసియున్నాడు. ఇట్లు శ్వేతవరాహమూర్తిచే భూమి ఈ కల్పములో స్థాపింపబడుటచే దీనికి శ్వేతవరాహకల్పమనిపేరు. ఇట్టి వరాహమూర్తియొక్క ప్రభావము పూర్వనామములో వర్ణింపబడినది.

ఇక, ఈ నామమున ఇట్టి వరాహమూర్తిచే ఉద్ధరింపబడిన భూమి ఏకూర్మమూర్తిచే ధరింపబడుచున్నదో ఆ కూర్మమూర్తి స్మరింపబడుచున్నది.

దశావతారములలో, జలమున నివసించు మత్స్యరూపము మొదట, పిమ్మట జలస్థలములు రెండిటియందు సంచరించు కూర్మరూపము, అనంతరము స్థలములో మాత్రము తిరుగు వరాహరూపము, (ఇంతవరకు తిర్యగ్రూపములు), తరువాత మృగరూపము, మానవరూపము అనెడి రెండు రూపములు కలసిన నరసింహ రూపము, తదనంతరము మనుష్య రూపములో మఱుగుజ్జు రూపము అగు వామనరూపము, తరువాత పొడుగురూపమునుకల పరశురామరూపము, ఆపిమ్మట సర్వగుణములనుకల రామకృష్ణరూపములును అనుసంధింపబడుచున్నవికదా! ఆ దశావతారములలో వరాహావతారమునకు ముందు అవతారము కూర్మరూపము. వరాహస్వామి వర్ణింపబడగానే తత్పూర్వమగు కూర్మావతారము స్మరణకు వచ్చుటచే ఆ కూర్మరూపమిచట వర్ణింపబడుచున్నదని ప్రకృతసంగతిని చెప్పవచ్చును.

భగవానుడు కూర్మరూపమును ధరించి, సమస్తజగమునకు ఆధారమైయుండి, దానిని వహించియున్నాడు. దీనినే **"అఖిలజగదాధారాయ కూర్మరూపిణే......నమః"** అని ఆధారశక్త్యాదితర్పణములో అనుసంధించుచున్నారు. ఇదియేకాక, దేవతలు అసురులును పాలసముద్రమును చిలికినపుడు మందర పర్వతమును కవ్వముగా ఉపయోగించిన సమయమున అది కలకుండనుండుటకుగా పరమపురుషుడు కూర్మరూపమును ధరించి, ఆ పర్వతమును క్రిందపైన ఆవేశించియున్నట్లు విష్ణుపురాణము మొదలగు పురాణములందు కలదు. ఇట్లు రెండు సమయములలో భగవానుడు కూర్మరూపమును దాల్చెను. ఇందు మొదట చెప్పబడిన కూర్మరూపము చిరకాలము నిలచియున్నదై, జగత్తును ధరించుచున్నది. కూర్మరూపమే ఇచట మనకు అనుసంధేయము. భూమివిషయము పూర్వనామములో ప్రసక్తమగుటచే, ఆ భూమిని వేఱొకరూపములో దాల్చియుండు

ఆదికూర్మరూపమే ఇచట అనుసంధింపతగినది. దశావతారములను వరుసగా అనుసంధించునపుడు మందరపర్వతమును ధరించిన రూపము పెద్దలచే అనుసంధింపబడుచున్నది. దానికి కారణము ఏమి? అనగా – సామాన్యముగా ఆ పది అవతారములును ఆయా సమయములలో కొందఱు భక్తులను ఆపదనుండి కాపాడుటకు కొంచెము కాలమువరకు ఎత్తబడియున్న రూపములగుటచే, వానిమధ్యలోనున్న కూర్మరూపముకూడ దేవతలకు అమృతమును చిలికి ఇచ్చి, వారి దుఃఖములను పోగొట్టుటకు తాత్కాలికముగా ధరించిన రూపమైయుండుట ఉచితమగుటచే, ఆరూపమిచట అనుసంధింపతగినది. ఈ ఆదికూర్మము, ఆదివరాహము ఆ దశావతారములలోనున్న మూర్తులవలెకాక, ఎవరి ప్రార్థనను అనుసరింపకుండగవానుడు స్వయముగానే లోకమును సృష్టింపగోరి, వరాహరూపమును ఎత్తి, సముద్రమునుండి పైకి కొనివచ్చి, కూర్మరూపమును ఎత్తి, దానిని ధరించుచున్నాడు. ఈ వృత్తాంత మిచట వేంకటాచలమాహాత్మ్యములో చెప్పబడుటచే ఈ మూర్తి ఈ తిరునామములో అనుసంధింపబడుట ఉచితమని తోచును.

శ్రీవేంకటాచలమాహాత్మ్యములో వామనపురాణము 24వ అధ్యాయములోని వాయుగీతలో –

**నిరాధారే జగత్యస్మిన్ నిరాలంబే చరాచరే ।**
**ఆధారకూర్మరూపే త్వం పురుషోత్తమ తిష్ఠసి ॥**

అని పైన తెల్పిన కూర్మరూపము స్తుతింపబడినది. ఇట్లు సర్వజగదాధారభూతుడగు శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను – అనునది ఈ నామముయొక్క అర్థము.

(60) **ఓమ్ కిన్నరద్వంద్వశాపాంతప్రదాత్రే శ్రీవేంకటేశాయ నమః**

(కిన్నర దంపతుల శాపమునకు విమోచనమును అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

**"జానుదఘ్నసముద్భూతపోత్రిణే"** అనెడి 58వ తిరునామముతో ఈ నామమునకు సాక్షాత్సంగతి కలదు. 59వ నామమగు **"కూర్మరూపిణే"** అనునది మధ్యలో ప్రసంగాత్ వచ్చినది. 58వ తిరునామములో వసుదేవుడనెడి వేటగాని చరిత్ర ప్రస్తావింపబడినది. ఈ తిరునామములో ఆ వ్యాధదంపతుల పూర్వచరిత్రము, శాపవిమోచనమును వర్ణింపబడుచున్నది.

మిక్కిలి కోపిష్ఠివాడగు దుర్వాసమహర్షి ఆశ్రమములో పూర్వము ఒకానొక సమయములో ఒక కిన్నర దంపతులు లజ్జావిహీనులై విహరించిరి. దానిని చూచిన ఆ మహర్షి మిక్కిలి కోపించి, "మీరు నా ఆశ్రమములో సిగ్గులేకుండ ఇట్టి చేష్టలను చేయుటచే సింహాచలమనెడి పర్వతముపై వ్యాధదంపతులుగా పుట్టుదురు"అని శపించెను. పిమ్మట ఆదంపతుల దుఃఖమును చూచి, "ఆ పర్వతముపై చిరకాలము నివసించిన పిమ్మట



శ్వేతవరాహస్వామి అనుగ్రహముచే మీరు శాపవిమోచనమును పొందగలరు" అని శాపవిమోచన కాలమును ఆ ముని తెలిపెను. అనంతరము కిన్నరదంపతులు పూర్వము తెల్పినరీతిలో ఈ తిరుమలలో వసువనెడి వ్యాధుడుగా, అతని భార్యగా పుట్టిరి. వీరు పంటను పైరు చేసి, భగవానునకు నివేదనను చేయుచు భుజించుచుండిరి. ఒకానొకసమయమున వీరి పొలములో రాత్రివేళలో ఒక అద్భుతమైన శ్వేతవరాహము వచ్చి పైరును తిని వేయుటను చూచిన వ్యాధుడు ఆ కాలములో ప్రభువైయున్నవానివద్ద ఈ దివ్యచేష్టను నివేదించెను. ఆరాజు ఆ లీలను నేరుగా దర్శింపదలచి, ఆ వ్యాధునితో కలసి ఈ పర్వతమునకు వచ్చి, రాత్రి ఆవరాహమును తఱిమినపుడు అది ఒక పుట్టలో ప్రవేశించి దాగినది. ప్రభువు ఆవరాహము భగవానుడే అయియుండునని తలచి, ఆ స్వామిని దర్శింపగోరి ఆ పుట్ట సమీపములో పరుండి ప్రాయోపవేశమును చేసెను. అపుడు ఆకాశములో అశరీరవాణి ఇట్లు విన్పించినది. "ఓ రాజా! నీవు ఈ వరాహమూర్తిని దర్శింపవలెనన్నచో, నీవు చేయు ఈ తపస్సును నిలిపి కపిలధేనువుల క్షీరము (నిరంతరధార)తో ఈ పుట్టను కఱగించినచో, ఆ భగవానుని సేవ లభించును". ప్రభువును ఆకాశవాణి నియమనము ప్రకారము మిక్కిలి జాగరూకతతో గోక్షీరములను బంగారుకుండలలో నిండించి, ఆపాలధారతో పుట్టను కఱగునట్లు చేసెను. అపుడు ఆ పుట్టనుండి వరాహమూర్తి ఆవిర్భవించినది ఆ మూర్తియొక్క మోకాలివరకు పుట్ట కఱగినపుడు అకస్మాత్తుగా ఆ పాలధార ఆగిపోయినది. పిమ్మట ఎంతగా ప్రయత్నించినను అంతకుమించి, పుట్ట కఱుగలేదు. అపుడు ఆ వరాహమూర్తి రాజును చూచి – "రాజా! వ్యర్థ ప్రయత్నమును చేయవద్దు. ఇంతకుమించి నీవు దర్శింపలేవు. అందుచే ఇంతవరకు చేసిన ఈ ప్రయత్నముతో విరమింపుము. భూవరాహమూర్తిని ఒక శిలలో నిర్మింపజేసి, ప్రతిష్ఠ గావించి, వైఖానసులద్వారా పూజను జరిపించుము. నీ దేహవియోగకాలమున తప్పక నన్ను చేరుకొనగలవు" అని ఆజ్ఞాపించెను. పిమ్మట ప్రక్కననే ఉన్న వ్యాధదంపతులకు శాపవిమోచనమును కల్గించి, తన స్థానమునకు చేర్చుకొనెను. ఇట్లు కిన్నరదంపతులకు శాపవిమోచనమిచ్చిన వృత్తాంతమును

**విష్ణుః కిన్నరదంపతీ ।**
**మునిశాపా న్మోచయిత్వా దదౌ తాభ్యాం స్వకంపదమ్ ॥** (పద్మా – 29–54)

అనెడి శ్లోకమువలన తెలియనగును. ఈ దంపతుల పూర్వచరిత్రము పద్మపురాణములో అదే 29వ అధ్యాయములో విస్తారముగా తెలిపబడినది పూర్వము తెలిపినరీతిలో ఒకడే భగవానునకు శ్రీనివాసుడను మూర్తి, శ్వేతవరాహమూర్తియు ఏర్పడియుండుటచే, శ్వేతవరాహమూర్తి లీలలను శ్రీనివాసుని లీలలుగానే భావించి, ఈ వేంకటేశాష్టోత్తరములో ఈ తిరునామము చేర్చబడినదని భావింపనగును.

(61) **ఓమ్ విభవే శ్రీవేంకటేశాయ నమః**

(చరాచరరూపములగు అన్ని వస్తువులయందు వ్యాపించి, ప్రకాశించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందు నామములో వరాహమూర్తిలో, శ్రీనివాసమూర్తిలోను ఒకే భగవానుడున్నాడని తెలుపబడినది. ఈ నామమున ఆ రెండు మూర్తులలో మాత్రమేకాదు, ప్రపంచమునందుగల అన్ని వస్తువులయందు ఒకే భగవానుడు వానికి ఆత్మయై లోపల బయట వ్యాపించియున్నాడు అని వర్ణింపబడుచున్నది. కావున ఈ తిరునామమిచట ప్రస్తుతమైనది.

**"అంత ర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"** అని, **"సర్వం ఖల్విదం బ్రహ్మ''** అనియు ఉపనిషత్తులు పల్కిన రీతిలో అన్ని పదార్థములందు అంతర్యామియైయుండి, వాని స్వరూపస్థితి ప్రవత్తులను నిర్వహించువాడు పరమాత్మ. అట్టి పరమాత్మ స్వరూపమే వేంకటేశుని మూర్తియందును విశేషసాన్నిధ్యమును కల్గియుండుటచే విభవగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈ తిరునామము తెలుపుచున్నది.

(62) **ఓమ్ వైఖానసమునిశ్రేష్ఠపూజితాయ శ్రీవేంకటేశాయ నమః**
(వైఖానసకులములో పుట్టున మునిశేష్ఠులచే పూజింపబడిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముంది తిరునామము ప్రసంగవశమున ప్రసక్తమైనది. దానికి ముందున్న నామము అగు **"కిన్నరద్వంద్వశాపాంతప్రదాత్రే"** అనెడి నామముతో దీనికి సాక్షాత్సంగతి కలదు. కిన్నర దంపతులకు శాపవిమోచనమునిచ్చిన భగవానుడు ప్రభువును చూచి, ఆజ్ఞాపించునపుడు తనకు వైఖానసులద్వారా ఆరాధన జరుపుమని నియమించెను. ఈ విషయము ఈ తిరునామములో చెప్పబడుచున్నది.

చతుర్ముని మానసపుత్రుడగు విఖనసముని అను ఒక మహర్షి కలడు. అతడు వైఖానస కల్పసూత్రము మొదలగు సంస్కారములను పొంది, గర్భవైష్ణవులై వెల్గువారు వైఖానస పదవాచ్యులు. వీరి కులమునకు వైఖానసకులమని పేరు. ఈ విఖనస మహర్షి భగవానుని ఆలయములలో అర్చామూర్తులను పూజించు రీతిని తన సూత్రములలో వివరించెను. ఇతనిని అనుసరించి, అత్రి, భృగు, మరీచి, కశ్యపులు అనెడి నల్గురు మహర్షులు పలు సంహితాగ్రంథములను రచించి, ఆలయపూజకు ఆవశ్యములగు సర్వవిషములను సాంగోపాంగముగా తెలిపిరి. వీరు పల్కిన క్రమమునే అనుసరించి చేయు పూజావిధానమునకు వైఖానసపూజ అని పేరు. ఇదికాక, పాంచరాత్రపూజ అను వేఱొక విధమైన పూజకూడ కలదు. అది పాంచంత్ర సంహితలనబడు (సాక్షాత్తు భగవానుడే పల్కిన) గ్రంథములందు చెప్పబడిన రీతిని అనుసరించి చేయు పూజ. ఈ పాంచంత్ర క్రమమున పూజను చేయువారు, పూజ చేయుటకుతగిన యోగ్యత తమ కల్గుటకు దీక్ష అను ఒక సంస్కారమును పొందుదురు. ఇందు తప్తచక్రాంకనము, ముద్రాధారణములు చేరును. ఈ దీక్షను పొందిన పిమ్మటచే పాంచరాత్రులకు ఆలయార్చనయందు అధికారము



ఏర్పడును అని వారి అభిప్రాయము. వైఖానసులకు తల్లి గర్భములోనున్నపుడే భగవానుని అనుగ్రహము ఏర్పడి వైష్ణవత్వము సిద్ధించుననివారు భావించుటచే, దీక్ష మొదలగునవి ఏవియులేకుండగనే పూజచేయుటలో అధికారము ఏర్పడునని వారి అభిప్రాయము. ఇపుడు దక్షిణదేశములో ప్రఖ్యాతి గాంచిన కాంచీపురము శ్రీరంగము మొదలగు దివ్యదేశములలో పాంచరాత్రాగమ ప్రకారము, తిరుమల మొదలగు దివ్యక్షేత్రములలో వైఖానసాగమ ప్రకారమును ఆరాధన జరుగుచున్నది.

ఇట్లు అనాదికాలముగా వైఖానసకులములో పుట్టినవారే శ్రీనివాసునకు (వైఖానసాగమ రీతిలో) పూజను చేయుచున్నారు. ఈ వైఖానసులపట్ల శ్రీనివాసునకు పరమానుగ్రహము కలదనుట శ్రీనివాసదీక్షితాదిప్రముఖుల చరిత్రల వలన స్పష్టము. శ్రీవేంకటాచలమాహ్యాత్మ్యమునందును పలుచోట్ల ఈ వైఖానసుల ప్రస్తావమును, వీరే చిరకాలముగా పూజను చేయుచున్న విషయమును ప్రస్తుతింపబడినది. పూర్వోక్తదిశలో వరాహస్వామి ప్రభువునకు ఆజ్ఞాపించిన ప్రకరణములో కన్పించునట్టి –

**దృశ్యతే చ శిలా కాచిత్ వల్మీకస్థా సుశోభనా ।**
**వామాంకస్థభువమాంచ వరాహపద సంస్థితమ్ ॥**
**కారయిత్వా శిల్పినాఽథ ప్రతిష్ఠాప్య మునీశ్వరైః ।**
**వైఖానసైః మునివరైః అర్చయే త్తొండమా నపి ॥**
**ఏదద్రూపం ప్రతిష్ఠాప్య శుద్ధయా శిలయా నృప ।**
**తస్మై దేహ్యఖిలాన్ భోగాన్ పూర్ణో భూత్వా సుపుష్కలాన్ ॥**
**అప్రాకృతాంగో విరజా స్సాత్త్వికోఽయ మితి స్మరన్ ।**
**వైఖానసై ర్మహర్షిభిః అర్చాపయ నరాధిప ॥** **(పద్మ – 29–51,52)**

అనెడి శ్లోకముల వలన వైఖానసపూజయే తిరుమలలో వేంచేసియుండు వరాహస్వామికి, శ్రీనివాసునకును ఇష్టమని, ఈ పూజయే భగవానుడావిర్భవించిన కాలము మొదలు ఈనాటి వరకును నడచుచున్నదని తెలియుచున్నది. ఇట్లు పరమభక్తులై, ఋషిసమానులైన వైఖానసులచే చిరకాలముగా ఆరాధింపబడు శ్రీనివాసుని శరణు పొందుచున్నానని ఈ తిరునామముయొక్క తాత్పర్యము.

(63) **ఓమ్ సింహాచలనివాసాయ శ్రీవేంకటేశాయ నమః**
(సింహాచలమనబడు శ్రీవేంకటాద్రిపై నివసించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

**"జానుదఘ్నసముద్ధృతపోత్రిణే"** అనెడి 58వ తిరునామమునుండి 62వ తిరునామమువరకుగల నామములు పద్మపురాణాంతర్గతవృత్తాంతమును అనుసరించి ఏర్పడినవి. తొండమాన్ ప్రభువునకు వైఖానసులద్వారా భగవానుని ఆరాధించునట్లు ఆజ్ఞాపించిన వృత్తాంతమునకు పిమ్మట, సింహాచలమను ఈ కొండలోని నరసింహమూర్తిని నీలకంఠుడగు శివుడు ఆరాధించిన వృత్తాంతమును ఇకపై తెలుపబడుచున్నది. దీనికి

ముందు ఈ తిరునామములోని నరసింహమూర్తి ఈ పర్వతములో ఆవిర్భవించిన వృత్తాంతము (పై విషయమునకు ఉపోద్ఘాతముగా) తెలుపబడుచున్నది.

వేంకటాచలమనబడు ఈ కొండనుండి ప్రారంభించి, శ్రీశైలమనబడు మల్లికార్జున క్షేత్రమువరకు సర్పాకారముగానున్న పర్వతశ్రేణిలో శిరోభాగమగు తిరుమలకు శేషాచలమనియు, నడుమభాగమునకు అహోబిలము (గరుడాచలము) అనియు, పుచ్ఛభాగమునకు శ్రీశైలమనియును పేరు. ఈ పర్వతశ్రేణులు ముప్పది యోజనముల దైర్ఘ్యమును కల్గియున్నవి అని పురాణములు తెలుపుచున్నవి.

ప్రహ్లాదుని రక్షించి, హిరణ్యకశిపుని సంహరించుటకు భగవానుడు నరసింహ రూపమును ఎత్తినది ఈ పర్వతము పైననే. దీనికి గుర్తుగా ఈనాటికిని అహోబిలములో ప్రహ్లాదవరదుడగు నరసింహుడు అర్చామూర్తిగా దర్శన మిచ్చుచున్నాడు. ఈ విషయము వేంకటాచలమాహాత్మ్యము వరాహపురాణములో

**హిరణ్యాఖ్యవినాశాయ ప్రహ్లాదానుగ్రహాయ చ ।**
**నరసింహాకృతి ర్జజ్ఞే యస్మా దస్మా త్స్వయం హరిః ॥** (వరాహ - 36-26-27)
**సింహాచల మితి ప్రాహుః తస్మా దేనం మునీశ్వరాః ।**

అని చెప్పబడినది. మఱియు ఈ నరసింహమూర్తి శ్రీనివాసావిర్భావమునకు పూర్వమునుండి ఈ కొండపై వేంచేసియున్నట్లు తెలియుచున్నది. శ్రీనివాసునకు, పద్మావతికిని వివాహము జరిగిన సమయములో పక్వము చేయబడిన సర్వపదార్థములను నరసింహస్వామికి నివేదనముచేసి, వినియోగించునట్లు శ్రీనివాసుడు ఆజ్ఞాపించినట్లు పురాణకథనము. ఇట్లు చిరకాలమునకుముందే నరసింహుని ఆవిర్భావముచే సింహాచలమని పేరు పొందిన ఈ తిరుమలలో నిత్యవాసమును చేయు శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను - అని ఈ తిరునామముయొక్క తాత్పర్యము.

(64) **శ్రీమన్నారాయణాయ శ్రీవేంకటేశాయ నమః**

(మహాలక్ష్మితోకూడిన, నారాయణ రూపియైన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

ఈ తిరునామము, పూర్వనామము, రాబోవు నామమును - అను రెండు నామములతో సంబంధమును కల్గినది. పూర్వనామములో నరసింహభగవానుడు ప్రహ్లాదుని కాపాడుటకు ఈ తిరుమలలో ఆవిర్భవించినట్లు తెలుపబడినది. ఆ నరసింహభగవానుడు, ఆ అవతారములో మహాలక్ష్మితోకూడిన తరువాతనే దేవతలచే, మిగిలినవారిచే సేవించుటకు వీలగునట్టి స్థితిని స్వామి కల్గియుండెనని పురాణములు తెలుపుచున్నవి. అట్టి నృసింహమూర్తి వైకుంఠములో మహాలక్ష్మితోకూడి వెల్గునట్టి శ్రీమన్నారాయణుడే అనియు, ఆ నారాయణుడే ఇపుడు వేంకటేశ్వరుడై విలసిల్లుచున్నాడనియును ఈ నామములో తెలుపబడుచున్నది. శ్రీనివాసుడును, లక్ష్మినరసింహుడును ఒకే స్వామి



అయినను, మూర్తిభేదముచే (శ్రీరామాయణమున చెప్పబడిన) రామునకు, రంగనాథునకువలె, ఆరాధ్య - ఆరాధకభావము తగును. ఇట్లు పూర్వనామముతో ఈ నామమునకు సంగతి కలదు. **"సద్భక్తనీలకంఠార్చ్య"** అను రాబోవు నామమునందు నీలకంఠుడు నరసింహస్వామిని ఆరాధించినట్లు తెలుపబడుచున్నది. ఆ నరసింహుడును మహాలక్ష్మితో కలసియున్న లక్ష్మీనృసింహరూపియగు శ్రీమన్నారాయణుడే అనుటను ఈ తిరునామములోని పూర్వభాగము తెలుపుచున్నదనియు చెప్పవచ్చును.

**మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్ ।**
**స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే ॥**

అను పురాణవచనానుసారము శ్రీవైకుంఠమును వీడి, ఈ తిరుమలకు వచ్చి, సాక్షాన్నారాయణుడే మహాలక్ష్మితో విహరించున్నాడనుటచే, ఈ తిరుమలయే వైకుంఠములోని క్రీడాపర్వతమనియు, ఇచటనున్న స్వామిపుష్కరిణియే అచటగల ఐరమ్మదీయమనెడి సరస్సు అనియు మనము భావింపనగును. పురాణములును అట్లే తెలుపుచున్నవి. ఇపుడును శ్రీనివాసుని అర్చాతిరుమేనిలోనే **"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు"** అనుచు నమ్మాళ్వార్లు మంగళాసనము చేసిన రీతిలో మహాలక్ష్మి (వక్షఃస్థలమున) సేవను అనుగ్రహించుటచే ఈ స్వామి శ్రీమన్నారాయణడనుటలో ఏ సందేహమును లేదు.

(65) **ఓమ్ సద్భక్తనీలకంఠార్చ్యనృసింహాయ శ్రీవేంకటేశాయ నమః**

(భక్తశ్రేష్ఠుడగు నీలకంఠునిచే (శివునిచే) ఆరాధింప - తగిన నృసింహస్వామియగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను). పద్మపురాణకథను అనుసరించి కిన్నరదంపతుల చరిత్రకు పిమ్మట, నీలకంఠుడు లక్ష్మీనృసింహుని ఆరాధించిన వృత్తాంతము ఈ తిరునామములో ప్రమేయము.

శ్రీవేంకటేశుడు వేంచేసియుండు స్థానమునకు ముప్పది యోజనముల దూరములో నీలకంఠుని ఆశ్రమము మిక్కిలి రమణీయమ్మైన సన్నివేశముతో కూడినదియైయున్నది. అందు మిక్కిలి అందమైన ఒక పుష్కరిణి కలదు. అది ఉన్నతమైన పుణ్యతీర్థము. దాని తీరములోని ఒక శిలలో, ఒక పక్షిమూలమున నీలకంఠుడు నృసింహమూర్తిని ప్రతిష్ఠించి, లోకకల్యాణార్థము ఆరాధించుచుండెను. ఆ నీలకంఠుని ఆశ్రమముయొక్క వర్ణనయు, అచటగల పుణ్యపుష్కరిణియొక్క వర్ణనయును, అచట ప్రతిష్ఠ చేయబడిన లక్ష్మీనృసింహుని దివ్యమంగళవిగ్రహ వర్ణనయును, నీలకంఠుని ఆరాధనయొక్క వర్ణనయును పాద్మపురాణములోని 31-32 అధ్యాయములలో మిక్కిలి ఉన్నతమైన రీతిలో నున్నది.

**తస్యోపలవటస్యాధో నరకేసరిణః స్వయమ్ ।**
**సర్వలోకహితార్థాయ సర్వావాసాయ శార్ఙ్గిణః ॥**
**సపర్యాం సుకృతాం కర్తుం అగ్నిరేతా ప్రచక్రమే ।**

**........................................................**
**నరసింహాత్మకం బ్రహ్మ ప్రతిష్ఠాయేహ భూతలే ।**
**సన్నిధిం ప్రార్థ్య సర్వేషాం దృష్టాదృష్టఫలప్రదమ్ ॥**
**ఉపచారైః సమభ్యర్చ్య సంస్కారైః సంస్కృతో భవన్ ।**
**పరావరాణాం భూతానా మీశ్వరః పరమేశ్వరః ॥**

అను ఈ శ్లోకములచే పరమశివుడు లోకహితార్థము నృసింహుని ఆరాధించిన రీతిని తెలియవచ్చును. నృసింహభగవానుని సాన్నిధ్యముచే నీలకంఠుని ఆశ్రమము విశేషమహిమను పొందినది. అట్టి నీలకంఠునిచే ఆరాధింపబడిన లక్ష్మీనృసింహరూపియైన వేంకటేశుని శరణుపొందుచున్నాను - అని ఈ నామముయొక్క తాత్పర్యము.

(66) **ఓమ్ కుముదాక్షగణశ్రేష్ఠసైనాపత్యప్రదాయ శ్రీవేంకటేశాయ నమః**
(కుముదాక్షుడనెడి గణాధిపతికి సేనాధిపతిపదవిని ఇచ్చిన శ్రీవేంటేశుని శరణు పొందుచున్నాను)

పద్మపురాణములో నీలకంఠ చరిత్రకు పిమ్మట, అమరారి అని, దుర్మేధస్సు అనియు ప్రసిద్ధిచెందిన అసురుల సంహారము చెప్పబడియున్నది. ఆ అసురసంహారచరిత్రను అనుసరించి, ఈ తిరునామమును, దీనికి పిమ్మటగల 67వ తిరునామమును ఏర్పడియున్నవి.

అమరారి అనెడి ఒకానొక అసురుడు దేవతలను మిక్కిలి హింసించుచుండెను. దానిని భరింపలేని చతుర్ముఖుడు మొదలగు దేవతలు క్షీరసముద్రసమీపమును చేరి, పరమపురుషుడగు శ్రీమన్నారాయణుని స్తుతించిరి. అచట లక్ష్మీసఖి బయటకు వచ్చి, భగవానుడు సాధ్యమైనంత త్వరలోనే వేంకటాచలములో ఆవిర్భవింపగలడని, అచటకు చేరి, స్వామిని దర్శింపుమనియు, పల్కి అంతర్ధానమయ్యెను. అచటినుండి నారాయణాద్రి అను ఈ పర్వతమును చేరి, స్వామి పుష్కరిణీతీరమునగల భగవానుని స్తుతించిరి. అచట స్వామి విమానముతోపాటు ఆవిర్భవించి, బ్రహ్మ మొదలగువారి యోగక్షేమములను విచారించి, వచ్చిన కార్యమేమి? అని ప్రశ్నించెను. బ్రహ్మాదిదేవతలు అసురులవలన కల్గిన ఉపద్రవమును తెలిపి, తమను కాపాడవలసినదిగా వేడిరి. వెంటనే శ్రీనివాసుడు తన గణాధ్యక్షుడగు కుముదాక్షుడనెడి నిత్యసూరిని చూచి, అతనికి విష్వక్సేనుడనెడి తిరునామమును, సేనాధిపతిత్వమును అనుగ్రహించి, అసురసంహారమును చేసి, దేవతలను కాపాడుమని ఆజ్ఞాపించి, అంతర్ధానమయ్యెను. భగవానుడావిర్భవించిన దినము -

**మాసే భాద్రపదే విష్ణుతిథౌ విష్ణుసమన్వితే ।**
**సిద్ధయోగే సోమవారే గిరౌ నారాయణాహ్వయే ॥**
**స్వామిపుష్కరిణీతీరే పశ్చిమే భూత్యపశ్చిమే ।**



**బృందారకాణాం బృందై స్తు ప్రార్థితో లోకరక్షకః ॥**
**ఆవిర్బభూవ భగవాన్ శ్రీనివాసః పరః పుమాన్ ।** (పాద్మ - 33-132)

అని తెలిపినరీతిలో భాద్రపదమాసము శ్రవణానక్షత్రములో సిద్ధయోగముతోకూడిన సోమవారము అని తెలియుచున్నది

(67) **ఓమ్ దుర్మేధఃప్రాణహర్త్రే శ్రీవేంకటేశాయ నమః**
(దుర్మేధస్సు అనెడి అసురుని ప్రాణములను హరించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

**"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్"** అని తెల్పినరీతిలో, శ్రీనివాసమూర్తి సాధువులగు దేవతలను కాపాడుటకు, దుష్టుడగు దుర్మేధస్సును, పూర్వనామములో ప్రస్తావింపబడినట్లు కుముదాక్షునిద్వారా సంహరించెను. ఆ వృత్తాంతమే ఇచట ప్రస్తుతింపబడుచున్నది. ఆ అసురునకు అమరారి అను పేరు కలదని, అతడు మిక్కిలి క్రూరుడని, శివునిగూర్చి 'ఉగ్రమైన తపస్సు చేసి, దేవతలచే అవధ్యత్వమును, అజేయత్వమును వరములుగా పొందెననియు, అతనికి దుర్మేధస్సు (క్రూరబుద్ధిని కలవాడు) అను పేరు కలదని పద్మపురాణములోగల ఈ క్రింది శ్లోకములద్వారా తెలియుచున్నది.

**అమరారి రితి ఖ్యాతో దైతేయేంద్రో మహేంద్రజిత్ ।**
**శిపివిష్టం సముద్దిశ్య దుర్వినీతగణాధిపమ్ ॥**
**ఘోరాకారో ఘోరతరం చకారాతిచిరం తపః ।**
**తపసా తేన సంతుష్టః పినాకీ స చ తామసః ॥**
**అజయ్యత్వ మవధ్యత్వ మమరై రమరాధిపైః ।**
**అన్యై రతిబలై శ్చైవ తస్మై దుర్మేధసే దదౌ ॥**
**అమరారి ర్దివిషదా మన్యేషాం చ సతా మరిః ।**
**దుష్టాత్మా దుష్టచేతా స్సః త్రిషు లోకేషు చేష్టతే ॥**
(పాద్మ - 33-99నుండి102)

ఈ శ్లోకములు చతుర్ముఖుడు భగవానునితో పల్కినవి

(68) **ఓమ్ శ్రీధరాయ శ్రీ వేంకటేశాయ నమః**
(మహాలక్ష్మిని ధరించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందునామములో అమరారి అనెడి దుర్మేధస్సుయొక్క సంహారము చెప్పబడినది. ఆ అసురుని సంహరించి దేవతలను కాపాడుటకు శ్రీమహాలక్ష్మియొక్క సాన్నిధ్యమే కారణమనుట ఈ తిరునామములో తెలుపబడుచున్నది. లక్ష్మియొక్క సాన్నిధ్యము లేనిచో. భగవానుడు శీఘ్రముగా ప్రసన్నుడు అగుట, భక్తుల అభీష్టములను వెనువెంటనే పూర్తి చేయుటయును సంభవింపదు. దీనిని తెలిసిన చతుర్ముఖుడు మొదలగువారు లక్ష్మిని పురస్కరించుకొనియే భగవానుని క్షీరసాగరములో స్తుతించి,

తమ అభీష్టములను పొందిరి.

**తుష్టువుః తత్ర దైతేయవిధ్వంసనవిచక్షణమ్ ।**
**లక్ష్మ్యోపలక్షితం విష్ణుం విశ్వరక్షణదీక్షితమ్ ॥**

(క్షీరాబ్ధితీరమున చతుర్ముఖుడు మొదలగు దేవతలు అసురసంహారము చేయుటలో సమర్థుడు, మహాలక్ష్మితో కూడియున్నవాడు, కావున లోకరక్షణదీక్షను కలవాడును అగు పరమపురుషుని స్తుతించిరి) అనెడి ఈ శ్లోకము పద్మపురాణములో పూర్వము తెలుపబడిన అమరారి వధను వర్ణించు ప్రకరణములో కలదు. కావున, ఈ శ్లోకమును ఆధారముగా గొని ఈ తిరునామము ఏర్పడినదనియు చెప్పవచ్చును. మహాలక్ష్మి భగవానుని వక్షః స్థలములో ఎల్లప్పుడు నివసించుటలోని ఉద్దేశ్యమేమి? అనగా – లోకములోని ప్రతిఒక్కడును, ఒకమాటను మాటలాడుటకుగాని, లేక ఒక కార్యమును చేయుటకుగాని ముందు ఆ విషయమును మనస్సుతో చింతించును. అట్లే, పరమపురుషుకూడ దేనిని పల్కినను, చేసినను మనస్సుతో సంకల్పించిన తరువాతనే చేయవలెను. అట్లు స్వామి మనస్సుతో సంకల్పించు ప్రతిఒక్క విషయము జీవులకు హితముగానుండవలెను. వారికి అహితమై ఏదియు నుండకూడదు – అని తలచు కరుణారూపిణియైన మహాలక్ష్మి మిక్కిలి జాగ్రత్తగా మనస్సుకు సమీపమున హృదయప్రదేశమున (వక్షఃస్థలములో) సర్వదా నివసించును. ఈమె సాన్నిధ్యముచే భగవానుని మాట, చేష్టయు జీవులకు మిక్కిలి హితములుగానే పరిణమించును. ఇట్లు లక్ష్మీదేవి వక్షఃస్థలములోనే నివసించుట అనునది వేంకటాచలపతియగు శ్రీనివాసమూర్తియందు ప్రత్యక్షముగా గోచరించు విషయము. కావుననే శ్రీనివాసుడు (లక్ష్మికి నిలయమైనవాడు) అని ఈ మూర్తికి అసాధారణనామము ఏర్పడినది. ఇట్లు సర్వలోకహితముకొఱకు కరుణారూపిణియైన మహాలక్ష్మిని తన వక్షః స్థలములో సర్వదా ధరించుయుండు శ్రీవేంకటేశ్వరుని శరణు పొందుచుచున్నాను – అని ఈ తిరునామముయొక్క అర్థము.

(69) **ఓమ్ క్షత్రియాంతకరామాయ శ్రీవేంకటేశాయ నమః**

(క్షత్రియులకు యమునివంటివాడైన పరశురాముని స్వరూపమగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందు తిరునామములో మహాలక్ష్మియొక్క సాన్నిధ్యముచే భగవానుని లీలలు అన్నియును లోకహితములుగానే పరిణమించునని తెలుపబడినది. ఈ సందర్భమున కల్గు ఒకానొక ప్రశ్నకు సమాధానమును ఇచ్చు రీతిలో ప్రస్తుతనామము అమరియున్నది. భగవానుని లీలలు అన్నియు హితములుగానే యున్నచో, పరశురామావతారములో ఎవరిని రక్షింపకుండ ఇరువది ఒక్క పర్యాయములు లోకములోనున్న క్షత్రియులగు అందఱిని పరశువుతో వధించిన మహాఘోర కృత్యము స్వామికి ఎట్లు తగును? మిగిలిన అవతారములలో కొందఱు భక్తులను కాపాడుట కొఱకు వారి కోటిక మేరకు వారి



విరోధులను సంహరించెను. సరియే. ఈ అవతారములలో ఆవిధముగా కాకుండ, క్షత్రియ సంహారమేకదా ప్రధానముగానున్నది – అను సందేహము ఇచట కలుగును. దీనిని పోగొట్టుటకు అవతార రహస్యమును బోధించుటకు ఆ అవతారమునుగూర్చి ఈ తిరునామములో తెలుపబడినది. శ్రీనివాసుడు దయామూర్తి అనుటలో ఏవిధమైన సందేహమును లేదు. అట్టి అతడు పరశురామావతారములో ఆ విధముగా క్షత్రియ సంహారమును చేసెననగా, అందు ఒక రహస్యము ఉండియుండవలెను. ఆ రహస్యమును వేదాంతదేశికులు దయాశతకమను స్తోత్రములో ఈ క్రిందివిధముగా వెలిబుచ్చిరి.

**పరశ్వధతపోధనప్రధనసత్రతూపాకృత –**
**క్షితీశ్వరపశుక్షరత్ క్షతజకుంకుమస్థాసకైః ।**
**వృషాచలదయాళునా నను విహర్తు మాలిప్యథాః**
**నిధాయ హృదయే! దయే నిహితరక్షితానాం హితమ్ ॥**

(దయాశతకమ్ – 86)

ఆకాలములోనున్న రాజులు అందఱు అసురులేనట. వారు భగవానుని, భగవద్దాసులను మిక్కిలి ద్వేషించిరి. వారిని ఉపదేశముచే గాని, వేఱొక దారిలోగాని మంచి మార్గమునకు కొనివచ్చుట అసాధ్యమని గ్రహించిన భగవానుడు పరశురామావతారమును ఎత్తి, “వారిని వధించిననే వారు రక్షింపబడినవారు అగుదు. వారిని వధించుటయే ఇపుడు వారికి మిక్కిలి హితము. ఇపుడుకూడ వారిని వధింపక విడచివేసినచో, మరింతగా మహాపరాధములను చేసి, ఇంకను అధోగతిపాలగుదురు” అని తలచి, వారిని సంహరించెను. ఇదికూడ పరమదయాకార్యమే కదా! ఒక గొప్పవైద్యుడు ఒక రోగికి ఒక అంగములో ఏర్పడిన గడ్డలు మొదలగువానిని శస్త్రములతో తీసి, చికిత్స చేయనిచో, ఆ రోగికి మరింత ఆపద ఏర్పడునని తెలిసిన పిదప, ఆరోగిని కాపాడవలెనను హితబుద్ధితో, పరమదయతో వారి ఆ అంగమును శస్త్రముతో చికిత్స చేయునుకదా! అట్లే, ఇచటకూడ పరమపురుషుని కార్యము పరమదయాత్మకమే అగును – అనునది పైన ఉట్టంకించిన శ్లోకముయొక్క ముఖ్యతాత్పర్యము. కావున, క్షత్రియులకు మాత్రమేకాక, వారి పాపకార్యములకును అంతకుడై (సంహారకర్తయై) యుండి, వారిని కాపాడిన పరశురామరూపియైన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈ నామతాత్పర్యము. ఈ పరశురాముని లీల. వేంకటాచలమాహాత్మ్యములోని వామనపురాణములోని వాయుస్తోత్రములోగల దశావతారప్రకరణములో వర్ణింపబడియున్నది. ఆ శ్లోకములీ విధముగానున్నది.

**జామదగ్న్య! మహాబాహో! రక్షసాన్ రాజరూపిణః ।**
**హత్వా తద్రక్తకుండేషు కృత్వా పితృజలక్రియామ్ ॥**
**మహీం నిఃక్షత్రియాం కృత్వా యజ్ఞం కృత్వాఽశ్వమేధికమ్ ।**
**దక్షిణార్థం మహీం దత్వా కాశ్యపాయ జగత్ప్రభో ॥**

**గత్వా మహోదధిం తత్ర సముద్రేణ కృతాలయః ।**
**యే సహ్యాద్రౌ రమణీయ త్వం తప శ్చరసి భార్గవ ॥** (వామన - 24-37)

(70) **ఓమ్ మత్స్యరూపాయ శ్రీవేంకటేశాయ నమః**

(మత్స్యావతారము నెత్తి వేదములను ఉద్ధరించి, చతుర్ముఖుని రక్షించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

భగవానుని ద్వేషించు అసురుల విషయమున భగవానుడు చేయు హితము ముందు నామములో తెలుపబడినది. భగవానునకు మిక్కిలి అంతరంగులగు వారివిషయమున అతడు చేయు హితము ఈ నామమునందు, అనంతరనామమునందును బోధింపబడు చున్నది.

సోమకుడను అసురుడు వేదములను అపహరించుకొనిపోయి, పాతాళలోకమును ప్రవేశించెను. ఉత్తమప్రమాణమగు వేదములు అంతర్ధానము కాగా, ధర్మమునకు లోపము కల్గి, ప్రపంచమున ఏకార్యముకూడ సరిగా నడువకుండెను. అపుడు చతుర్ముఖునకుకూడ అజ్ఞానము కల్గి, కింకర్తవ్యతామూఢుడై, పరమపురుషుని కాపాడుమని ప్రార్థించెను. అపుడు భగవానుడు మత్స్యరూపమును దాల్చి, సముద్రములో ప్రవేశించి, ఆ అసురుని సంహరించి, వేదములను రక్షించి, తీసుకొని వచ్చి, చతుర్ముఖున కిచ్చెను. లోకమున ధర్మస్థాపనమును చేసెను. ఒకనిని పూర్ణముగా రక్షించుట అనగా అతనికి మంచి జ్ఞానమును కల్గించుటయే కదా! కావుననే మనమును ప్రతిదినము మూడు సంధ్యలయందు పరమపురుషుని మనకు మంచి జ్ఞానమును అనుగ్రహింపుమని గాయత్రీమంత్రముతో ప్రార్థించుచున్నాము. కావున, తనకంతరంగుడగు చతుర్ముఖుని కాపాడిన మీనరూపమును దాల్చిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని ఈ నామముయొక్క తాత్పర్యము. ఇదియేకాక, వేఱొక సమయమున మధుకైటభులను అసురులచేకూడ వేదములు అపహరింపబడినపుడును స్వామి మత్స్యరూపమును దాల్చినట్లును పురాణములు తెలుపుచున్నవి. వామనపురాణములో ఈ అవతారమును వర్ణించు ప్రకరణములో కానవచ్చును -

**మధుకైటభహంతా త్వం సంప్రాప్తే బ్రహ్మసంకటే ।**
**తతోఽసురం సోమకాఖ్యం కృత్వా వేదాం చ తత్కరాత్ ॥**
**గృహీత్వా బ్రహ్మణే ప్రాదా మీనరూపీ మహేశ్వర ।**

అను శ్లోకములు ఇచట అనుసంధేయములు.

(71) **ఓమ్ పాండవారిప్రహర్త్రే శ్రీవేంకటేశాయ నమః**

(పాండవుల శత్రువులను సంహరించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో ఉత్తమప్రమాణమైన వేదమును రక్షించి అనుగ్రహించిన అవతారమునుగూర్చి ప్రస్తావింపబడినది. ఆ వేదమువలననే **"గీతోపనిషత్"** అనుచు



ఉపనిషత్తు అనియే కీర్తింపబడు భగవద్గీత అనెడి వేదముయొక్క ఉపబృంహణరూపమైన ఒక గ్రంథమును అర్జునుని వ్యాజముగా చేసికొని, లోకమునకు అనుగ్రహించిన శ్రీకృష్ణావతారమునుగూర్చి ఈ నామములో పొగడబడుచున్నది.

**ద్విషదన్నం న భోక్తవ్యం ద్విషంతం నైవ భోజయేత్ ।**
**పాండవాన్ ద్విషసే రాజన్ మమ ప్రాణా హి పాండవాః ॥**

శ్రీకృష్ణుడు పాండవుల దూతగా వెడలినపుడు దుర్యోధనుడు మొదలగువారి గృహములను దాటి విదురుని ఇంటిలో విడిదిచేసి, అచట అతడు సమర్పించిన అన్నమును భుజించెను. అపుడు దుర్యోధనుడు, "భీష్ముడు, ద్రోణుడు, నేనును - అందఱము ఉండగా, మమ్ములను అందఱిని విడచి, జాతిచే హీనుడగు విదురుని ఇంటికిపోయి, అతడు పెట్టిన అన్నమును ఎందులకు తింటివి?" అని ప్రశ్నించినపుడు పైన పేర్కొనబడిన శ్లోకమును శ్రీకృష్ణుడు పల్కెనని భారతకథనము. "శత్రువుల అన్నమును భుజింపరాదు, శత్రువునకు అన్నము పెట్టరాదు. కావుననే నీ అన్నమును నేను భుజించుటయు, నీకు అన్నమును పెట్టుటయును తగదు" అని భగవానుడనగా, దుర్యోధనుడు అపుడు "నేను నీకేమి అపకృతిని చేసితిని? నేను నీకు ఎట్లు శత్రువునైతిని?" అని ప్రశ్నించెను. అపుడు స్వామి "పాండవులను నీవు ద్వేషించుచున్నావు. ఓరాజా! పాండవులు నాకు ప్రాణసమానులు. **"జ్ఞానీత్వాత్మైవ మే మతమ్"** అనికదా నేను భక్తుల విషయమున వర్తింతును" అన బదులిచ్చెను. కావున తనకు ప్రాణములుగా భావించిన పాండవులకు యుద్ధమున తాను సారథియై నిల్చి, సర్వవిధ సహాయమును చేసి, వారి పగతురను నశింపజేసెను. అట్టి శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని ఈ నామతాత్పర్యము.

ఈ విధముగానేకాక, వేఱొక విధముగాకూడ ఈ నామమునకు అర్థమును చెప్పవచ్చును. శ్రీనివాసభగవానుని మన సంప్రదాయమున శ్రీకృష్ణునిగానే భావించుట ప్రసిద్ధము. దానికి కారణము - భగవద్గీతలో చివరలోనున్న -

**సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥**

అనెడి చరమశ్లోకముయొక్క అర్థమగు "నన్ను శరణు పొందుము. నన్ను శరణు పొందిన వారికి సర్వపాపములును నశించిపోవును. కావున అతనికి సంసారసముద్రము మోకాలిలోతు మాత్రమే" అనెడి విషయమును తన రెండు చేతులలోని ముద్రలద్వారా వివరించుటయే. కావున, గీతోపదేష్ట అగు భగవానుడే శ్రీనివాసుని రూపమున వేంచేసియున్నాడు - అని భావము. ఈ విషయమును **"పాండవారిప్రహర్త్రే"** అను ఈ తిరునామము తెలుపుచున్నది. ఇచట పాండవశబ్దము పంచపాండవులలో ప్రధానుడగు, మధ్యమపాండవుడుడగా, **"పాండవానాం ధనంజయః"** అనెడి అర్జునుడు వివక్షితము. అతనికి అరి - శత్రువు అనగా - బాహ్య శత్రువువలెనున్న అంతర శత్రువే. అనగా -

"అస్థానస్నేహకారుణ్య" అనునట్లు అస్థానమున కల్గిన స్నేహకారుణ్యములచే ఏర్పడిన మోహమే. ఈ మోహముచే తనకు అవశ్యకర్తవ్యమైన స్వవర్ణధర్మయుద్ధమును చేయకూడదని అని తలచి, విరమించెను. ఈ మోహము తొలగుటకై అర్జునుని వ్యాజముగా చేసికొని, లోకములోనివారు అందఱును తెలియురీతిలో గీత అనెడి ఒక గొప్పశాస్త్రమును ఉపదేశించెను. అర్జునుడు మోహమును వీడి, **"కరిష్యే వచనం తవ"** అని పల్కి, భగవానుని ఆజ్ఞానుసారము యుద్ధము చేసి, సద్గతిని పొందెను. కావున, పాండవుడగు అర్జునుని అంతరంగశత్రువైన మోహమును పోగొట్టిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అనెడి ఈ విశేషార్థమును ఈ నామమునకు చెప్పుట ఈ ప్రకరణమునకు మిక్కిలి తగినది – అని తోచును. మత్స్యావతారమును పూర్వనామములో ప్రస్తావించి, కృష్ణావతారమును అనంతరనామములో ప్రస్తావించుటలోని ఆంతర్య మిదియే. వేదమును అనుగ్రహించిన అవతారము మత్స్యావతారము. వేదముయొక్క తాత్పర్యమును వివరింపవచ్చిన గీతను అనుగ్రహించిన అవతారము ఈ కృష్ణావతారము. ఈ కృష్ణావతారములో చేసిన గీతోపదేశమునే అర్చామాధికి తగినట్లు తన శ్రీహస్తముల మూలమున వ్యక్తీకరించుచు, ఈ తిరుమలలో వెల్గుచున్నాడు శ్రీవేంకటేశ్వరుడు.

### (72) ఓమ్ శ్రీకరాయ శ్రీవేంకటేశ్వరాయ నమః

(మంగళకరమైన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో పాండవుల శత్రువులను సంహరించుటయు, అర్జునునకు గీతోపదేశమును చేయుటయును – అను రెండు విషయములు తెలుపబడినవి. ఆ రెండు కార్యములును పరమశుభకరములగు కార్యములు అనునది ఈ తిరునామములో బోధింపబడుచున్నది. శ్రీ అనగా – మంగళము. ఇచట పాండవుల శత్రువులను నిరసించుట, ఆ శత్రువులకు, లోకములోనివారికి మంగళకరమైన కార్యమే అగును. **"క్షత్రియాంతకరామాయ"** అను 69వ తిరునామములో తెల్పినరీతిలో ఆ శత్రువులను సంహరించుటయే వారికి అపుడు హితమై, మంగళకరమై పర్యవసించుచున్నది. అందుచేతనే వేదాంతదేశికులు **"రిపుషు నిహతేవ హితతా"** అని సాయించిరి (నుడివిరి).

రెండవది అగు జ్ఞానప్రదానముకూడ పరమసంపత్కరమైన విషయము. **"ఋచ స్సామాని యజూంషి సా హి శ్రీ రమృతా సతామ్"** అనుచు వేదము తెలిపినట్లు, వేదములును, దాని అర్థములను తెలియుటయే ఉన్నతమైన సంపద. అట్టి సంపద భగవద్గీతచే ఏర్పడుటచే దానిని ఉపదేశించిన శ్రీవేంకటేశుని శ్రీకరుడని పల్కుటలో విప్రతిపత్తి ఏమియు లేదుకదా! కావున, ఇట్టి మంగళములను ఇచ్చు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈ నామముయొక్క తాత్పర్యము.

ఇదియే కాక, **"శ్రీకర"** అను పదమునకు వేఱొకవిధముగా రెండు అర్థములను చెప్పవచ్చును. అవి ఏవి? అనగా – **"శ్రియః కరః"** అని **"శ్రీః కరః యస్య సః"** అనియును



రెండు విధములైన వ్యుత్పత్తులద్వారా, శ్రీ అనెడి లక్ష్మీదేవికి హస్తముగానున్నవాడని, ఆ మహాలక్ష్మిని హస్తముగా కల్గియున్నాడని చెప్పు అర్థములే అవి. శ్రీమహాలక్ష్మి ఒక జీవుని రక్షింపదలచి, భగవానునివద్ద ఆ విషయములనుగూర్చి విన్నవించునపుడు, స్వామి ఆమెకు చేయివలె నుండి – అనగా – ఒకడు ఒక పనిని చేయదలచినచో దానిని అతని చేయి చేయుటకు ఎట్లు వ్యతిరేకింపదో – అట్లే – ఆ కార్యమును చేసి ముగించును. ఆ పరమపురుషుడు చేయగోరిన విషయమును పిరాట్టి అతనికి తాను హస్తమువలె నుండి నడపించును. ఆ రీతిలో వారి దాంపత్యము అన్ని విషయములందును ఏ కొంచెము కూడ అభిప్రాయభేదములేకుండ, లోకక్షేమమును దృష్టిలో నుంచుకొని, మిక్కిలి అందముగా నడపించును. ఒక రాజ్యమునకు ఇద్దఱు ప్రభువులున్నచో, వారి అభిప్రాయ భేదముచే రాజ్యములోనున్న ప్రజలకు పలువిధములైన ఇబ్బందులు కల్గునుకదా! అందుచే, ఈ ప్రపంచమునకు భగవానుడును, లక్ష్మీదేవియును అను ఇద్దరు అధిపతులు ఉండదగునా? అనెడి సందేహము పటాపంచలగుచున్నది. ఇద్దఱును ప్రభువులుగా నుండుట దోషము కాదు, వారిమధ్య అభిప్రాయ భేదము ఏర్పడుటయే ప్రజల సమస్యలకు కారణమగును. అందుచే, ఆ విధమైన అభిప్రాయభేదమునకు ఈ ఈశ్వరదంపతులుమధ్య ప్రసక్తియే లేదు కావున వీరిచే నిర్వహింపబడు రాజ్యములోనున్న ప్రజలకు ఏ కష్టమును ఏర్పడుటకు అవకాశము లేదు – అనెడి ఈ శాస్త్రార్థమును ఈ తిరునామము వ్యక్తము చేయుచున్నదనియును వ్యాఖ్యానింప వచ్చును అని ఒక వ్యాఖ్యానము. ఇచట లక్ష్మీదేవికి తెలుపబడిన ప్రభువునకు కల అనురాగాతిశయమునకు సూచకము. కావున ద్వైరాజ్యదోషము లేదని చెప్పుటయే సరసతరము. లేనిచో శాస్త్రవిరోధము, లోకన్యాయ విరోధము కలుగును.

### (73) ఓమ్ ఉపత్యకాప్రదేశస్థశంకరధ్యాతమూర్తయే శ్రీవేంకటేశాయ నమః

(వేంకటాచలము చరియలో నివసించు శంకరునిచే ధ్యానింపబడిన మూర్తినికల శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

72వ తిరునామమగు పూర్వనామము మధ్యలో ప్రసంగవశాత్తు వచ్చినది. దానికి ముందున్న **"పాండవారిప్రహర్తా"** అనెడి తిరునామములో పాండవులకు సహాయపడుటయును, అర్జునునకు జ్ఞానోపదేశమును చేసి, సద్గతిని పొందించిన గొప్పతనమును తెలుపబడినది. ఇచట, పాండవులవంటి మానవభక్తులకు మాత్రమేకాక, ముమ్మూర్తులు (త్రిమూర్తులు) అని పిలువబడు బ్రహ్మరుద్రవిష్ణువులలో విష్ణువు తప్ప, మిగిలిన ఇరువురు దేవతలకు పలు ఇబ్బందులు కల్గినపుడు వానిని పోగొట్టుట, వారికి కోఱిన ఫలములను అనుగ్రహించుటయు, వారిని సద్గతిని పొందించుటవంటి కార్యములను చేయునట్టి విష్ణురూపియైన వేంకటేశ్వరుని దేవతా సార్వభౌముడని తెలిపిన విషయము శంకరుని చరిత్రనుబట్టి నిరూపింపబడుచున్నది.

వరాహపురాణములో 13వ అధ్యాయము మొదలు 49వ అధ్యాయము వరకుగల 37 అధ్యాయములలోని కథ ఇచట అనుసంధేయము. రావణునిచే, అతనికి చెందినవారిచే హింసింపబడిన మహర్షులు మహావిష్ణువును శరణు పొందుటకు క్షీరాబ్ధి మొదలగు చోట్ల వెదకినను స్వామి కానరాకపోవుటచే, బ్రహ్మలోకమునకు వెడలి, బ్రహ్మదేవుని మూలమున, నారదుని మూలమును, భూలోకములో వేంకటాచలమున భగవానుడు నివసించుచున్నట్లు తెలిసికొని, అచటకు వచ్చిరి. అదే సమయములో దశరథచక్రవర్తియు పుత్రసంతానార్థము వశిష్ఠుని ఉపదేశానుసారము ఈ వేంకటాచలమునకు వచ్చి, స్వామిపుష్కరిణీతీరమున తపస్సు చేయుచుండెను. చతుర్ముఖుడు, దేవతలు, అగస్త్యుడు మొదలగు మహర్షులును భగవానుని సాక్షాత్కరించుకొనుటకు అచటనే తపస్సు చేయుచుండిరి. ఒకనాడు అకస్మాత్తుగా అచట ఒక పెద్ద విమానము ఆవిర్భవించినది. దానిలోనికి అందఱును వెడలిరి. అపుడు అచట సాక్షాత్తు భగవానుడు ప్రత్యక్షమయ్యెను. ఆ శ్రీనివాస భగవానుని కన్నులార దర్శించి అందఱును స్తోత్రమును చేయసాగిరి. ఆ సమయములో భగవానుడు ఆవిర్భవించిన సంగతిని తెలిపిన రుద్రాదిదిక్పాలకులు మొదలగువారు భగవానుని సేవించుటకు అచటికి వచ్చి చేరిరి. అపుడు భగవానుడు అందఱి క్షేమమును విచారించి, ఇచటకు వచ్చిన కారణమేమి? అని అడుగగా, బ్రహ్మ, అగస్త్యుడు మొదలగువారు రావణుని ఉపద్రవము సహింపసాధ్యము కాకున్నది అని, అతనిని సంహరించి నీ దాసులమగు మమ్ములను రక్షింపవలెననియు వేడిరి. "అట్లే కాగలదు" అని భగవానుడు వారికి అభయము నిచ్చెను. పిమ్మట దశరథుని, రుద్రుని, బ్రహ్మను ప్రత్యేకముగా మీకు ఇష్టమైన వరమును కోరుకొనుడు – అని పల్కెను. అపుడు దశరథుడు తనకు పుత్రసంతానమును వరముగా అనుగ్రహింపవలెనని ప్రార్థించెను. ఈ సమయములో భగవానుడు ఆవిర్భవింపగానే నాల్గు శ్లోకములతో దశరథుడు స్వామిని స్తోత్రము చేయుటచే "నాతో సమానమైన పరాక్రమమును కల నల్గురు పుత్రులు నీకు కల్గుదురు. నీవు అయోధ్యకు చేరి, యాగమును అనుష్ఠింపుము" అని వరమిచ్చెను. పిమ్మట శంకరుని చూచి, నీ కోరిక ఏమి? అని ప్రశ్నింపగా, అతడును – "ప్రభూ! నీవున్నచోటెల్ల నేనుకూడ వాసమును చేయునట్లు వరమును అనుగ్రహింపుము" అని వేడెను. అపుడు భగవానుడు ఈ వేంకటాచలములో ఈ కల్పాంతమువరకు నేను నివసింపగలను. కావున నీవును ఈ కొండకు ఆగ్నేయదిశలో గల కొండచరియలో నివసింపుము" అని వర మనుగ్రహించెను. ఈ వృత్తాంతమును ఈ క్రింద ఉట్టంకింపబడిన శ్లోకములవలన తెలియనగును.

**కి మాగమనకార్యం తే వద శంకర సత్వరమ్ ।**
**ఇతి పృష్టః శివః ప్రాహ స్వామి న్నిత్యచ్యుతం వచః ॥**
**స్వామింస్త్వయా సదా యత్ర స్థీయతే వేంకటేశ్వర ।**
**తత్రైవ దేవ స్థాతవ్యం మయా వృషగిరీశ్వర ॥**



**ఇతి పృష్టః పునః ప్రాహ నీలమేఘసమద్యుతిః ।**
**ఆకల్పం చ వసామీహ వేంకటాహ్వయభూధరే ।**
**త్వ మప్యత్ర మృడానీశ మహాదేవ! వస ప్రభో ।**
**ఉపత్యకాయా మస్యాద్రేః శోచిష్కేశ దిగీశ్వర ।**
**ఇత్యాదిశ్య.............** (వరాహ – 49 అధ్యా)

పిమ్మట భగవానుడు చతుర్ముఖుని కూడ – "నీకు అభీష్టమైన వరమేది?" అని ప్రశ్నింపగా, అతడును స్వామి ఈ పర్వతముపై అందఱును దర్శించునట్లు స్థిరమైన రూపముతో వేంచేసియుండి, అందఱిని అనుగ్రహింపవలయునని ప్రార్థించెను. అతనికికూడ ఆ వరమును ఇచ్చెను. ఈ కథయే ఆ పురాణమున కలదు. ఈ కథలో తెలిపిన రీతిలో భగవదాజ్ఞ చొప్పున శంకరుడు భగవత్సన్నిధికి ఆగ్నేయదిశలోని కొండచఱియలో నివసించుచు, ఈనాటికిని శ్రీనివాసుని ధ్యానము చేయుచున్నాడు. అతడే కపిలేశ్వరుడు. ఈ మూర్తికి ఆలయము ఈనాడును కలదు. ఇట్లు త్రిమూర్తులలో ఒకడగు కపిలేశ్వరుడను శంకరునిచే (కొండచఱియలో నివసించుచు) ధ్యానింపబడు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈనామముయొక్క తాత్పర్యము.

(74) **ఓమ్ రుక్మాబ్జసరసీకూలలక్ష్మీకృతతపస్వినే శ్రీవేంకటేశాయ నమః**

(బంగారుమయమైన తామరపుష్పములనుకల పద్మసరస్సుయొక్క తీరములో మహాలక్ష్మి కొఱకు తపస్సు చేసిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను.

పూర్వతిరునామములో భగవానుని ఉద్దేశించి, శంకరుడు ఉపాసనమును చేసిన విషయము ప్రస్తావింపబడినది. ఈ తిరునామములో భగవానుడు మహాలక్ష్మిని ఉద్దేశించి, తపస్సు చేసిన విషయము చెప్పబడుచున్నది. సర్వలోకములకును ఉపాస్యుడగు భగవానుడు లక్ష్మీదేవినిగూర్చి ఒకానొక సమయమున ఉపాసనను చేసెను. ఈ విషయము పద్మ పురాణమున 34వ అధ్యాయములో తెలుపుబడినది. అచటి కథ ఈ తిరునామమున అనుసంధేయము.

పూర్వము ఒకానొకసమయమున సర్వోత్తముడైన దేవత ఎవరు? అను విషయమును నిష్కర్షింపవలెనని తలచిన మహర్షులు భృగువును ఆ పనికై నియోగించిరి. ఆ మహర్షి ఆ ప్రయత్నమున క్షీరాబ్ధిలోని విష్ణువు వద్దకుపోయి, తనను గమనింపలేదను కోపముతో విష్ణువు వక్షఃస్థలమును తన పాదముతో తన్నెను. అపుడు వక్షఃస్థలనివాసిని అగు లక్ష్మీదేవికి మిక్కిలి కోపము కల్గి, పాలకడలిని వీడి, పాతాళమును చేరెను. అచట ఆమె కపిలమునిచే ఆరాధింపబడెను. మహావిష్ణువును మరల లక్ష్మీదేవిని పొందగోరి పలుచోట్ల, అన్వేషించునపుడు కరవీరపురము (కల్హారపురము) అనెడి కొల్హాపురములో అర్చామూర్తిలో అగస్త్యమహర్షిచే ఆరాధింపబడుచున్న లక్ష్మీవిగ్రహమును అర్చించుచు అచటనే ఉండెను. పిమ్మట అశరీరవాక్కు నియమనప్రకారము సువర్ణముఖీ నదీతీరమున

ఒక సరస్సును నిర్మించి, అందు దేవలోకములోనున్న స్వర్ణతామర పుష్పములను కొనివచ్చి పెంచి, ఆ స్వర్ణతామరపుష్పములతో ప్రతిదినము మహాలక్ష్మిని అర్చించి, మహాలక్ష్మి మంత్రమును జపము చేయుచు పండ్రెండుసంవత్సరములు కాలము తపస్సు చేసెను. పిమ్మట ఒకానొక కార్తిక మాసము శుక్లపక్ష పంచమీతిథి యందు ఉత్తరాషాఢా నక్షత్రముతో కూడిన శుక్రవారమునాడు ఆకొలనులో ఒక తామరపూవునుండి మహాలక్ష్మి ఆవిర్భవించెను. పిమ్మట ఆమె భగవానుని వద్దకు వచ్చి, చేరెను. ఇట్లు పండ్రెండు సంవత్సరముల కాలము మహాలక్ష్మిని పొందుటకు స్వర్ణపద్మములనుకల (పద్మసరస్సు అని ఈనాటికిని తిరుచానూరులో పిలవబడు) సరస్సు తీరమున తపస్సు చేసిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని ఈ నామముయొక్క భావము.

ఆ సమయములో సాక్షాత్తు భగవానునిచే (శ్రీనివాసునిచే) తవ్వబడిన కొలను ఈనాటివరకు విశేషమైన మహిమను కల్గి, తిరుచానూరులో ప్రకాశించుచున్నది. ఆ సరస్సు ఒడ్డున సూర్యభగవానునికూడ పద్మముల వికాసముకొఱకు స్వామి ప్రతిష్ఠ చేసెనట. ఆ సూర్యనారాయణస్వామి కోవెలకూడ ఈనాటికిని కలదు.

(75) **ఓమ్ లసలక్ష్మీకరాంభోజదత్తకల్హారకస్రజే శ్రీవేంకటేశాయ నమః**
(ప్రకాశించు మహాలక్ష్మియొక్క తామరపుష్పమువంటి శ్రీహస్తములో సమర్పింపబడిన కల్హారపుష్పమాలను కల శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందునామముతో, ఈనామమును ఒకటిగా అనుసంధింపతగినది. అందు భగవానుడు లక్ష్మీదేవికొఱకు తపస్సుచేసిన వృత్తాంతము ప్రస్తుతింపబడినది. ఇందు ఆ తపస్సునకు కరుణించి, ఆవిర్భవించిన మమహాలక్ష్మి శ్రీనివాసునకు మాలను సమర్పించిన వృత్తాంతము స్మరింపబడుచున్నది. ఈ కథకూడ అదే అధ్యాయములో వర్ణింపబడియుండుట గమనింపతగినది.

పూర్వము తెల్పినరీతిలో మహాలక్ష్మి పద్మసరస్సులో ఆవిర్భవించినపుడు ఈ విషయమును తెలిసిన చతుర్ముఖుడు, రుద్రుడు, ఇంద్రుడును తమ తమ పత్నులతో, పరివారజనముతో ఆ సరస్తీరమునకు దివ్యదంపతులను సేవింపవలెనని వచ్చి చేరిరి. ఆ విధముగానే, సకలదేవతలను, అసురులును, మహర్షులును, అందఱు అచటికి వచ్చి చేరిరి. అందఱును ఆ దృశ్యమును సేవించుచుండగా, మహాలక్ష్మి తామరపూవునుండి పైకి లేచి వచ్చి, తాను ధరించియున్న కల్హారమాలను తన కంఠసీమనుండి తీసి తన చేతులతో భగవానుని వక్షఃస్థలమున సమర్పించి, ఆ భగవానుని ఆలింగనము చేసికొని, అతని వక్షఃస్థమును చేరి, సకలదేవతలను, మహర్షులను కటాక్షించి, అనుగ్రహించెను. పిమ్మట భగవానుడు ఆ కొలనుకు మూడులోకములందు విశేషముగా పొగడబడునట్టి వరమును ప్రసాదించి, మహాలక్ష్మితో కలసి వేంకటాచలమును చేరి, అచట విహరించెను - అను ఈ కథ ఇచట అనుసంధింపతగినది. అచటగల శ్లోకములు ఇట్లున్నవి.



**ఉత్థాయ సస్మితా లక్ష్మీః ఆగత్య హరి మంజసా ।**
**కల్హారమాలా ముస్ముచ్య విష్ణోః కంఠే సమర్ప్యచ ॥**
**ఆలింగ్య తం చతుర్బాహుం సర్వలోకాన్ వ్యలోకయత్ ।**
**....................**
**పాద్మం సర స్స మిత్యాఖ్యాథ వరం తస్మై దదౌ హరిః ।**
**..................**
**ఇత్యుక్త్వా గరుడేశాన మధిరుహ్యా రమాసఖః ।**
**భోగిరాజగిరిం నత్వా స్వామిపుష్కరిణీతటే ॥**
**రమతే రమయైకాంతే రమణీయే శ్రియఃపతిః ।**

(76) **ఓమ్ సాలగ్రామనివాసాయ శ్రీవేంకటేశాయ నమః**
(సాలగ్రామమున నివసించు - లేక - సాలగ్రామమునకు వాసస్థానమైయున్న శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వము తిరునామములో మహాలక్ష్మిచే కంఠమునందు సమర్పింపబడిన కల్హారమాలతో శ్రీనివాసుడు ప్రకాశించిన విధము తెలుపబడినది. ఇందు ఆ కల్హారమాలతో వెల్గు సాలగ్రామమాల సమర్పింపబడుచున్నది. **"సాలగ్రామనివాసః"** అనుటకు సాలగ్రామ శిలలో నిత్యవాసమును చేయువాడనియు, సాలగ్రామము అనెడి స్వయంవ్యక్తదివ్య క్షేత్రములో నిత్యసాన్నిధ్యమును కలవాడనియును, సాలగ్రామములకు నిలయమైనవాడనియు - ఇట్లు పలు రీతులలో అర్థమును చెప్పవచ్చునని పెద్దలు నుడువుదురు. ప్రస్తుతమున పొసగు అర్థము చివరలో పేర్కొన్న అర్థమే. ఈ అర్థమునకే ఒక విధముగా సంగతిని చెప్పవీలున్నది. పూర్వ తిరునామముతో సంగతిని లెక్కింపని పక్షమున పైన పేర్కొనబడిన అర్థములను అన్నిటిని గ్రహింపవచ్చును. శిల, లోహము మొదలగు వానితో నిర్మించిన విగ్రహములలోవలె శాస్త్రోక్తమైన ప్రతిష్ఠ మొదలగు ప్రయత్నములేమియు లేకుండగనే ఎల్లప్పుడు సాలగ్రామశిలలో భగవానుడు సాన్నిధ్యమును కల్గియుండును-అని శాస్త్రములు తెలుపుచున్నది. ఆవిషయమును పురస్కరించుకొని ఈ నామము ఏర్పడినదని కొందఱు అందురు. సాలగ్రామము అనెడి గండకీనది తీరములో సాన్నిధ్యమును కల్గియుండువాడు అనియు మఱికొందఱు అర్థమును చెప్పదురు. సాలగ్రామశిలలతో కూర్పబడిన మాలను అలంకరించుకొనుటచే సాలగ్రామములకు నివాసమైనవాడు - అనియు ఇంకొందఱు వ్యాఖ్యానించిరి.

ఇదికాక, **'సాలః'** అనగా సామాన్యముగా వృక్షమునకు వాచకము. గ్రామమనగా సమూహమని అర్థము. అందుచే సాలగ్రామమనగా వృక్షముల సమూహమను అర్థము సిద్ధించును. అందు నివసించువాడు అని **"సాలగ్రామనివాసః"** అను పదమునకు అర్థమును చెప్పవచ్చును. శుకమహర్షి పద్మసరస్సు తీరములోగల అనేకవృక్షములచే ఏర్పడిన

ఉద్యానవనములో తపస్సు చేసి, భగవానుని సాక్షాత్కరించుకొనెను. అందుచే వృక్షముల సమూహముల నడుమ నివసించు శ్రీనివాసుని శరణుపొందుచున్నాను – అని కూడ ఇచట అర్థమును చెప్పవచ్చును.

ఇచట ఒక అంశము విమర్శనీయము. పద్మపురాణములోగల కథను అనుసరించి దీనికి ముందుగల నామము ఏర్పడియున్నదని వ్యాఖ్యానింపబడినది. దీనికి తరువాత గల **"శుకదృగ్గోచరాయ"** అనెడి నామముకూడ మహాలక్ష్మి మాలను సమర్పించిన కథను తెలుపు పద్మపురాణములో గల 40వ అధ్యాయమునకు పిమ్మటగల 41వ అధ్యాయమందలి కథను అనుసరించి వచ్చినదని చెప్పుట ఉచితము. ఆ 41వ అధ్యాయములో శుకమహర్షియొక్క చరిత్రము సంగ్రహముగా తెలుపబడినది. ఆ చరిత్రము విశదముగా అదే పద్మపురాణములో మొదట 24వ అధ్యాయములో వర్ణింపబడియున్నది. అచట శుకుడు తన పేరుతో (తిరుచ్చుకనూరు అను) ఒక అగ్రహారమును పద్మసరస్తీరమున నిర్మించి, అచట నూట ఎనిమిదిమంది బ్రాహ్మణులను సృష్టించి, శ్రీకృష్ణభగవానుని ప్రతిష్ఠచేసి, భగవానుని అచట నిత్యవాసము చేయుమని ప్రార్థించి, వేంకటాచలమునకు వేంచేసి, అచట స్వామిని నేరులో దర్శించి, అతని అనుగ్రహముతో ముక్తిని పొందెననెడి కథ విస్తృతముగా వర్ణింపబడినది. కావున **"సాలగ్రామనివాసాయ"** అనుటకు సంగతి చెప్పుట కష్టమైయుండుటచే, పూర్వము తెల్పిన అర్థములకు పరస్పరము పొందికలేకుండుటచే **'సాలగ్రామ'** అను పదముయొక్క స్థానమున **'శుకగ్రామ'** అనునట్లు శుకునిచే నిర్మింపబడి, అతని పేరున కల్గిన గ్రామమును నిర్దేశించు పదమైయుండి, **"శుకగ్రామనివాసాయ"** అనునట్టి తిరునామమైయుండవచ్చునా! అని సందేహము తోచుచున్నది. ఇట్లయినచో, పద్మపురాణములో గల లక్ష్మీదేవి మాలను సమర్పించిన వృత్తాంతము ముగిసిన పిమ్మట అనంతరముగల శుకచరిత్రము ఇచట చెప్పబడుచున్నదను సంగతికూడ చక్కగా పొసగుచున్నది. ఆ శుకుని వృత్తాంతమే పై తిరునామములోకూడ తెలుపబడి, పద్మపురాణములోని కథయే ఈ సందర్భమున పూర్తిగా వర్ణింపబడుటచే పూర్వోత్తరసంగతికూడ బాగుగా అమరియున్నది. ఇది అంతయు ఊహయే తప్ప, ఇదియే తత్త్వార్థమని చెప్పుట సాహసమే అగును. చిరకాలముగా అనుసంధింపబడు **"సాలగ్రామనివాసాయ"** అను పాఠము సాహసించి మార్చుట తగనిపని. ఇచట మనస్సులో తోచిన విషయముమాత్రము విన్నవింపబడినది. ఈ నామావళిలోనే ఇంకను పలుచోట్లకూడ సంగతి ఈవిధముగానే కొంచెము కష్టపడి వివరింపవలసియున్నది. ప్రాచీనలిఖితప్రతులలో వేఱొకపాఠము లభించుచున్నదా! లేక, వేఱొకవిధముగా ఉన్న పాఠమును అనుసరించి సంగతిని చెప్పవీలగునా! అను అంశములను పెద్దలు విమర్శించి నిర్ణయింతురు గాక!

(77) **ఓమ్ శుకదృగ్గోచరాయ శ్రీవేంకటేశాయ నమః**

(శుకమహర్షియొక్క నేత్రములకు కన్పించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)



ముందునామము ప్రసంగవశమున వచ్చినది. మహాలక్ష్మి శ్రీనివాసునకు మాలను సమర్పించిన కథకు పిమ్మట, శుకుని కథయే పద్మపురాణములో చెప్పబడుటవలన ఆచరిత్ర ఈ తిరునామములో తెలుపబడుచున్నది. పద్మపురాణము ఆరంభమునందుకూడ ఈ చరిత్ర విస్తృతముగా వర్ణింపబడియున్నది.

వ్యాసభగవానుని కుమారుడగు శుకుడు పరమశివుని వద్దనుండి బ్రహ్మజ్ఞానమును సంపాదించి, సిద్ధిని పొంది, లోకమునంతటిని బ్రహ్మరూపముగానే దర్శించి, ఆనందించెను. అతడు ఒకానొక సమయమున సూర్యమండలమును ఉద్దేశించి ఆకాశములో పయనించునపుడు వ్యాసుడు అతనిని పిలిచెను. అపుడు సూర్యభగవానుడు తన మండలమును ఉద్దేశించివచ్చు శుకుని చూచి, "ఓ శుకమహర్షీ! పుత్రసంతతిలేని వానికి సద్గతి లేదు కావున, నీవు తలక్రిందులుగా భూలోకమును చేరి పితృదేవతల ఋణమును (పుత్రసంతతిని పొందుట ద్వారా) తీర్చి రమ్ము" అని పల్కెను. దీనిని వినిన శుకుడు తలక్రిందులుగానున్న తన నీడను తనవలె ఒక రూపమును కల్గినదానినిగా చేసి, ఆఛాయను చూచి, "నీవు భూలోకమునకు పోయి, నా తండ్రి అగు వ్యాసునకు పుత్రుడవైయుండి, నీవును పుత్రసంతాన ప్రాప్తిని పొంది, పిమ్మట బ్రహ్మలోకమును చేరుము" అని నియమించి, సూర్యమండలగతిద్వారా సద్గతిని పొందెను. ఛాయాశుకుడు భూలోకమునకు వచ్చి, వ్యాసునకు నమస్కరించి, అతనికి పుత్రుడుగా నుండి, శ్రీభాగవతపురాణమును పొంది, బ్రహ్మలోకమును చేరెను. అతడు ఒకానొక సమయమున వేంకటాచలమహిమను విని అచటికి వచ్చి, తిరుచానూరులోని పద్మసరస్సు తీరములో గొప్పతపస్సు చేసి, అచట తనపేరుతో ఒక గ్రామమును నిర్మించి, ఆ కొలనులోనున్న తామరపుష్పముల రేకులతో నూటఎనిమిదిమంది బ్రాహ్మణులను, భరద్వాజాది షడ్గోత్రములందు సృష్టించి, వారికి బ్రహ్మవిద్యను ఉపదేశించి, భాద్రపదమాసమున తిరుమలలో స్వామికి నడచు బ్రహ్మోత్సవ సమయములో ఆ బ్రాహ్మణులతో కలిసి, వేంకటాద్రిని చేరి, ఉత్సవమున వాహనములతోపాటు భగవానుని వేంచేపుచేయు సేవను వారిని పురస్కరించుకొని నడపెను. చివరలో చక్రతీర్థ సమయమున భగవానుని నేరుగా దర్శించి "నా పేరుతో నిర్మించిన గ్రామములో పండు ధాన్యమును ఈ బ్రాహ్మణులు తమ జీవనమునకు ఉపయోగించుకొని, నీకు ఉత్సవసమయములో, తిరువీథులలో వేంచేపుచేయు కైంకర్యమును చేయునట్లు అనుగ్రహింపుము" అని విన్నవించెను. పిమ్మట బ్రహ్మలోకమునకు పోవలయునను అభిలాషచే శ్రీశుకపురిలో వేంచేసియుండు బలరాముని, శ్రీకృష్ణుని, సూర్యనారాయణుని, పద్మసరస్సును నమస్కరించి, ప్రదక్షిణము చేసి, తన పుత్రులగు బ్రాహ్మణులను అచట నివసించునట్లు నియమించి, బ్రహ్మలోకమును చేరెను. ఇది పద్మపురాణమున చివరలో గల అధ్యాయములో తెలుపబడిన ఛాయాశుకవృత్తాంతము.

నిజమైన శుకమహర్షియొక్క చరిత్ర పద్మపురాణప్రారంభములో కలదు. దాని సంగ్రహము పూర్వనామములో తెలుపబడినది. ఇట్టి శుకమహర్షి చేసిన తపస్సునకు అనుగ్రహించి, అతనికి నేరుగా సేవను అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈ నామతాత్పర్యము. అచటగల శ్లోకములు.

**వైష్ణవీభిః సేవ్యమానః దేవః పద్మసరస్తటే ।**
**శ్రీభూమినీళాసహితః ప్రాదురాసీ త్పరఃపుమాన్ ॥**
**కదాచి ద్భగవాన్ విష్ణుః కారుణ్యాగణ్యపుణ్యధీః ।**
**దర్శయన్ సకలాన్ లోకన్ సాక్షా దక్షిపథంగతః ॥**

(78) **ఓమ్ నారాయణార్థితాశేషజనదృగ్విషయాయ శ్రీవేంకటేశాయ నమః**
(నారాయణుడనెడి బ్రాహ్మణునిచే ప్రార్థింపబడినవాడై, జనులందఱి కన్నులకు కన్పించు రీతిలో సేవను అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో, భగవానుడు శుకమహర్షి కన్నులకు కన్పించిన తీరు తెలుపబడినది. ఈ తిరునామములో శుకునివంటి ఒక భక్తుని ప్రార్థనను అంగీకరించి, అందఱి కన్నులకును దర్శనమిచ్చునట్లు భగవానుడు సేవను అనుగ్రహించిన విధము వర్ణింపబడుచున్నది. ఈ తిరునామమునుండి కొన్ని నామములు క్రమముగా బ్రహ్మాండ పురాణములోని కథను అనుసరించి ఏర్పడినవి.

**"నారాయణనగేశాయ"** అను 48వ తిరునామముయొక్క వ్యాఖ్యానములో ప్రస్తావించిన నారాయణుడనెడి బ్రాహ్మణుని చరిత్రను 78వది అగు ఈ తిరునామము యొక్క వ్యాఖ్యానమున తెలుపబడునని చెప్పబడినది కదా! ఆ చరిత్రసంగ్రహము ఈ క్రింది విధముగానున్నది.

నారాయణుడను పేరుగల ఒకానొక బ్రాహ్మణుడు భగవానుని సాక్షాత్తుగా సేవింపవలెనను ఆశతో భూలోకమునందు అంతట తిరిగినను భగవానుని దర్శింపలేక పోయెను. అపుడతడు బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి, అతని ఉపదేశానుసారము వేంకటాచలములోని స్వామిపుష్కరిణితీరమున చిరకాలము ఉగ్రమైన తపస్సును చేసెను. అతడు తపస్సుచేసిన కాలమున ఆ తపస్సుయొక్క మహిమచే ఆ పర్వతముపై అన్ని విధముల ఫలములు కాలనియతి లేకుండ ఎల్లప్పుడు లభించినవి. అధికశక్తినికల మృగములు అల్పమృగములను వధింపకుండ స్నేహముతోనున్నవి. ఇట్టి నారాయణుని తపస్సుచే సంతోషించిన భగవానుడు ఒకనాడతని ముందు ప్రత్యక్షమయ్యెను ఆ బ్రాహ్మణుడును సర్వాలంకారములతో, లక్ష్మీదేవితోకూడిన మోహనాకారుడగు భగవానుని కన్నులార దర్శించి, ఆనందించి స్తుతించెను. భగవానుడతనిని చూచి "నీకు ఇష్టమైనది కోరుకొనుము" అని ఆజ్ఞాపింపగా, అతడును, "ఓ ప్రభూ! నాకు ప్రత్యేకమైన రీతిలో



అవసరమైనది ఏదియును లేదు. నావలెనే అందఱును ఇంత కఠినమైన తపస్సు చేయగల్గుట సాధ్యము కాని పని. అందుచే పరమదయతో నీచే నాకు ఇపుడు సేవను అనుగ్రహించు రీతిలో ఎల్లప్పుడు ఈ విధముగానే జనులందఱికిని కన్పించునట్లు (అర్చారూపముల) వేంచేసియుండి, అందఱి కోరికలను పూర్తిచేయవలెను. నాకు ఈనాడు సేవను అనుగ్రహించినందులకు గుర్తుగా ఈ కొండను ఈనాటినుండి నా పేరుతో నారాయణాద్రి అని వ్యవహరించవలెను ఇదియే నా వేడికోలు" అని ప్రార్థించెను. భగవానుడు అతని ప్రార్థనను ఆ విధముగానే అంగీకరించెను. అప్పటినుండి శ్రీనివాసుని రూపములో సేవను అనుగ్రహించుచున్నాడు. ఆనాటినుండి ఈనాటివరకు అతడు తపస్సుచేసిన కొండ (భగవత్సన్నిధికి పడమటిదిశలో నున్నది) నారాయణాద్రి అనియే పిలువబడుచున్నది. దీని జ్ఞాపకార్థముగా, అతనికి భగవానుడు ప్రత్యక్షమైన దినమగు శ్రావణమాసము శుక్లద్వాదశినాడు అర్చకులు, ఆచార్యపురుషులును అందఱు ఆ నారాయణాద్రికి వెడలి, అచటగల స్వామి పాదములకు అభిషేకనివేదనాదులను సమర్పించి వచ్చుచున్నారు. ఇది ఈనాటివరకును జరుగుచున్నది. కావున నారాయణుడనెడి బ్రాహ్మణుని ప్రార్థనను అంగీకరించి, అందఱి కన్నులకు దర్శనమిచ్చి, సేవను దయచేయు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈ తిరునామముయొక్క అర్థము. అతడు ప్రార్థించిన తీరును ఈ క్రింది శ్లోకములవలన తెలియనగును.

**తప శ్చరన్ వసామ్యద్య చిరేణ నియతేంద్రియః ।**
**ఏవం కిల తప శ్చర్తు మశక్యం భువి మానవైః ॥**
**తేషా మనుగ్రహార్థాయ సర్వప్రత్యక్షగోచరః ।**
**సర్వాభీష్టం దద న్నిత్యం స్వామిపుష్కరిణీతటే ॥**
**అనంతవిగ్రహేశానసేనాపతిముఖై స్సదా ।**
**సేవ్యమానః శ్రియా సార్ధం విహరస్వ సమాధవ ॥**
**గిరి శ్చాయం హి మన్నామ్నా ప్రసిద్ధి మధిగచ్ఛతు ।**
(బ్రహ్మాండ – 3–42నుండి50)

(79) **ఓమ్ మృగయారసికాయ శ్రీవేంకటేశాయ నమః**
(వేటయందు వేడుకనుకల వేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వపునామములో సాధుపరిత్రాణమనెడి శిష్టపరిపాలనము తెలుపబడినది. ఈ తిరునామములో దుష్టనిగ్రహము తెలుపబడుచున్నది. ఇదియేకాక, బ్రహ్మాండ పురాణములో నారాయణుడనెడి బ్రాహ్మణుని చరిత్రము వర్ణింపబడిన వెంటనే భగవానుడు వేటాడిన తీరు చెప్పబడినది. ఆ పురాణములోగల కథాక్రమమును అనుసరించి, ఇచట అనేకనామములు ఏర్పడియుండుటచే, ఆ చరిత్ర ముగియగానే అచటగల స్వామి వేట తెలుపబడుచున్నది. భగవానుడు వేట అను వ్యాజముతో ఈ కొండపైగల అరణ్యములలో తిరిగి, పలు అసురులను సంహరించినట్లు తరువాతి నామములో తెలుపబడినది.

భగవానుడు ఒకానొక సమయమున విష్వక్సేనుని చూచి, చిఱునవ్వుతో "ఓ సేనాధిపా! నేను ఈ పర్వతముపై వేటకు పోవలెనని కోరుచుంటిని. కావున చతురంగ బలమును వెంటనే సిద్ధము చేయుము" అని ఆజ్ఞాపించెను. వెంటనే సేనాధిపతి సిద్ధపఱచిన బాణములు మొదలు వేట సామాగ్రితో వేటకు స్వామి బయలుదేరెను. స్వామి ఆజ్ఞానుసారము అన్నివిధములైన సేనలును వెంబడించినవి. అరణ్యములో సింహములు, ఏనుగులు మొదలగు పలు మృగములను వేటాడి స్వామి చాలదూరము సంచరించెను. అరణ్యములోగల వ్యాధులు పలు ఉపహారములను తీసికొనివచ్చి, స్వామిని సేవించి, సమర్పించి, దారి చూపుచు సహాయపడిరి – అను ఈ కథ బ్రహ్మాండపురాణములో కలదు. ఇదియేకాక, వరాహపురాణము మొదలగు పురాణములలో పద్మావతిని వివాహము చేసికొనుటకు ముందు భగవానుడు రాజపుత్రవేషముతో వేటాడుచు, పద్మావతియొక్క ఉద్యానవనమును ప్రవేశించినట్లు కలదు. అట్టి సమయములందు చేసిన వేట ఈ తిరునామములో వివక్షితము అని చెప్పినచో, ముందునామముతో ఈ నామమునకు సంగతి పొసగదు. అందుచే బ్రహ్మాండ పురాణములోనున్నదియే ఇచట వివక్షితము. అచటి శ్లోకములీ క్రింది విధముగానున్నవి.

**అథోత్తరగిరౌ రమ్యే విచచార స దైత్యహా ।**
**సింహవ్యాళగణాన్ విధ్యన్ శరై రాశీవిషోపమైః ॥**
**తత్రత్యాః శబరాధీశాః సోపహారాః సమాగతా ః ।**
**ప్రణమ్య దేవదేవేశమ్ అతిష్ఠ న్నమ్రమౌళయః ॥**
**.......................**
**విచచార బహూన్ దేశాన్ మృగయాకృష్టమానసః ।**
(బ్రహ్మాండ – 4–6–8)

(80) **వృషభాసురహారిణే శ్రీవేంకటేశాయ నమః**

(వృషభుడనెడి అసురుని సంహరించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందు నామములోనే ఈ నామమునకు సంగతి తెలుపబడియున్నది. భగవానుడు వేటాడగోరి, తిరుమల అరణ్యములలో సంచరించునపుడు ఈ వృషభాసురుని సంహారమే వర్ణింపబడియున్నది. ఆ పురాణమును అనుసరించి, పూర్వనామమునకు పిమ్మట ఈ నామము కూర్పబడినది.

వృషభాసురుని చరిత్ర ఈ విధముగానున్నది – తిరుమలకు దక్షిణదిశలో శివభక్తుడగు వృషభుడనెడి ఒక అసురుడు సాధువులను హింసించుచుండెను. ఒకానొక సమయమున అకస్మాత్తుగా ఒక పెద్దకొండ అచట ఏర్పడినది. దానిని చూచిన ఆ అసురుడు "ఇది ఏదియో ఒక మాయావి పని. నేనుకాకుండ వేఱొక మాయావి ఇచటకు ఎవరో వచ్చెను. అతనిని వెదకి, అతనితో యుద్ధమును చేయవలెను" అని తలచి, ఆ పర్వతములో



అన్వేషించెను. అపుడు వ్యాధవేషమున అచట భగవానుడు వేటాడుటను చూచిన ఆ అసురుడు అతడే ఆ మాయావి అని తలచి, భగవానునితో పోరాడుటకు ప్రారంభించెను. అనేకసేనలను, అస్త్రములను తన మాయాబలముతో సృష్టించి, భగవానుని సేనలను తాకెను. భగవానుడే దేనిని దేనిని సృష్టించెనో, అతడును దానిని దానిని సృష్టించెను. భగవానుడు మొదట విష్వక్సేనునిద్వారా ఆ అసురుని సేనను నాశనము చేసెను. భగవానుని మాయను చూచిన అతడు ఇతనిని సామాన్యముగా జయింపవీలుకాదు, గొప్ప మాయతోనే జయింపవలెను అని తలచి, తన మాయాసామర్థ్యముతో గొప్ప సేనను సృష్టించి, తాను అదృశ్యుడయ్యెను. భగవానుడు చక్రాయుధమును ప్రయోగించి, అతని సేనను వధించుట ఆరంభించెను. ఆ చక్రాయుధమునుండి అగ్నిజ్వాలలు వేలాదిగా వెలువడి, ఆ సేనను దహించినది. వెంటనే ఆ అసురుడు " ఈ వేటగాడు సాక్షాత్తు నారాయణుడే. ఇతడిపుడు ప్రయోగించినది చక్రాయుధమే. ఈ చక్రము నన్నుకూడ విడవదు. భగవానుని చక్రముచే మరణించినచో సద్గతి కల్గునని పెద్దలందురు. అందుచే నేనే భగవానుని వేడి, అతని శ్రీహస్తములతో మరణమును పొందెదను" అని నిశ్చయించుకొని, భగవానుని శరణు పొంది, "హే ప్రభూ! నీవు అన్ని లోకములకు సృష్టిస్థితిసంహారముల కర్తవగు పరబ్రహ్మము. నీ ఆజ్ఞను అనుసరించియే కదా చంద్రసూర్యాదులు సంచరించుచున్నారు. పరమదయాళువగు నీ పాదములందు నమస్కరించుటయే కదా సర్వపాపప్రాయశ్చిత్తముగా పెద్దలందురు. అందుచే ఇంతవరకు నేను చేసిన పాపములను క్షమించి, నన్ను నీ చక్రాయుధముతో సంహరించి, నాకు సద్గతిని కల్గింపవలెను" అని ప్రార్థించెను. భగవానుడును అతడు కోరిన రీతిలో అతనిని చక్రాయుధముతో సంహరించి, మోక్షమునిచ్చెను. ఇది బ్రహ్మాండపురాణములోనున్న కథ. ఈ వృషభాసురుని చరిత్ర భవిష్యోత్తర పురాణములో కొంచెము వ్యత్యాసముతో వర్ణింపబడినది. అనగా – తిరుమలలో తుంబురుతీర్థతీరమున వృషభాసురుడు నరసింహస్వామిచే అధిష్ఠింపబడిన ఒక గొప్ప సాలగ్రామశిలను అయిదువేల సంవత్సరముల కాలము ఆరాధించి, తపస్సు చేసెను. ప్రతిదినము పూజ చివర తన తలను నఱికి దానిని ఉపసంహారముగా సమర్పించెను. ప్రతిదినము తలను నఱికిన పిమ్మట నూతనముగా వేఱొక తల మొలిచెడిది. ఇట్లు తపస్సును చేయుచుండగా ఒకనాడు శ్రీనివాసుడు ప్రత్యక్షమై ఏమివరము కావలయును? అని, ప్రశ్నింపగా, ఆ అసురుడు తనకు యుద్ధభిక్షకావలెనని వేడెను. భగవానుడందులకు సమ్మతింపగా వారి ఇద్దఱిమధ్య ఘోరమైన యుద్ధము జరిగెను. చివరలో పూర్వము తెల్పినరీతిలో భగవానుని మహిమను తెలిసి, వృషభాసురుడు చక్రాయుధముతో మరణమును పొందవలెనని కోరెను. అనంతరము అతడు భగవానునిచే సంహరింపబడి సద్గతిని పొందెను.

ఈ తిరుమలకు కృతయుగమున వృషభాచలమని, త్రేతాయుగమున అంజనాచలమని, కలియుగములో వేంకటాచలమనియు పిలువబడునట్లు భవిష్యోత్తర

పురాణములో పూర్వోదాహృతకథను వర్ణించు సందర్భములో తెలుపబడినది. ఇట్లు వృషభాసురుని సంహరించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని ఈ తిరునామముయొక్క తాత్పర్యము. వృషభాసురుడు ప్రార్థించిన తీరును ఈ క్రింద ఉట్టంకింపబడిన శ్లోకముల వలన తెలియనగును.

**క్షమస్వ మత్కృతం సర్వ మపరాధం సుదుస్సహమ్ ।**
**కృతాగసాం త్వాదృశేషు ప్రణామః ఖలు నిష్కృతిః ॥**
**జీవితం తు న యాచేహం క్షుదం పాపస్య కారణమ్ ।**
**అతో యాస్యామి నిహత శ్చక్రేణ పరమాం గతిమ్ ॥**
**తస్మాత్ క్షమస్వ భగవన్ శ్రీనిధే కరుణానిధే ।**
**త్రాతారం వై న పశ్యామి త్వాం వినా మధుసూదన ॥**
(బ్రహ్మాండ - 4-41నుండి43)

**(81) ఓమ్ అంజనాగోత్రపతయే శ్రీవేంకటేశాయ నమః**

(అంజనాచలమునకు ప్రభువగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

తిరుమలకు కృతయుగములో వ్యవహరింపబడిన వృషభాచలమనెడి పేరుకు కారణమగు వృషభాసురచరిత్రము ముందునామములో ప్రస్తావింపబడినది. త్రేతాయుగములో వ్యవహరింపబడిన అంజనాచలమనెడి పేరుకు కారణమగు అంజనాదేవి చరిత్రము ఈ తిరునామములో, 83వ నామమునందును తెలుపబడబోవుచున్నది. ఈ చరిత్ర బ్రహ్మాండపురాణములో వృషభాసురుని చరిత్ర అనంతరము అదే అధ్యాయములో కలదు. అందుచే ఆ అసురుని చరిత్ర ముగిసిన పిమ్మట, దానికి తరువాతగల అంజనాదేవి వృత్తాంత మీ తిరునామములో చెప్పబడుచున్నది అనునదియును ఇచటి సంగతిగా భావింపవచ్చును.

త్రేతాయుగములో కేసరి అను ఒక అసురుడుండెను. అతడు శివునిగూర్చి తపస్సు చేసి, అతనిని ప్రత్యక్షము గావించుకొని, పుత్రసంతతిని పొందవలెనని ప్రార్థించెను. శివుడును - "నీకు పుత్రప్రాప్తి కలుగదు. అందుచే ఒక కుమార్తె కల్గునట్లు అనుగ్రహించెదను. ఆ కుమార్తెకు నీవు కోరినట్లు ఉత్తముడైన ఒక పుత్రుడు జన్మింపగలడు" అని వరమిచ్చెను. అనంతరము కేసరికి మిక్కిలి అందమైన ఒక కూతురు పుట్టెను. కేసరి ఆమెకు అంజన అను పేరును పెట్టి, ఆమెను మిక్కిలి గారాబముగా పెంచెను. ఆమెకు యుక్తవయస్సురాగానే కేసరి అనెడి ఒక వానరుడు ఆమెను తనకు భార్యగా ఇవ్వవలయునని కేసరి అనెడి అంజనాదేవి తండ్రి అడిగెను. అతడును అంగీకరించి అట్లే చేసెను. చిరకాలము ఆమెతో అతడు ఆనందముగా విహరించిన తరువాతకూడ వారిరువురకు పుత్రుడు కలుగలేదు. అందుచే అంజనాదేవి మిక్కిలి బాధపడగా, ఒకనాడు ధర్మదేవత (భగవానుడు) కోయవనితవేషమున అంజనాదేవి వద్దకు వచ్చి, "నీవు బాధపడవద్దు. నీకు ఉత్తముడగు



పుత్రుడు జన్మింపగలడు. కాని అందులకు నీవు వేంకటాచలములోని ఆకాశగంగాతీరమున చిరకాలము తపస్సు చేయవలెను" అని చెప్పి అంతర్ధానమయ్యెను. అనంతరము ఆ కోయవనిత మాటను అనుసరించి, ఆమె ఈ తిరుమలలోని ఆకాశగంగాతీరమున ఏడువేల ఏండ్లు తపస్సు చేసెను. అపుడు వాయుభగవానుడు ప్రతిదినమును ఒక్కొక్క ఫలమును ఆహారము కొఱకు ఆమెకు ఇచ్చెను. ఇట్లుండగా, పార్వతీపరమేశ్వరులు ఆ పర్వతముపై ఏకాంతముగా అచట అచట విహరించుచుండిరి. అపుడు ఒకనాడు వారికి ఎదురుగా ఒక వానరమిథునము విహరించినది. దానిని చూచిన పార్వతి మనస్సు చలించి భర్తను చూచి, తాముకూడ ఆ వానరరూపమును ధరించి విహరింపవలెనను తన కోరికను తెలియజేసెను. శివుడును సమ్మతింపగా, వారిరువురు వానరరూపములో విహరించిరి. అపుడు వారి తేజస్సు భూమిపై చిందినది. వాయుభగవానుడు దానిని గ్రహించి, అంజనాదేవికి ఇచ్చెను. అలవాటు ప్రకారము దానిని ఫలమని గ్రహించిన అంజనాదేవి దానిని భుజించెను. పిమ్మట ఆమెశరీరమున గర్భము ఏర్పడిన చిహ్నములు పొడసూపినది. దానిని చూచి ఏవిధమైన దోషమును మనస్సుతోకూడ భావింపని నాకు ఈ గర్భము ఎట్లు ఏర్పడినది? అని అంజనాదేవి చాల చింతించినది. అపుడు ఆకాశవాణి - "ఓ అంజనాదేవీ! చింతింపకుము. ఇది దేవతల కార్యము. నీయందు ఏ దోషములేదు. లోకోత్తరుడైన పుత్రుడు నీకు కలుగగలడు. అతడు శ్రీరాముడుగా అవతరింపబోవు భగవానునకు మిక్కిలి సహాయము చేయగలడు. అందుచే నిశ్చింతగానుండుము" అని పల్కినది.

పిమ్మట పదియవనెలలో శ్రావణమాసమున శ్రవణానక్షత్రమున సూర్యోదయ సమయమున అంజనాదేవికి ఆంజనేయుడను పుత్రుడు కల్గెను. పుట్టగానే అతడు సూర్యుని ఒక ఫలముగా తలచి, ఆకలివలన దానిని మింగవలెనని భావించి, సూర్యమండలము వైపు ఎగిరిపోయెను. దానిని చూచిన బ్రహ్మ భయపడి బ్రహ్మాస్త్రమును ఆ బాలునిపై ప్రయోగించెను. ఆ బాలుడు దాని ప్రభావమును తాళలేక కిందపడెను. పిమ్మట అంజనాదేవి అందఱు దేవతలను ఉద్దేశించి మొఱపెట్టెను. బ్రహ్మాదిసకలదేవతలు ప్రత్యక్షమై వచ్చి, ఆ బాలునకు పలు వరములను ఇచ్చి, అతనిని అనుగ్రహించిరి వెడలిరి. అతడే సుగ్రీవునకు మంత్రియైయుండి, శ్రీరామునకు అనేక సహాయములను చేసెను. కావున ఇట్లు అంజనా దేవి ఈ పర్వతముపై చిరకాలము తపస్సును చేసి, లోకోత్తరుడగు పుత్రుని పొందుటచే ఈ పర్వతమునకు అంజనాచలమను పేరు వచ్చినది. ఇట్టి అంజనాచలమునకు అధిపతియగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని ఈ నామముయొక్క భావము. ఈ కథయే కొంచెము మార్పుతో సంగ్రహముగా భవిష్యోత్తరపురాణములో కలదు. బ్రహ్మాండపురాణాంతర్గత శ్లోకములీక్రింద చూపబడుచున్నవి.

**పుత్రం సూతవతీ యస్మాత్ లోకత్రయహితాయ వై ।**

ప్రసిద్ధిం యాతు శైలోఽయమ్ ! నామత స్తవ ॥
అంజనాచల ఇత్యేవ నాత్ర కార్యా విచారణా ।
ఇతి తస్యై వరం దత్త్వా దేవా బ్రహ్మపురోగమాః ।
స్వం స్వం స్థానం సముద్దిశ్య యథాగత మథో యయుః ॥
(బ్రహ్మాండ - 6-66నుండి68)

(82) **ఓమ్ వృషభాచలవాసినే శ్రీవేంకటేశాయ నమః**
(వృషభాచలమనబడు తిరుమలలో నివసించునట్టి శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

80వ తిరునామము అగు **"వృషభాసురహారిణే"** అను తిరునామముతో దీనికి సాక్షాత్ సంగతి కలదు. ఈ అంశము అచటనే ప్రస్తావింపబడినదికూడ. వృషభాసురుని సంహరించిన వృత్తాంతము అచట తెలుపబడినది. వృషభాచలమని ఈ పర్వతమునకు త్రేతాయుగములో పేరు కల్గుటకుగల కారణము ఇందు తెలుపబడుచున్నది.

పూర్వము తెలిపిన రీతిలో భగవానుని చక్రాయుధముచే తనకు మరణము కలుగవలెనని వృషభాసురుడు కోరినపుడు వేఱొక వరమునుకూడ ప్రార్థించెను. అది ఏమనగా - నీ చక్రముచే దాసునకు ఈ కొండపై మరణము సంభవించినందులకు గుర్తుగా ఈనాటినుండి ఈ కొండను పేరుతో - అనగా - వృషభాచలమను పేరుతో వ్యవహరింపబడవలెను అనెను. భగవానుడతని కోరికను అంగీకరించి, "అట్లే అనుగ్రహింపబడును" అని నుడివి, అతని తలను ఖండించెను. అదియే అపుడు అతనికి చేయదగిన పరమహితము. దేవతలును, సాధువులును సంతోషించిరి. అతనిని సంహరించి, తనవేటను ముగించుకొని భగవానుడు తన ఆస్థానమును చేరెను. ఇట్లు వృషభాచలమని పిలువబడు తిరుమలలో నిత్యసాన్నిధ్యమును కల్గియున్న శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని ఈ నామముయొక్క తాత్పర్యము. బ్రహ్మాండ పురాణములోని దీనికి సంబంధించిన శ్లోకములు

అద్య ప్రభృతి చాయం వై గిరి రుచ్ఛ్రితశేఖరః ।
మదాఖ్యయా ప్రథాం యాతు వృషభాచల ఇత్యపి ॥
ఇత్యేవం శోకసంతప్త మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
వృషభం త మువాచేదం ప్రహసన్ గరుడధ్వజః ॥
శ్రీ భగవాన్ - వృషభాసుర! మద్భక్త్యా విముక్తిం యాస్యసి ధ్రువమ్ ।
గిరి శ్చాయం భవన్నామ్నా ప్రసిద్ధి మధిగచ్ఛతు ॥
......................
గోవిందేతి దయాసారో వరం దత్త్వాఽసురాయ వై ।
పున రభ్యేత్య శేషాద్రౌ యథాస్థానం స్థితో మునే ॥
(బ్రహ్మాండ - 5-44నుండి51)



(83) **ఓమ్ అంజనాసుతదాత్రే శ్రీవేంకటేశాయ నమః**
(అంజనకు అరుదైన సుతుని ప్రసాదించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

81వది అగు **"అంజనాగోత్రపతయే"** అనడి తిరునామముతో ఈ నామమునకు సాక్షాత్ సంగతి కలదు. ఇదియును ఇంతకుముందే తెలుపబడినది. అంజనాచలమని ఈ తిరుమలకు పేరు కలదు అనునది ఈ తిరునామములోని ప్రమేయము. ఇచట దానికి కారణమగు అంజనయొక్క పూర్ణచరిత్ర అనుసంధింపబడుచున్నది.

ఈ తిరునామములో అనుసంధింపవలసియున్నను పాఠకుల సౌకర్యమును ఉద్దేశించి 81వ తిరునామములోనే అంజనాదేవి చరిత్ర తెలుపబడినది. కావున దానిని అందు గమనింపనగును.

వాయుదేవుని సహాయముతో, శివుని సంబంధముతో అంజనకు పుత్రుడు ఆంజనేయుడుగా జన్మించెను. ఇట్లుండగా, శ్రీవేంకటేశ్వరుడే అంజనను పుత్రుని అనుగ్రహించెనని ఎట్లు ఇచట అనుసంధింపతగును! అని సందేహింపనవసరము లేదు. కోయవనిత రూపమున వచ్చిన ధర్మదేవత సాక్షాత్తు శ్రీనివాసుడే అగుటవలన, అతని ఉపదేశముయొక్క పేరులోనే ఈ కొండపై అంజనాదేవి సిద్ధిని పొంది పుత్రుని పొందుట వలన శ్రీనివాసుడే ఈ పుత్రోత్పత్తికి ముఖ్యకారణము. అంతియేకాక, ఈ తిరుమల అనెడి పుణ్యక్షేత్రముయొక్క ప్రభావముచేతనేకదా ఆమెకు పుత్రసంతానము కల్గినది. ఈ క్షేత్రమునకు తలచినది అనుగ్రహింపగల శక్తి ఏర్పడుట శ్రీనివాసుని సాన్నిధ్యము చేతనే కదా! కావున ఎట్లయినను ఆమెకు పుత్రలాభము కల్గుటలో శ్రీనివాసుడే ప్రధానకారణము అను విషయమును ఉద్దేశించియే ఈ తిరునామమునకు శ్రీనివాసుడే అంజనాదేవికి పుత్రుని అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని అర్థము. ఇచట అనుసంధింపతగిన శ్లోకములు అచటనే తెలుపబడినవి.

(84) **ఓమ్ మాధవీయాఘహారిణే శ్రీవేంకటేశాయ నమః**
(మాధవుడను బ్రాహ్మణుని పాపములను పోగొట్టిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

బ్రహ్మాండపురాణములో అంజనాదేవియొక్క చరిత్రను వర్ణించిన పిదప, మాధవుడనెడి బ్రాహ్మణుని చరిత్ర వర్ణింపబడినది. ఆ పురాణక్రమమును అనుసరించియే ఇచట కొన్ని నామములు ఏర్పడియుండుటచే పూర్వతిరునామములో అంజనాదేవియొక్క కథను తెలిపి, ఈ తిరునామములో దానికి పిమ్మటగల మాధవుని చరిత్ర చెప్పబడుచున్నది.

ఈ మాధవుని చరిత్ర బ్రహ్మాండపురాణములోవలెనే భవిష్యోత్తర పురాణమునందుకూడ కలదు. అచట ఈ కథ విస్తృతముగా వర్ణింపబడినది. బ్రహ్మాండపురాణములో సంగ్రహముగానున్నది. ఈ రెండు పురాణములను స్పృశించుచు ఆ చరిత్ర ఇచట నివేదింపబడుచున్నది.

వేంకటాచలమునకు పడమటి దిశలోగల నందనమనెడి పట్టణములో పురందరుడను ఒకానొక బ్రాహ్మణశ్రేష్ఠుడు నివసించుచుండెను. సత్ప్రవర్తనను, సద్గుణములను నిండుగా కలవాడు. అతనికి మాధవుడనియు పేరు. అతడు చిన్న వయస్సులోనే నేర్వదగిన అన్ని విద్యలను అభ్యసించి, సత్ప్రవర్తనతో వెలుగొందెను. అతనికి యుక్తవయస్సు రాగానే తండ్రి పాండ్యదేశమునకు చెందిన ఒకానొక కన్యతో వివాహము జరిపించెను. చంద్రలేఖ అనెడి ఆ కన్య రూపములో, గుణములో మిక్కిలి గొప్పది. ఆమెతో కలసి మాధవుడు సర్వభోగములను అనుభవించుచుండెను. ఒకనాడు పగటివేళలో ఆమెతో కలసి విహరింపవలెనని మాధవుడు వాంఛించెను. చంద్రలేఖ శాస్త్రములను, పెద్దల సదనుష్ఠానమును చూపి, పగటివేళలో ఇది తగదు అని ఎంతగా నిరోధించినను మాధవుడు వినకపోవుటచే, "సరియే!, నీవు నదీతీరమున దర్భలను తీసికొనివచ్చు వానివలె కుండను తీసికొని వచ్చెదను. నదీతీరముననే నీ అభిలాషను తీర్చుకొనవచ్చును" అని పల్కినది. మాధవుడును ఆ విధముగానే బయలుదేరిపోయెను. చంద్రలేఖకూడ కుండను గైకొని అతని వెనుకవెడలెను. ఇట్లు వీరిద్దరు పోవుచుండగా దారిలో మిక్కిలి అందమైన ఒక యువతి ఏకాంతముగా ఆ నదీతీరమున నిలచియుండెను. ఆమెయొక్క అపూర్వమైన అందము మాధవుని వశీకరించుకొన్నది. వెంటనే మాధవుడు మోసముతో తన భార్యను చూచి. "ప్రేయసీ! నామనోవేగము కొంతవరకు ఉపశమించినది. అందుచే నీవు చెప్పినట్లు పగటివేళ ఆ పాపకార్యమును నేను చేయదలచలేదు. అందుచే నీవు ఇంటికి పోవచ్చును" అని పల్కెను. ఆమెకూడ అది నిజమేయని తలచి, ఇంటికి తిరిగిపోయెను. వెంటనే మాధవుడు ఆ యువతి అందమున చిక్కి, తిరిగిపోలేక, ఆమె సమీపమున చేరి "నీవెవరు? నీది ఏ ఊరు?" అను మొదలైన వివరములను విచారించుటతో నిలువక, తాను ఆమె సౌందర్యమున అభినిష్టుడై, ఆమెను పొందగోరిన విషయమును తెలిపెను. ఆమె అపుడు నేను ఛండాల జాతికి చెందినదానిని నా సమీపమునకుకూడ సర్వవేదాంగములను తెలిసిన నీవు రాదగినవాడవు కావు" అనియు, ఈ విధమైన పాపబుద్ధిని విడచి, ఇంతకాలము సన్మార్గమును విడవకున్నట్లే ఇపుడును విడువవలదని పలు రీతులలో మంచిని బోధించెను. అపుడు మాధవుడు – "నిన్ను కలవకున్నచో నా ప్రాణములిపుడే నా దేహమును విడచిపోవుట తథ్యము. అందుచే నన్ను కాపాడుము" అని పల్కుచు బలవంతముగా ఆమెతో కలసి, సుఖించెను. వెంటనే కుంతల అనెడి ఆ ఛండాల స్త్రీ మాధవునికూడ ఛండాల సదృశునిగా మార్చి, మద్యమాంసాదులను అతనికి అలవాటుచేసి, చిరకాలము చండాలవాటికలోనే అతనితో రమించెను. కొంతకాలము గడచిన పిదప ఆకుంతల మరణించినది. పలు దుర్గుణములను నేర్చుకున్న మాధవుడు ఆమె విరహమును సహింపలేక పిచ్చివాడై, ఊరు ఊరు తిరుగసాగెను. అట్లు పరిభ్రమించునపుడు ఉత్తరదేశము నుండి కొందఱు వేంకటాచలమునకు యాత్రగా వచ్చిరి. యాదృచ్ఛికముగా వారితో కలసిన మాధవుడును వేంకటాచలమును చేరెను. పోవునపుడే అతడు



కపిలతీర్థములో స్నానము చేసి, తిరుమలను ఎక్కుట ప్రారంభించెను. ఆ క్షణములోనే అతని శరీరమునుండి పొగ నిప్పు వెలువడి, మిక్కిలి దుర్గంధముతో చటచటమను శబ్దము చేయుచు మండుట ప్రారంభించినది. అపుడు అతని దేహమునునుండి పాపములన్నియు, బయటకు వెలువడి మండి బూడిద అయినవి. వెంటనే అతడు ఛండాలరూపమును వీడి, పూర్వమువలె బ్రహ్మతేజస్సుతో ప్రకాశించెను. ఈ ఆశ్చర్యమును ప్రక్కనే ఉండి గమనించిన ఋషులు మొదలగు పెద్దలు ఆ పర్వతముయొక్క ప్రభావమే ఇది అని తలచి, ఆ మాధవుని చూచి, నీవెవరు? నీ చరిత్రమేది? అని ప్రశ్నించిరి. మాధవుడు తన చరిత్రను అంతటిని దాచకుండ వారికి తెలిపెను. అపుడు ఆ మహర్షులు ఈ పర్వతప్రభావమే ఇట్టిది. ఈ పర్వతము పై నీవు కాలుపెట్టినంతనే నీవద్దగల పాపములు ఎట్లు నశించిపోయినవో చూచితివా! ఇందు వేంచేసియున్న వరాహరూపియైన శ్రీనివాసుని మహిమ అపారమైనది. ఆ స్వామి సేవించినచో అన్ని విధములైన కర్మబంధములు నశించి, కైవల్యమును పొందవచ్చును. నీ ఈ ఘోరపాపములను భస్మము చేయుటచే ఈ పర్వతమునకు వేంకటాచలమను పేరు కల్గునుగాక! (**"వేమ్"**–అనగా సకలపాపముల, **"కటమ్"**. అనగా దహించునది అని అర్థము కావున, పాపములన్నిటిని దహించుటచే దీనికి వేంకటాచలము) అని పల్కిరి. పిమ్మట వారి మాటప్రకారము మాధవుడు పరమపురుషుని కన్నులార సేవించి, తాను పూర్వము చేసిన దుష్కర్మలకు వగచి, ఆ పరమపురుషునివద్ద అపరాధక్షామణమును చేసికొని, కైవల్యమును పొందెను. కావున మాధవుడనెడి బ్రాహ్మణుని ఘోరపాపములను పోగొట్టిన శ్రీవేంకటాచలమును శరణు పొందుచున్నాను – అని ఈ తిరునామముయొక్క తాత్పర్యము. పర్వతము పాపములను దహించుట భగవానుని ప్రభావముచేతనే కావున భగవానుని **"మాధవీయాఘహారిణే"** అని కీర్తించుటలో విప్రతిపత్తిలేదు. ఇచట ముఖ్యముగా అనుసంధింపతగిన కొన్ని శ్లోకములు ఇవి –

**ఋషయః –** **అనేన పాపజాలం వై యస్మా ద్దగ్ధం ద్విజన్మనః ।**
**వేంకటాచల ఇత్యస్య ప్రసిద్ధి ర్భువి వర్తతామ్ ॥**
**సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహ ఉచ్యతే ।**
**సర్వపాపదహో యస్మాత్ వేంకటాచల ఇత్యభూత్ ॥**
**ఇత్యుక్త్వా మునయ స్సర్వే యథాగత మథో యయుః ।**
**ద్విజోఽపి శాంతచిత్తోఽస్మిన్ అచలే సంయతేంద్రియః ॥**
**దుశ్చరం వై తపః కృత్వా తేన కైవల్య మాప్తవాన్**
(బ్రహ్మాండ – 6–42నుండి46)

(85) **ఓమ్ ప్రియంగుప్రియభక్షాయ శ్రీవేంకటేశాయ నమః**

(86) **ఓమ్ శ్వేతకోలవరాహాయ శ్రీవేంకటేశాయ నమః**

(87) **ఓమ్ నీలధేనుపయోధారాసేకదేహోద్భవాయ శ్రీవేంకటేశాయ నమః**

**(88) ఓమ్ శంకరప్రియమిత్రాయ శ్రీవేంకటేశాయ నమః**

**(89) ఓమ్ చోళపుత్రప్రియాయ శ్రీవేంకటేశాయ నమః**

(ప్రియంగు అనెడి ధాన్యమును తనకు ఇష్టమైన ఆహారముగా స్వీకరించు శ్రీవేంకటేశ్వరుని శరణు పొందుచున్నాను. శ్రీశ్వేతవరాహరూపమును దాల్చిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను. నీలధేనువులయొక్క పాలధారతో అభిషేకించుటవలన బయటపడిన దివ్యరూపమునుగల శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను. చోళదేశరాజకుమారునకు ప్రియుడగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ఈ అయిదు తిరునామములును ఒకే కథను అవలంబించి ఏర్పడినవి అగుటచే, వీనిని అన్నిటిని కలిపి వ్యాఖ్యానించుట ఉచితము. బ్రహ్మాండపురాణములో మాధవుని చరిత్రకు పిమ్మట, చోళదేళపు రాజకుమారుడు వరాహరూపియైన శ్రీనివాసభగవానుని దర్శించిన తీరు వర్ణింపబడుటచే ఈ చరిత్రను తెలుపు ఈ అయిదు తిరునామములు **"మాధవీయాఘహారిణే"** అనెడి 84వ తిరునామమునకు పిమ్మట అమరియున్నవి.

పూర్వము ఒకానొక సమయమున గొప్ప ధార్మికుడగు చోళదేశపు రాజు ఒకడు వేటాడుకై అరణ్యములో సంచరించి వచ్చునపుడు ఒకచోట పాతాళలోకములో నివసించు ధనంజయుడను నాగరాజు కుమార్తెను యాదృచ్ఛికముగా చూచి, ఆమెపట్ల అనురాగమును కల్గినవాడయ్యెను. ఆ కన్యకయు ఇతనిని కోరుటచే గాంధర్వవిధిలో వీరిరువురు వివాహమును చేసికొనిరి. తత్ఫలముగా ఆమె సద్యోగర్భమును పొందెను. ప్రభువు తన రాజధానికి తిరిగి వెడలెను. నాగకన్యక తండ్రివద్దకుపోయి జరిగిన తెలిపెను. నాగరాజు చోళదేశపు ప్రభువు ఆమెకు తగినవాడే అని సంతోషించెను. పిమ్మట నాగకన్యకు ఒక కుమారుడు జన్మించెను. అతనికి అయిదాఱు సంవత్సరములున్నపుడతడు తన తండ్రిని చూడవలెనని ఆశపడెను. తల్లికూడ చోళప్రభువుండు చోటును తెలిపి, దారిని చూపి, అతనివద్దకు పోవునట్లు పంపెను. రాజకుమారుడు ప్రభువు వద్దకుపోయి, నమస్కరించి తాను అతనికుమారుడగుటను వివరించి, తనను అంగీకరింపవలసినదిగా ప్రార్థించెను. ప్రభువు సందేహించుచుండగా, ఆకాశవాణి – "రాజా! ఇతడు నీ కుమారుడే. చక్రవర్తి అను పేరునుకల ఇతడు భూమండలమంతటిని పాలింపగలడు. ఇతడు గొప్ప విష్ణుభక్తుడై వెలిగి, వేంకటాచలపతి అగు భగవానుని పూజింపగలడు. శ్రీనివాసుడును ఇతని భక్తిని మెచ్చి, తన అర్చాసమాధిని దాటి, ఇతనితో నేరుగా మాటలాడగలడు. కావున ఇతనిని అంగీకరింపుము'' అని పల్కెను. ప్రభువును అతనిని అట్లే అంగీకరించి, యుక్తవయస్సురాగానే, అతనికి పట్టాభిషేకమును చేసెను. తాను, నాగకన్యకయును కలిసిన చోట ఒక పట్టణమును సృష్టిచేసి, దానిని పుత్రునకు రాజధానిగా చేసి ఇచ్చెను. ఆ చక్రవర్తి రాజ్యపాలనచేయు సమయమున ఒకనాడు ఈ రాజుపాలనలోనున్న కొందఱు గొల్లలు వచ్చి, "ప్రభూ! వేంకటాచలమునకు సమీపములో నివసించు మేము ప్రతిదినము తమకై పాలకుండలను తీసికొనువచ్చునపుడు, ఆ పర్వతప్రదేశములోనున్న ఒక



పెద్దపుట్టద్వారా రావలసియుండుటచే, ఆ పుట్టసమీపములో వచ్చునపుడు మేము ఎంత జాగ్రత్తగా ఉన్నను మాపాలకుండలు పగిలి, పాలు మొత్తము పుట్టలో పడిపోవుచున్నది. ఇదేమి ఆశ్చర్యమోకాని తెలియుట లేదు. దీనిని నీవు గమనింపవలెను" అని ప్రార్థించిరి. ప్రభువును "ఇది దైవలీలయే కావలయును" అని తలచెను. ఆనాటిరాత్రి అతడు ఒక అద్భుతమైన కలను కనెను. మేఘవర్ణుడగు ఒక దివ్యపురుషుడు కన్పించి, ఆ పర్వతముయొక్క మహిమను నీకు తెలుపమని భగవానుని ఆజ్ఞ అనియు పల్కి, ఆ పర్వతముయొక్క, దానిలోగల పుణ్యతీర్థముల యొక్కయు, అచటి స్వామియొక్కయు మహిమను విశేషముగా వర్ణించి, నాతో వచ్చినచో, ఆస్వామిని ఆ స్వామి విమానమును, పర్వతమును దర్శింపవచ్చును – అని పల్కెను. వెంటనే ఆదివ్యపురుషునితోపాటు రాజు వెడలెను. మిక్కిలి అందమైన ఆ పర్వతము నడుమన అతడు అద్భుతమైన విమానమును కాంచెను. ఆ విమానము దగ్గరకు పోయినపుడే ఆ దివ్యపురుషుడు అంతర్ధానమయ్యెను. ఈ కలను మఱుదినము మంత్రులతో ప్రభువు పల్కి, "దీని అర్థ మేమి?" అని ప్రశ్నింపగా, "నిన్న గోపాలురు తెలిపిన విషయమునకు, దీనికిని సంబంధము ఉండియుండవలెను" అని వారు పల్కిరి. ఆ సమయములో వేంకటాచలములో నివసించు ఒక వ్యాధుడు వచ్చి, ప్రభువుకు నమస్కరించి, "హే రాజా! నేను వేంకటాచలములో ప్రియంగు అనెడి ధాన్యమును పైరు చేయుచు, నా భార్యతో, కుమారునితో కలసి నివసించుచుంటిని. నా పొలములో ఒక శ్వేతవరాహము వచ్చి, ప్రతిదినము, ఆ ధాన్యమును మేయుచున్నది. అందులకై ఒకనాడు నేను నా కుమారుని కావలిపెట్టి, ఆ ధాన్యమును నా ఇష్టదేవతకు నివేదన చేయుటకై ఆ ధాన్యముతో కలుపుటకు తేనెను తీసికొని రాగోరి అరణ్యమునకు పోయితిని. వచ్చునపుడు నా కుమారుడు ఆ ధాన్యమును తీసికొని, భగవానునకు నివేదనచేయకుండగనే భుజించుచున్నాడే! అను కోపముతో అతనిని చంపబోయితిని. అపుడు అశరీరవాణి – "ఓవ్యాధా! అతనిని చంపవద్దు. నీ సత్ప్రవర్తనకు మెచ్చిన స్వామి ప్రియంగు ధాన్యమును ఆరగించినాడు. అట్లు భుజింపగా మిగిలినదియే నీ కుమారుడు భుజించినాడు. కావున దోషము లేదు. మఱియు, ఈ విషయమును చక్రవర్తివద్ద నీవు పోయి తెలిపి, నిన్న రాత్రి అతడు దర్శించిన కలకు చిహ్నముగా తెలిపి, ప్రభువును ఇచటకు పిలిచి తీసికొని రమ్ము". అని ఆజ్ఞాపించినది. రాజును గోపాలుర మాటను, కలను, ఈ వ్యాధుని వృత్తాంతమును కలిపి చూచి, పరిశీలించి, ఇది అంతయు భగవదాజ్ఞయే అని తలచి, ఈ వేటగానితో కలసి తిరుమలకు బయలుదేరెను. మంత్రులను పిలచి, వేలాది సంఖ్యలో కుంభములలో ఆవు పాలను నింపి, అచటి తీసికొనిరండు అని ఆజ్ఞాపించెను. వేటగానితో కలసి వెడలిన ప్రభువు ఆ వేటగాని పొలమునుండి ప్రియంగు ధాన్యమును మేసివచ్చు ఒక పెద్ద శ్వేత వరాహమును, తాను స్వప్నములో చూచిన దివ్యవిమానమును అచట దర్శించెను. ఆ వరాహముయొక్క రూపము మిక్కిలి ఆశ్చర్యకరముగానుండెను. వీరిని చూచిన వరాహము వెంటనే అచట సమీపములోనున్న

పుట్టలో మఱుగుపడినది. ఆ విమానము అంతర్ధానమయ్యెను. దీనిని చూచిన రాజు ఇది ఏమి? అని వేటగానిని అడిగెను. వేటగాడును "ఓ రాజా! ఇది సాధారణ వరాహము కాదు. లోకమును ఒకానొక సమయమున పాతాళము నుండి పైకి తీసికొని వచ్చిన ఆదివరాహమూర్తియేసుమా! ఈ భగవానుడు ఈ పుట్టనుండి బయటకు వచ్చి. అందే అదృశ్యమయ్యెను. ఇపుడు చూచిన విమానముకూడ ఈ స్వామిదే. అందుచే ఈ పుట్టను తవ్వుగోలలతో తవ్వి తీసినచో భగవానుని దర్శింపవచ్చును - అని పల్కెను. కాని, ప్రభువు అట్లు పుట్టను తవ్వుటకు భయపడి, పాలకుండలనుండి ధారగా పాలను స్రవింపజేసి, ఆ పుట్టను కఱగించెను. అపుడు అచట కోటిసూర్యప్రకాశమైన ఒక విమానమును చూచి, ఆశ్చర్యపడి, దానికి నమస్కరించెను. పిమ్మట ఆ విమానములో శంఖచక్రములను రెండువైపుల దాల్చి వచ్చువాడు, వేరొక చేతితో అభయము నిచ్చువాడును, ఇపుడు వేంకటేశ్వరుడు ఎట్లు సేవను అనుగ్రహించుచున్నాడో, అదే రీతిలో నున్నవాడును, కోటిసూర్యప్రకాశమైన దివ్యరూపమును కలవాడును, కరుణామూర్తియును అగు శ్రీనివాసుని దర్శించెను. ఆశ్చర్యపడి, పలుమార్లు నమస్కరించి స్తుతించెను.

అట్లు కపిలధేనువుల క్షీరముతో కఱగించిన పుట్టనుండి ఆవిర్భవించిన దివ్యరూపమునుకల శ్రీనివాసభగవానుడు తనను నమస్కరించు చక్రవర్తిని చూచి, మిక్కిలి గంభీరమైన ధ్వనితో "ఓ రాజపుత్రా! నీ భక్తికి మిక్కిలి మెచ్చితిని. నీకు అవసరమైన వరమును కోరుకొనుము" అని పల్కెను. ప్రభువును - "ఓ దేవా! నీవు యోగులకును దొరకని ఈ రూపముతో అందఱు మనుష్యుల హితమును ఉద్దేశించి, ఇచటనే స్థిరముగా వేంచేసియుండి, అందఱిని అనుగ్రహించవలెను. ఇదియే నా వేడికోలు" - అని పలుకగా భగవానుడును "అట్లే కానిమ్ము" అని అతని ప్రార్థనను అంగీకరించెను. పిమ్మట భగవానుడు రాజపుత్రుని చూచి "నాపట్ల గొప్ప భక్తినికల నిన్ను నా మిత్రునిగా భావించెదను. నన్ను భక్తులకు వశునిగా మిత్రునిగా భావింపుము" అని పల్కి, నీవు ప్రతిదినమును మూడు కాలములందు నన్ను సేవింపుము - అని అనుగ్రహించెను. రాజపుత్రుడును అది మొదలు ప్రతిదినము మూడుకాలములందు భగవానుని దర్శించుచుండెను. అపుడు భగవానుడు అర్చాసమాధిని అతిక్రమించి, ఇతనితో సంభాషించెడివాడు.

అనంతరము రాజపుత్రుడు, బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలగు దేవతలందఱిని పిలచి, ఉత్తమ బ్రాహ్మణులను ముందుంచుకొని, శ్రీనివాసునకు ధ్వజారోహణ పూర్వకముగా రథోత్సవము, అవబృథమువరకుగల బ్రహ్మోత్సవమును చాల ఆశ్చర్యకరముగా జరిపెను. అతడు గొప్ప పరిపాలనమును చేసెను. ఇదియే చోళరాజపుత్రుని యొక్క సంగ్రహ వృత్తాంతము. ఇచట పూర్వము ప్రస్తావింపబడిన అయిదు తిరునామములయొక్క అర్థములును ఒకవిధముగా అణగియుండుటను పాఠకులు గమనింపగలరు.



ఇందు 88వ నామమగు **"శంకరప్రియమిత్రాయ"** అను నామముయొక్క అర్థము - రుద్రునకు మిక్కిలి ఇష్టుడగు మిత్రుడు శ్రీనివాసుడు - అని ఈ అర్థము పూర్వము తెలిపిన కథలో రాలేదుకదా! అను ప్రశ్న కలుగవచ్చును. చోళరాజు పుత్రుడగు చక్రవర్తి భగవానునకు బ్రహ్మోత్సవమును జరిపినపుడు శంకరుడుకూడ తోడుగా ఉండి, ఉత్సవమును గొప్పగా జరిపించినట్లు ఈ ప్రకరణములోనే ఉండుటచే దానిని పురస్కరించుకొని ఇట్లు ఈ సందర్భములో శంకరునకు ప్రియమైన మిత్రమని చెప్పబడినది - అని సమాధానమును చెప్పవచ్చును. కాని, శంకరునివలె బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన వారును వచ్చి, ఉత్సవమును నడిపినట్లుండుటచే, శంకరునిగూర్చి మాత్రము ఇట్లు ప్రత్యేకముగా పల్కుటకుగల కారణము ఈ ప్రకరణములో ఏమియు కానవచ్చుట లేదు. దీనిని గమనించినపుడు **''శంకరప్రియమిత్రాయ''** అనెడి స్థానములో **"శాబరప్రియమిత్రాయ"** అను పాఠము ఉండవచ్చునా! ఏమి! అను సందేహము కల్గుచున్నది. శాబరుడనబడు వ్యాధుడు ప్రియంగు ధాన్యమును పండించి, ఆ ధాన్యపు పిండితో, తేనెను కలిపి ప్రతిదినము భగవానునకు నివేదనమును చేయుచుండెను. అతడే శ్వేతవరాహము సాక్షాత్తు భగవానుడనుటను రాజకుమారునకు చెప్పినవాడు. అతని భక్తికి మెచ్చిన స్వామి అతడు లేకున్నను అతని కుమారునిద్వారా ఆ ధాన్యమును ఆరగించెను. ఆ వ్యాధుని శాబరశబ్దముతో ఈ ప్రకరణమున పురాణము పలు సందర్భములలో నిర్దేశించినది. అందుచే, ఆ శాబరునకు మిక్కిలి స్నేహితుడై వెలిసినవాడు భగవానుడు - అని ఏర్పడుచున్నది. దీనిని పురస్కరించుకొనియే ఈ ప్రకరణమునకు పొసగు రీతిలో పరిశీలించినచో, **"శాబరప్రియమిత్రాయ"** అను పాఠముండియుండునా! అని తోచుచున్నది. పెద్దలు పూర్వోక్తబ్రహ్మాండపురాణ ప్రకరణమును సేవించి, నిర్ణయింతురుగాక!-అని వేడుచున్నాను.

ఈ సందర్భమున అనుసంధేయములగు కొన్ని శ్లోకములు క్రింద ఉట్టంకింపబడుచున్నవి.

**వ్యజిజ్ఞిపచ్చ రాజానం ప్రణతః ప్రాంజలిః స్థితః ।**
శాబరః:- **స్వామిన్ । వసామి శేషాద్రౌ ప్రియంగుకృషి మాచరన్ ।**
**తేన జీవామి సతతం సపుత్రః సహబాంధవః ॥**
**కశ్చిత్ శ్వేతవరాహో వై తత్రాగత్య దినేదినే ।**
**ప్రియంగుం భక్షయత్యేవ నిశ్శేషం మిషతాం చ నః ॥**

(బ్రహ్మాండ - 82-52నుండి 53)

ఈ శ్లోకములు **"ప్రియంగుప్రియభక్ష్యాయ, శ్వేతకోలవరాహాయ"** అను నామములకు సంబంధించినవి.

**శ్రుత్వా తు తచ్ఛాబరవాక్య మేష వల్మీక మేత న్న బిభేద భీతః ।**
**అథాభ్యషించ త్స త మేవ భక్త్యా గోపాహృతైః క్షీరఘటై రనేకైః ॥**

**స తత్ర వాచాం మనసా మభూమిం దదర్శ............**
**శాంతాకారం శాశ్వతం శ్రీనివాసం సేవ్యం దేవై ర్వాసుదేవం దదర్శ ।**
(బ్రహ్మాండ - 9-10నుండి11)

ఈ శ్లోకములు **"నీలధేనుపయోధారాసేకదేహోద్భవాయ"** అను తిరునామమునందు అనుసంధింపబడినవి.

శ్రీ భగవాన్ - **ఓ మిత్యుక్త్వాథ పరం ప్రాహ వాక్యం**
**మద్భక్త స్త్వం నాస్తి తుల్య స్త్వయాన్యః ।**
**సంతుష్టోఽహం మత్సఖిత్వం ప్రదాస్యే**
**ఇత్యూచివాన్ మాం సుహృదం భక్తవశ్యమ్ ॥**
**ఇత్యూచివాన్ మాధవో రాజపుత్రం భూయః ప్రాహ స్మేరవక్త్రారవిందః ॥**
(బ్రహ్మాండ - 9-27నుండి28)

అను శ్లోకములు **"చోళపుత్రప్రియాయ"** అను తిరునామమునందు అనుసంధేయములు.

ఈ చరిత్రకు సంబంధించిన కొన్ని భాగములు దీనికి పూర్వమే కొన్ని నామముల వ్యాఖ్యలో ప్రస్తావింపబడినది.

(90) **ఓమ్ సుధర్మిణీసుచైతన్యప్రదాత్రే శ్రీవేంకటేశాయ నమః**
(సుధర్మిణి అనెడి స్త్రీకి ప్రాణములను అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో చోళరాజు కుమారుడు చక్రవర్తియొక్క చరిత్ర (బ్రహ్మాండ పురాణములో) తెలుపబడినది. ఆ పురాణములో దానికి పిమ్మట కృష్ణశర్మ అనెడి బ్రాహ్మణుని యొక్క, అతని భార్య అగు సుధర్మిణియొక్క చరిత్ర చెప్పబడుచున్నది. ఈ తిరునామములో అ సుధర్మిణియొక్క చరిత్ర వర్ణింపబడుచున్నది.

పూర్వము తెల్పినట్లు చక్రవర్తి మహారాజు శ్రీనివాసుని బ్రహ్మోత్సవమును జరిపిన, పిమ్మట ఒకనాడు కృష్ణశర్మ అనెడి బ్రాహ్మణుడు తన భార్యతో, చిన్న బిడ్డలతో కలసి ప్రభువును చూచుటకు వచ్చెను. ప్రభువు క్రమానుసారముగా ఆ బ్రాహ్మణునకు ఉపచారములను చేసి, అతడు వచ్చిన కారణమునుగూర్చి ప్రశ్నించెను. బ్రాహ్మణుడపుడు తాను దక్షిణసముద్ర తీరములోనున్న చంద్రపురి అనెడి ఊరిలో నివసించు కూర్ముడు అను బ్రాహ్మణుని కుమారుడనని, తన పేరు కృష్ణశర్మ అని, మూడునెలలకు ముందు ప్రసవించిన శిశువుతో, సుధర్మణి అనెడి తన భార్యనుకూడ పిలుచు కొనివచ్చినట్లును, ఇపుడు కాశీక్షేత్రమునకు పోయిరావలయునని అభిప్రాయపడుటచే మిక్కిలి దుర్బల అగు తన భార్యను, బాలుని తన వెంట తీసికొని పోవుటకు వీలులేకుండుటచే, తాను తిరిగి వచ్చువరకు వారిరువురను మహారాజు సంరక్షణలో విడచిపోవలయునని ఉద్దేశ్యమనియు, తన ప్రార్థనను అంగీకరింపవలెననియు ప్రార్థించెను. ప్రభువును ఆ ప్రార్థనను అంగీకరించి,



కృష్ణశర్మను కాశికిపోయి రమ్మనిపంపెను. అతని భార్య అగు సుధర్మణికి ప్రత్యేకముగా ఒక గృహమును అమర్చి ఇచ్చుటయేకాక, ఆఱునెలలకు సరిపడు ఆహారధాన్యములను ఇచ్చి, ఆ ఇంటిని వదలి ఆమెను బయటకు రావలదని ఆజ్ఞాపించి, ఆ ఇంటిలో ఆమె తన కుమారునితో ఉండునట్లు చేసెను. పిమ్మట ప్రభువు రాజ్యకార్యములందు ఆసక్తుడగుటవలన ఆ సుధర్మిణి గూర్చి పూర్తిగా మఱచిపోయెను. పలు నెలలకు పిమ్మట కృష్ణశర్మ కాశి నుండి తిరిగివచ్చి, రాజును తన భార్యను, కుమారుని తిరిగి అప్పగింపుమనెను. అపుడు ఆ బ్రాహ్మణస్త్రీ స్మరణ రాజుకు కల్గి, మిక్కిలి భయపడెను. ఆఱు మాసములకు తగిన ఆహారపదార్థములను సమకూర్చి ఇచ్చిన పిదప, ఆమెను గూర్చి పూర్తిగా మఱచిపోయితినే! ఇంటిని విడచి బయటకు రారాదనియు ఆజ్ఞాపించితిని. గొప్పపతివ్రత అగు ఆమె ఆహారము కొఱకు ఏమి చేసినదియో! ఏమో! ఆఱు మాసములకు పైన ఎన్నో నెలలు గడచినవే! అని చాల బాధపడి, తన అంతఃపురము నుండి ఒక సేవకుని పంపి, ఆ సుధర్మిణిని ఉంచిన ఇంటిలో ఆమె, ఆమె బిడ్డ ఎట్లున్నారో చూచి రమ్మని పంపెను. అతడును అచటికి పోయి చూచి వచ్చి, ఆమెయు, ఆమె బిడ్డయు, మరణించి చాలకాలమైనదనియు, వారి శరీరములు ఎండిపోయి, ఎముకలు మాత్రము మిగిలియున్నవినియు తెలిపెను. దీనిని వినిన రాజు మిక్కిలి దుఃఖితుడై, తన అపరాధమునకు మిక్కిలి నొచ్చుకొని, ఈ విషయమును బయటపెట్టకుండ, కృష్ణశర్మను చూచి - "ఓ బ్రాహ్మణోత్తమా! నీ భార్య తన బిడ్డతో పాటు నా అనుమతినిపొంది ఇపుడే తిరుమలకు యాత్రగా సేవింపబోయినది. రేపు ఆమెను తిరిగి రప్పించి, నీకు వారిని అప్పగించెదను. ఒకనాడు ఇచటనే ఉండి శ్రమను తీర్చుకొనుము" అని పల్కెను. పిమ్మట రాజు అంతులేని దుఃఖముతో ఒంటరిగా వేంకటాచలమును చేరి, ఏకాంతసమయమున భగవత్సన్నిధిలో స్వామిని సాష్టాంగముగా నమస్కరించి, "హే ప్రభూ! నా మూఢత్వము వలన, రాజ్యగర్వమువలన పతివ్రత సుధర్మిణి, ఆమె బిడ్డ చనిపోయి చాలదినములు అయినది. ఇపుడా బ్రాహ్మణుడు తిరిగివచ్చి తన భార్యాబిడ్డలను ఇమ్మని అడుగుచున్నాడు. నేను ధైర్యముగా, ఈ తిరుమలకు నిన్ను సేవించుటకు పోయినట్లు, రేపు వారిని రప్పించి అప్పగింతుననియు చెప్పివచ్చితిని. ఈ ఘోరాపదనుండి నన్ను నీవే రక్షింపవలెను. నీవుతప్ప నాకు వేరు గతిలేదు. వేరెవ్వరును నన్ను ఈ ఆపదనుండి ఉద్ధరింపలేరు" అని మిక్కిలి బాధతో విన్నవించి, భగవానుని శరణు వేడెను. అపుడు భగవానుడు ప్రసన్నుడై, ఆ ప్రభువుతో ప్రేమపూర్వకముగా - "రాజా! నీవు భయపడవలదు. ఆ స్త్రీ, ఆమె బిడ్డయు తిరిగి బ్రతుకుటకు నేను దారి చెప్పెదను వినుము. కృష్ణశర్మ కాశికి పోవునపుడు నన్ను సేవించి, నా వద్ద అనుజ్ఞను పొంది పోయెను. అతని భార్యకూడ గొప్ప పతివ్రత. నాపట్ల గొప్ప భక్తిని కలిగినది. అందుచే ఆమెయొక్క, ఆమె కుమారునియొక్క ప్రాణములింకను యముని చేరలేదు. నా శరీరమునందే ఉంచుకొంటిని" అని పల్కి, రాజును సమాధాన పఱచి, విష్వక్సేనుని చూచి, "విష్వక్సేనా! ఈ సన్నిధికి ఈశాన్యదిక్కులో

"అస్థికూట" మను పుణ్యతీర్థము కలదు. దానినుండి తీర్థమును తీసికొనివచ్చి, సుధర్మిణి యొక్క, ఆమె కుమారునియొక్క శరీరముపై అభిషేకమును చేయుము. వెంటనే, ఆమెయు ఆమె సుతుడును నిద్రనుండి లేచినవారివలె లేచివత్తురు" అని ఆజ్ఞాపించెను. విష్వక్సేనుడును భగవానుని ఆజ్ఞను అనుసరించి, ఆ తీర్థమును వారిపై అభిషేకించెను. వెంటనే బాలుడు, సుధర్మిణియును తిరిగి బ్రతికిరి. పిమ్మట రాజును పిలచి, "ఓ రాజా! నీ కొండ మహిమను చూచితివి కదా! ఈ పర్వతప్రభావము పూర్తిగా సనకాది యోగులు, బ్రహ్మాదిదేవతలునుకూడ తెలియలేరు. ఎవడు దేనిని మనస్సున కోరుకున్నను, ఈ పర్వతప్రభావముచే అది అంతయు అతనికి లభించును - అని పల్కి బ్రాహ్మణుని, సుధర్మిణిని పిలచి, నీకేమి వరము కావలయునో అడుగుమనెను. ఆమె "ప్రభూ! నాకు ఎల్లప్పుడు నీ పాదములందు అచంచలమైన భక్తి నిలచియుండవలెను. ఇదియే నా అభిమతము" అని ప్రార్థించినది. భగవానుడామెకు ఆ వరమునిచ్చెను. ఈ ఆశ్చర్యమును దర్శించుకై బ్రహ్మ, రుద్రుడు, సనకాది మహర్షులు మొదలగు అందఱు ఆ పర్వతమునకు వచ్చి చేరిరి. అందఱు భగవానుని స్తుతించి, ఆ కొండను పొగడి వెడలిరి. ఇది సుధర్మిణీచరిత్రము. ఈ కథయే వ్యక్తుల పేర్లలో కొంచెము మార్పుతో, కథలో కించత్ వ్యత్యానముతో భవిష్యోత్తరపురాణములో విస్తృతముగా వర్ణింపబడినది. కాని, ఈ తిరునామములో అనుసంధింపతగిన కథ బ్రహ్మాండపురాణాంతర్గతము. ఇచట ముఖ్యముగా అనుసంధేయములగు శ్లోకములివి -

శ్రీభగవాన్ - **ఇతి ఈశానదిగ్భాగే త్వస్థికూటాభిధం శుభమ్ ।**
**తీర్థ మస్తి తత స్తోయం సమాహృత్య సుపావనమ్ ॥**
**సుధర్మిణ్యాః సుతస్యాపి శరీర మభిషేచయ ।**
**సపుత్రాసౌ ప్రసుప్తేవ తత ఉత్థాస్యతి ధ్రువమ్ ॥** ఇతి
**విష్వక్సేన స్తథేత్యుక్త్వా తోయ మాహృత్య తీర్థతః ।**
**సుధర్మిణ్యాః శరీరం తదభ్యషించత్ సుతస్య చ ॥**
**ఉత్థితా ససుతా సాధ్వీ ద్విజభార్యా సుధర్మిణీ ।**
(బ్రహ్మాండ - 10-39నుండి41)

(91) **ఓమ్ మధుఘాతినే శ్రీవేంకటేశాయ నమః**
(మధువనెడి అసురుని సంహరించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందునామములో సుధర్మిణీచరిత్రద్వారా భగవానుని భక్తపరాధీనత్వము అనెడి మహాగుణము స్తుతింపబడినది. చక్రవర్తి అనెడి ప్రభువుయొక్క భక్తికి, సుధర్మిణి యొక్క భక్తికిని భగవానుడు వశుడైన విషయము అచట ప్రస్తుతింపబడినది. అట్లే, భగవానుని ఆశ్రయించిన చతుర్ముఖుని దుఃఖములను పోగొట్టుటకై స్వామి మీనరూపియై, పాతాళమును చేరి **"మధు"**వనెడి అసురుని వధించి, వేదములను తిరిగి తీసికొనివచ్చిన



చరిత్ర ఈ తిరునామములో తెలుపబడుచున్నది. ఇదియేకాక, పూర్వము తెలిపిన సుధర్మిణి చరిత్రను తెలుపబోయిన బ్రహ్మాండపురాణము 10వ అధ్యాయములో భగవానుడు చక్రవర్తి అనెడి ప్రభువును చూచి పల్కు రెండు చోట్ల భగవానునకు **"మధుసూదన"** అను విశేషణము ప్రయోగింపబడినది. కావున, ఆ చరిత్రను పల్కునపుడు భగవానుని భక్తపరాధీనతకు చిహ్నముగా వేఱొక వృత్తాంతము జ్ఞాపకమునకు వచ్చునట్లు మధుసూదనపదము అచట ఉండుటచే, అదియే 91వ నామముగా ఏర్పడినది అనికూడ చెప్పవచ్చును.

ఇట్లే, భవిష్యోత్తరపురాణములో ఈ అస్థికూటతీర్థమాహాత్మ్యమును తెలుపు ప్రకరణములోకూడ భగవానును మధుసూదనుడనెడి విశేషణమే కలదు. అందుచే ముందు తిరునామమునకు పిమ్మట ఈ తిరునామము ఏర్పడినది. ఆ శ్లోకములు ఇట్లున్నది.

**ఇతి ప్రణమ్య దేవేశం స్థితి స్తూష్ణీం నరోత్తమః ।**
**స్వాంత్వయన్మ ధరౌర్వాక్యైరువాచ మధుసూదనః ॥**
(బ్రహ్మాండ - 10-33)
**అథ రాజాన మాహూయ ప్రోవాచ మధుసూదనః ।**
(బ్రహ్మాండ - 10-42)
**తత్ర కించి ద్దేవఖాత మాసాద్య మధుసూదనః ।**
(భవిష్యోత్తర - 14-48)

(92) **ఓమ్ కృష్ణాఖ్యవిప్రవేదాంతదేశికత్వప్రదాయ శ్రీవేంకటేశాయ నమః**
(కృష్ణశర్మ అనెడి బ్రాహ్మణునకు వేదాంతాచార్యత్వమనెడి పదవిని అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

91వది అగు పూర్వనామము ప్రసంగాత్ ప్రాప్తము. దానికి ముందున్న **''సుధర్మిణీసుచైతన్యప్రదాత్రే''** అను తిరునామముతో దీనికి సంగతి. ఆ తిరునామవ్యాఖ్యానములో ఈ కృష్ణశర్మయొక్క భార్య సుధర్మిణికి ప్రాణములను ఇచ్చి, ఆమె కోరిన వరమును భగవానుడు అనుగ్రహించినట్లు తెలుపబడినది. ఆ సందర్భములోనే సుధర్మిణియొక్క భర్త అగు కృష్ణశర్మకు ఒక వరమును భగవానుడు అనుగ్రహించెను. ఆ విషయ మీ తిరునామములో తెలుపబడుచున్నది.

భగవానుడు సుధర్మిణికి ప్రాణదానముచేసి, ఆమె శిశువునుకూడ కాపాడినపుడు చతుర్ముఖుడు, రుద్రుడు మున్నగు దేవతలను ఆ దృశ్యమును చూడవలెనని వేంకటాచలమునకు వచ్చిరని పూర్వోక్తమే కదా! అపుడు భగవానుని కృష్ణశర్మయు విశేషముగా స్తోత్రముచేసి, నమస్కరించెను. ఆ సమయములో భగవానుడు చక్రవర్తిని పిలచి - "రాజా! ఈ కృష్ణశర్మ అను బ్రాహ్మణునకు సాటిగలవాడెవడును ఈ లోకమున లేదు. నాపట్ల భక్తిని కల్గి ఉండుటలో, శాస్త్రోక్తములగు నియమములను యథాతథముగా అనుష్ఠించుటలో ఇతడు చాల నిపుణుడు. ఇతడు రాబోవు జన్మలో వేదాంతార్థములను

లోకమున విశేషముగా ప్రచారము చేసి, ఆ జన్మ చివర సాయాజ్యమనబడు మోక్షమును పొందగలడు" అని పల్కుచు కృష్ణశర్మను అనుగ్రహించెను. అచటి శ్లోకములీ క్రింది విధముగానున్నవి.

**కృష్ణశర్మా తు సంతుష్టో విస్మిత శ్చ మహామునే ।**
**ప్రణమ్య స్తోత్రయామాస దేవదేవం రమాపతిమ్ ॥**
**దేవదేవో నృపం ప్రాహ న చాస్య సదృశో భువి ।**
**విప్రస్య మయి భక్తస్య తథైవ నియతాత్మనః ॥**
**అసౌ జన్మాంతరే రాజన్! త్రయ్యంతార్థప్రవర్తకః ।**
**భవిష్యతి తదంతే చ మస్సాయుజ్య మవాప్స్యతి ॥**
(బ్రహ్మాండ - 10-48నుండి50)

ఇచట పెద్దలు తెలుపు ఐతిహ్య మీ విధముగా నున్నది.

ఈ కృష్ణశర్మ అనెడి బ్రాహ్మణుడే, పిమ్మట కల్గిన జన్మలో తూప్పుల్ అగ్రహారములో వేదాంతదేశికులుగా అవతరించెను. శ్రీనివాస భగవానుడు అనుగ్రహించినట్లు భగవద్రామానుజ సిద్ధాంతమును లోకమున పలువిధములుగా ప్రచారము చేసిన అసాధారణసామర్థ్యము ఈ దేశికులకు కలదు. భగవానుని వాక్యానుసారము ఆ అవతారము చివర భగవత్సాయుజ్యమును పొందెను అనుటలోకూడ సందేహములేదు. శ్రీనివాసభగవానుడు "వేదాంతార్థములను ప్రవర్తింపజేయగలడు" అని సాధారణముగా అపుడు పల్కినను, దేశికావతారమేర్పడునపుడు తనయొక్క, తన ఘంటయొక్క అంశలను ఆ అవతారములో ఆవేశించునట్లు చేసి, భగవద్రామానుజప్రవర్తితమైన సంప్రదాయమునే ఈ దేశికులు మూలమున ప్రవర్తింపజేయుటచే శ్రీనివాసభగవానునకు భగవద్రామానుజ ప్రవర్తితమగు సిద్ధాంతమే వాస్తవమైన వేదాంతార్థమని అభిప్రాయమనుట సుస్పష్టమగుచున్నది. అందుచేతనే (తన మతమునకు శ్రీనివాసుని ఆదరణ లభింపబోవుటచే) శ్రీభాష్యమును రచింప ప్రారంభించిన భగవద్రామానుజులు **"శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే, భవితు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా"** అనుచు ఈ శ్రీనివాస మూర్తినే పరదైవముగా భావించి మంగళ శ్లోకమును రచించిరి. దేశికులు ప్రవర్తిల్లజేసిన వేదాంతార్థమేమి? అనగా, వీరు నూటికి పైగా సంస్కృత, ప్రాకృత, మణిప్రవాళ, ద్రావిడభాషలలో గ్రంథములను రచించిరి. కావ్యరూపమున నాటకరూపమున స్తోత్రరూపమున, వేదాంతగ్రంథముల రూపమున, స్వతంత్ర గ్రంథముల రూపమున, ఇతరకృతులకు వ్యాఖ్యల రూపమున, తమిళ ప్రబంధముల రూపమున, రహస్యగ్రంథముల రూపమున రచింపబడిన. ఇవి భగవద్రామానుజుల వారిచే ప్రవర్తింపజేయబడినవి, వారికి ముందే దివ్యసూరులనబడు ఆళ్వార్లచే తెలుపబడినవి, తదనంతరాచార్యులచే వృద్ధిచేయబడినవి అగు వేదాంతరహస్యార్థములను బోధించుచున్నది. ముఖ్యముగా, శ్రీనివాసభగవానుడు



అర్చాసమాధిలో సాక్షాత్తుగా భాషింపకున్నను, తన అభిప్రాయములను తన శ్రీహస్తముల విన్యాసవిశేషములతో, ఆనాడు అర్జునుని ఉద్దేశించి గీత అనెడి వేదాంత శాస్త్రమున పల్కిన **"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"** అనెడి శరణాగతి శాస్త్రమును వివరించుటచే, ఆ శరణాగతి అనెడి హితమే భగవానుని చేరుటకు గొప్ప ఉపాయము అనుటను చాల హృద్యముగా తమ గ్రంథములలో స్థాపించిరి. ఈ దేశికులు అవతరించియుంకపోయినచో, శ్రీరామాయణకాలమునుండి ప్రసిద్ధిగాంచిన ఈ శరణాగతి అనెడి శాస్త్రార్థము దివ్యసూరులచే, భగవద్రామానుజాది పూర్వాచార్యులచే అనుష్ఠింపబడినను, పలు చిక్కులకు, సమస్యలకు లోనై, అంతరించియుండుననుటలో ఏ సందేహమును లేదు. బ్రాహ్మణచండాల విభాగములేకుండ అందఱు ఉజ్జీవించురీతిలో ఉపకరించు ఈ శరణాగతి అనెడి వేదాంతార్థమును ముఖ్యముగా దేశికులరూపమున స్థాపింపబోవుటను ఉద్దేశించియే అపుడు శ్రీనివాసభగవానుడు కృష్ణశర్మను

**అసౌ జన్మాంతరే రాజన్! త్రయ్యంతార్థప్రవర్తకః ।**
**భవిష్యతి తదంతే చ మత్సాయుజ్య మవాప్స్యతి ॥**

అని అనుగ్రహించిరి. ఇట్లు కృష్ణశర్మ అనెడి జన్మలో శ్రీనివాసునిచే అనుగ్రహింపబడిన వేదాంతాచార్యులనెడి బిరుదమును దేశికులుగా జన్మించినపుడు - **"విశ్వస్మిన్ నామరూపాణ్యనువిహితవతా తేన దేవేన దత్తాం వేదాంతాచార్యసంజ్ఞా మవహిత బహువిత్సార్థ మన్వర్థయామి"** అనురీతిలో పలు సందర్భములలో దేశికులు తామే పల్కునట్లు, అనుగ్రహించెను. పూర్వము సంభవించిన రహస్యము శ్రీరంగనాథునకు తెలిసిననదికదా! కావున, దేశికులద్వారా శరణాగతిశాస్త్రమును లోకమున స్థాపించి, అనుగ్రహించిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను - అని ఈ తిరునామముయొక్క భావము

(94) **ఓమ్ వరాహాచలనాథాయ శ్రీవేంకటేశాయ నమః**

(వరాహచలమనబడు వేంకటాచలమునకు అధిపతియగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందు తిరునామములో చెప్పబడిన కృష్ణశర్మయొక్క పత్నియగు సుధర్మిణి అనెడి స్త్రీ ఈ వేంకటాచలములోని **"అస్థికూటమ్"** అను పుణ్యతీర్థ మహిమచే తిరిగి బ్రతికినదని 91వ తిరునామములో తెలుపబడినవి. ఇట్టి పలు పుణ్య తీర్థములను ఈ పర్వతముపై కలవు. ఆ తీర్థములకు ఇట్టి మహిమ ఏర్పడుటకుగల కారణము అవి ఈ కొండలో నుండుటయే. కావున ఈ పర్వతముయొక్క మహిమ ఈ తిరునామములో అనుసంధింపబడుచున్నది.

భగవానుడు వరాహరూపము నెత్తి, ఈ కల్పారంభములో భూమిని

పాతాళమునుండి తీసికొనివచ్చి, దాని స్థానములో నిలిపెను. పిమ్మట తాను భక్తులను అనుగ్రహించుకై ఈ భూలోకమున ఈ కల్పము చివరవరకు నివసింపగోరి, వైకుంఠంలోకమునుండి తన క్రీడాపర్వతమును గరుడుని ద్వారా రప్పించి, ఈసువర్ణముఖీ నదీతీరమున ప్రతిష్ఠింపజేసెను. ఇదియే ఈనాడు వేంకటాచలముగా వెలుగొందుచున్నది. భగవానుడపుడు దాల్చిన వరాహరూపముతోనే ఈనాటికిని ఈ పర్వతముపై భక్తులకు సేవను అనుగ్రహించుచున్నాడు అందుచే, మొదట వరాహస్వామిచే స్థాపించిన క్షేత్రమగుటచే, ఈ పర్వతమునకు వరాహచలమని ప్రసిద్ధి కల్గినది. పిమ్మట శ్రీనివాసుడనెడి వేఙొకరూపములో ఆ భగవానుడు ఈ కొండపై ఆ వరాహస్వామి అనుమతితో సేవను అనుగ్రహించుచున్నాడు. ఈ విషయములన్నియు వరాహపురాణములో శ్రీవేంకటాచలమాహాత్మ్యమును వ్యక్తీకరించు ప్రకరణములో కలవు. ఇట్లు అప్రాకృతమైనది సాక్షాద్వైకుంఠమునుండి తీసికొనిరాబడినదగుటచే ఈ పర్వతముయొక్క మహిమ అంతులేనిది. అందుచే ఇందున్న పుణ్యతీర్థములు అన్నియు విశేషమహిమను కల్గియున్నవి. ఇట్టి వరాహచలమునకు అధిపతియైన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను – అని ఈ తిరునామభావము. ఇచటి అనుసంధేయశ్లోకములు. ఇవి –

**ఆస్థాయ శ్వేతపోత్రిత్వమ్ ఉజ్జహార జరాం యదా ।**
**తదైవానాయ్య వైకుంఠాత్ అచలం గరుడేన వై ॥**
**కల్పాదౌ వేద భగవాన్ లీలారసమహోదధిః ।**
**విహరన్ రమయా సార్థం దరీనిర్ఘరసానుషు ॥**
**ప్రకాశశ్చాప్రకాశ శ్చ తిష్ఠత్యేవ సదా గిరౌ ।**
**యావత్కల్పం వసత్యేష ప్రోక్తం చ పరమేష్ఠినా ॥**
**....................వరాహాద్రిం వరాహక్షేత్రలక్ష్మతః ।**
**......................................**
**యతః కదాచి ద్దేవానాం శ్రీనివాస ఇహాబభౌ ।**
**శ్రీనివాసగిరిం ప్రాహుః తస్మా దేనం దివౌకసః ॥**
(వరాహ – 36అధ్యాయే)

(94) **ఓమ్ బలభద్రాయ శ్రీవేంకటేశాయ నమః**
(బలరామస్వరూపియైన శ్రీవేంకటేశుని శరణుపొందుచున్నాను)

పుణ్యతీర్థముల మహిమను స్తుతించు ఈ ప్రకరణములో బలరాముని స్మరించుట చాల ఉచితము. తీర్థయాత్ర చేసి, పుణ్యతీర్థములలో నీరాడుట అనునది ఉత్తమమైన ధర్మము అనునది 14విధములైన కర్మయోగములో ఒకటిగా భగవదవతారరూపియైన శ్రీకృష్ణుడు పేర్కొనెను. బలరాముడు ఆదిశేషుని అవతారమనుట ప్రసిద్ధము. ఆదిశేషుడు సంకర్షణుడను వ్యూహావతారముయొక్క అంశ అని, ఆ



వ్యూహావతారములో **"భగవాన్"** అనెడి శబ్దముయొక్క అర్థమగు జ్ఞాన, బల, ఐశ్వర్య, వీర్య, శక్తి, తేజస్సులనెడి గుణములలో జ్ఞానము, బలము అను మొదటి రెండును ప్రధానముగా ప్రకాశించుచున్నవి అనియును ఆగమములలో చెప్పబడినవి. అందుచే ఆ రెండు గుణములును ఆదిశేషునివద్ద, బలరామునివద్ద ప్రకాశించుటలో లోపములేదు. అందుచేతనే బలరాముడును పేరు ఈ అవతారమునకు తిరునామము. శ్రీనివాసుడు ఈ బలరామునిగా ఇచట అనుసంధింపబడుచున్నాడు. ఇందలి విశేషమును శ్రీదేశికులు దయాశతకములో –

**కృపే పరవత స్త్వయా వృషగిరీశితుః క్రీడితం**
**జగద్ధిత మశేషతః తదిద మద్య మర్థాప్యతే ।**
**మదచ్ఛలపరిచ్యుతప్రణతదుష్కృతప్రేక్షితైః**
**హతప్రబలదానవైః హలధరస్య హేలాశతైః ॥** (దయా –88)

అనెడి శ్లోకముద్వారా వ్యక్తము చేసిరి. అనగా – శ్రీనివాసుని లీలారూపములగు వ్యాపారములన్నియును జగద్ధితమును కల్గించునవియే. ఈ వాస్తవమును బలరామావతారముతో నిరూపింపవచ్చును. ఆ అవతారములో సర్వేశ్వరునిచే (కర్మకృతము కాకుండ) అనుష్ఠింపబడిన మద్యపానముచే ఆరోపితమగు మదము అనెడి వ్యాజముతో తనను ఆశ్రయించిన దుర్యోధనాదుల దుష్కృతములుకూడ ఆ స్వామి కన్నులకు కన్పడలేదు. కావున మహాభగవద్భక్తులగు పాండవుల విరోధులగు దుర్యోధనాదుల అపరాధములనుకూడ, వారు తనను ఆశ్రయించినవారు అనెడి కారణముచే ఉపేక్షించెను. అట్లే, తనను ఆశ్రయింపని కొందఱు అసురులను వధించి, తద్ద్వారా వారిని **(నిహతరక్షితానాం హతమ్)** అనెడి రీతిలో రక్షించిరి. కావున, భగవానుని అన్ని లీలలను జగమునకు హితకరములుగానే పర్యవసించుచున్నవి అనుటను ఈ అవతారమున గమనింపవచ్చును. ఆవిధముగానే, శ్రీనివాసుడు ఎంత బలమైన దుష్కృతియైనవానినికూడ, అతడు తనను వేడినచో అతని దుష్కృతిని గణింపకుండ, అతడు కోరిన ఫలమును ఇచ్చుటచే శ్రీనివాసుని బలరామునిగా అనుసంధించుటలో అధికమైన ఔచిత్యము కలదు. ఇట్టి బలరామునివలె అందఱికిని హితమును కల్గించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను అని ఈ నామభావము. శ్రీవేంకటాచలమాహాత్మ్యములోకూడ శ్రీనివాసుని దశావతారరూపిగా స్తుతించు సందర్భములలో **(బలభద్రోత్థకృష్ణ స్త్వమ్)** అనుచు బలరామునిగా తెలుపబడినాడు.

(95) **ఓమ్ త్రివిక్రమాయ శ్రీవేంకటేశాయ నమః**
(త్రివిక్రమరూపియైన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పుణ్యతీర్థముల ప్రస్తావన సమయములో బలరామస్మరణకు పిదప, త్రివిక్రముని స్మరణమును తగినదియే. త్రివిక్రమావతారములో భగవానుని శ్రీపాదము సత్యలోకము వరకు వ్యాపించినపుడు చతుర్ముఖుడు తన కమండలులోని తీర్థముతో

ఆపాదమునకు పాద్యమును సమర్పింపదలచి, ధర్మదేవతను తీర్థరూపముగా వచ్చునట్లు కోరెను. ధర్మదేవతకూడ జలరూపమును పొంది వచ్చినను, ఆ జలము చాలకపోవుటచే భగవానుని పాదమే అండకటాహమును బ్రద్దలు చేసికొని, బయటగల శుద్ధజలమగు సమిష్టితీర్థమును రప్పింపగా, ఆ తీర్థముతో పాద్యమును సమర్పించెననియు, అదియే గంగానదిగా పరిణమించెననియు పురాణకథనము.

కావున, పుణ్యతీర్థప్రభావమును వ్యక్తీకరించు బలరామునకు, ఒక ఉత్తమమైన తీర్థమును సృష్టించిన త్రివిక్రమునకును ఒక విధమైన సంబంధము కలదు. దీనినిబట్టియే గోదాదేవియు తిరుప్పావైలో **"అమ్బరమే"** అనెడి పాశురములో **"అమ్బఱుమూడఱుత్తోజ్గి ఉలకళన్ద ఉమ్బర్‌కోమానే"** అని బలరాముని, త్రివిక్రముని ఒకటిగా కలిపి కీర్తించిరి. (**"ఉమ్బర్ కోమాన్"** – దేవాధిరాజు అగు కృష్ణునకును గొప్పవాడై, జ్యేష్ఠుడై అవతరించిన బలదేవుడు – అని కొందఱు పెద్దల వివరణము)

కోరినవాడు – కోరనివాడు, ఉన్నతుడు – నీచుడు, అను మొదలుగా గల వ్యత్యాసము లేమియులేకుండ ముల్లోకములను తన శ్రీపాదములతో స్పృశించి, తన ముద్రను ముద్రించి, అది అంతయు తన సొత్తు అని తెలిపిన గొప్పతనము త్రివిక్రమావతారమునకు ప్రత్యేకమైనది. ఈ కారణముచే వేదములలో పలు చోట్ల ఈ మహనీయమైన అవతారము పొగడబడినది. దీనినే శ్రీదేశికులు దయాశతకములో ఇట్లు వెలిబుచ్చిరి –

**అశేషవిశేషతః త్రిజగదంజనాద్రీశితుః**
**చరాచర మచీచరః చరణపంకజేనాంకితమ్ ।**

అట్లే, ఈ వేంకటేశ్వరుని రూపమున అర్చావతారమునందుకూడ ఏవిధమైన భేదము లేకుండ అందఱు జనులను కాచునట్టి విశిష్టతను కల్గినవాడుగుటచే ఈ శ్రీనివాసమూర్తిని త్రివిక్రమునిగా అనుసంధించుట మిక్కిలి తగినది. ఈ అర్థమును అనుసంధించియే ఈ నామావళిలోకూడ **"త్రివిక్రమాయ శ్రీవేంకటేశాయ నమః"** అని అనుసంధింపబడుచున్నది.

(94) **ఓమ్ మహతే వేంకటేశాయ నమః**

(మిక్కిలి గొప్పవాడగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో అనుసంధింపబడిన త్రివిక్రమావతారముయొక్క మహిమ ఇచట అనుసంధింపబడినది. **"మహాన్"** అనగా చాల గొప్పవాడు – అని అర్థము. భగవానుని దివ్యమంగళవిగ్రహములలో త్రివిక్రముని రూపము మిక్కిలి గొప్పది. ఈ తిరుమేనిని పంచాయుధములతో పరమసుందరముగా నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళ్ళి ప్రబంధములో ఈ క్రింది విధముగా సుశ్లోకించిరి.



**ఆళ్ళిఎళ్ళచ్చజ్గమ్ విల్లుమొళ్ళ**
**దిశైవాళ్ళి యెళ్ళ త్తణ్డమ్ వాళుమెళ్ళ**
**అన్డమ్ మోళ్ళి ఎళ్ళ ముడిపాద మెళ్ళ**
**అప్పన్ ఊళ్ళిఎళ్ళ ఉలకమ్ కొణ్డవాతే**

శ్రీవేంకటేశ్వరుడును ఈ విధముగా పంచాయుధములను కల్గి గొప్పరూపముతో సేవను అనుగ్రహించుట లోకప్రసిద్ధము. ఇది తిరుమేనియందున్న మహత్వానుభవము. అట్లే, దివ్యాత్మస్వరూపములోనున్న మహత్వముకూడా ఇచట అనుసంధేయము. త్రివిక్రమావతారములో దివ్యాత్మస్వరూపమునకు తగినట్లు అనుసంధింప తగిన మహత్వము ఏది? అనినచో, భగవానుడు పరమదయతో ఏవిధమైన భేదము చూపకుండ సర్వచరాచరములను కాపాడుటయే. దయ అనెడి భగవానుని (దివ్యాత్మ) గుణమే ఇచట **"మహతే"** అని పదముద్వారా వివక్షితమనునది పరమతాత్పర్యము.

ఇదియేకాక, సాధారణమగు భగవానుని మహత్వమును ఇచట అనుసంధింపవచ్చును. అపుడు ఈ మహత్ పదము బ్రహ్మశబ్దమునకు సమమై, భగవానుని స్వరూపముయొక్క మహత్వమును, కల్యాణగుణముల మహత్వమును (ఈ అంశము శ్రీభాష్యములో వివరింపబడినది) చెప్పును. అపుడు **"బ్రహ్మస్వరూపాయ శ్రీవేంకటేశాయ"** అని ఈ తిరునామముయొక్క వివరణము. దీనిని బట్టియే శ్రీభాష్యములోకూడ – **"బ్రహ్మణి శ్రీనివాసే"** అను శ్రీమద్రామానుజులు మంగళశ్లోకము రచించిరి. ఉపనిషత్తులు తెలుపు పరబ్రహ్మము శ్రీనివాసుడే – అని తాత్పర్యము.

(97) **ఓమ్ హృషీకేశాయ శ్రీవేంకటేశాయ నమః**

(సర్వచేతనుల అన్ని ఇంద్రియములను నియమించువాడగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందు నామములో భగవానుని మహత్వము చెప్పబడినది. ఆ ఔన్నత్యమే దాని కారణత్వమును విశదీకరించి, దానిద్వారా ఈ తిరునామమునందుకూడ అనుభవింప బడుచున్నది.

**హృష్యంతి హర్షయంతీతి వా – ఇంద్రియాణి హృషీకాణి** (సంతోషించుచున్నవి, లేక, సంతోషపెట్టుచున్నవి) అను వ్యుత్పత్తి ద్వయము ఇచట గ్రాహ్యము. హృషీకములనగా ఇంద్రియములకు పేరు. అందఱి ఇంద్రియములును ఆయా కార్యములందు అభినివేశమును కల్గియుండుట పరమపురుషుని సంకల్పానుసారముగా ఏర్పడుటవలన అతడు హృషీకేశుడగుచున్నాడు. ఇందుచే అందఱి ప్రవృత్తియు పరమపురుషాధీనమై ఏర్పడుటచే, అతనికి సర్వేశ్వరత్వరూపమైన ఔన్నత్యము సిద్ధించుచున్నది. భగవద్గీతలో ఆరంభమునుండి పలుచోట్ల భగవానునకు ఈ విశేషణము ప్రయోగింపబడినది.

ఇదియేకాక, భగవానుడు చేయు జగత్సృష్టి మొదలగు వ్యాపారములును జ్ఞానము, బలము, వీర్యము మొదలగు కల్యాణగుణములును, హృషీకేశపదమునకు అర్థముగా చెప్పవచ్చునని ఆగమశాస్త్రవచనములు గొని శ్రీదేశికులు తాత్పర్యచంద్రికలో నిష్కరించిరి. అపుడు పరబ్రహ్మకు లక్షణమగు జగత్సృష్ట్యాది వ్యాపారములను చేయువాడు అని ఏర్పడుటచే భగవానుని అద్వితీయమైన పరత్వము ఇచట చక్కగా వివరింపబడినది. ఇట్టి పరత్వము పరబ్రహ్మస్వరూపియైన శ్రీవేంకటేశ్వరునియందు కలదనుటే ఈ తిరునామముయొక్క భావము.

(98) **ఓమ్ అచ్యుతాయ శ్రీవేంకటేశాయ నమః**
(అచ్యుతడనబడు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వపు నామములో భగవానుని పరత్వము అనుభవింపబడినది. ఈ తిరునామములో సౌలభ్యము అనెడి వేఱొక కల్యాణగుణము అనుభవింపబడుచున్నది. మహర్షులు భగవానుని పరత్వమును స్తుతించునపుడు ఎల్లప్పుడును సౌలభ్యమునుకూడ స్తుతించుట అలవాటు. ఇది, భగవానుని పరత్వమును మాత్రము చూచి, చేతనులు వెనుకకు జంకకుండ, అతని సౌలభ్యమును తలచి, దగ్గఱకు వచ్చుటకొఱకే. ఈ రీతిలోనే, ఇచట కూడ శ్రీనివాసుని సౌలభ్యము స్తుతింపబడుచున్నది.

**"ఆశ్రితాన్ న చ్యావయతి అతః చ్యుతోఽస్య నాస్తీతి అచ్యుతశబ్దస్య కాచి న్నిరుక్తిః"** – తనను ఆశ్రయించినవారికి చ్యుతి కలుగనీయకపోవుటచే భగవానుడు అచ్యుతుడనబడుచున్నాడు – అని పైన తెలుపబడిన తాత్పర్యచంద్రికాసూక్తి భావము.

కావున ఏవిధముగానైన తనను ఆశ్రయించినవారు నశింపకుండునట్లు తాను క్రిందకు దిగివచ్చి, వారిని కాపాడుచున్నాడు అనునది ఇచట అనుసంధేయమైన విషయము. భగవానుని ఈ విషయమునే పరమభక్తులగు దివ్యసూరులు అధికముగా అనుసంధించిరి. ఉపనిషత్తుసైతము భగవానుని పరత్వ – సౌలభ్యగుణములనుచేర్చి –

**"అంగుష్ఠమాత్రః పురుషః మధ్య ఆత్మని తిష్ఠతి ।**
**ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే ॥**

అని భగవానుడు ఆశ్రితుల శరీరములో అంతర్యామియైయున్న స్థితిని ఆదరించి పల్కినది. సర్వప్రపంచమునకును ఈశ్వరుడగు భగవానుడు ఆశ్రితవాత్సల్యముతో సర్వదోషములకును స్థానమైన ఆశ్రితుని శరీరము లోప ప్రవేశించి, బొటనవేలు పరిమాణమున నుండును. ఇంతటి దోషమును కల శరీరములో తాను ప్రవేశించియున్నను, ఆ దోషములను చూచి, ఏవగించు కొనుటలేదు. – అనుచు ఈ విధముగా పల్కు ఉపనిషత్తే పైన పేర్కొనిన ఆళ్వార్ల అనుభవమునకు మూలము. శ్రీవేంకటేశ్వరునియందు ఈ ఆశ్రితవాత్సల్యమనెడి గుణము ఎంత బాగుగా ప్రకాశించుచున్నదనునది సర్వలోకవిదితము. కావున ఇక అధికముగా దానిని



వివరింపవలసిన పనిలేదు.

(99) **ఓమ్ నీలాద్రినిలయాయ శ్రీవేంకటేశాయ నమః**
(నీలాద్రి అనబడు వేంకటాచలమునందు వేంచేసియున్న శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో చెప్పబడిన భగవానుని సౌలభ్యగుణము, ఈ తిరునామములో ఒక భక్తుని చరిత్రద్వారా వివరింపబడుచున్నది. నీలుడు అను వానరుడు ఈ పర్వతముపై నిత్యవాసమును చేసెను. అందుచే ఈ పర్వతమునకు నీలగిరి అను పేరు కల్గినది అని –

**నీలస్య వానరేంద్రస్య యస్మా న్నిత్య మవస్థితః ।**
**తస్మా న్నీలగిరిం నామ్నా వదంత్యేనం మహర్షయః ॥**

అనెడి పురాణ శ్లోకముచే ఏర్పడుచున్నది. ఇది తప్ప, నీలుడిచట ఎందులకు నిత్యవాసమును చేసెను అనుటను వివరించు వృత్తాంత మేదియు వేంకటాచలమాహాత్మ్యములో కనుపించుటలేదు.

శ్రీరాముడు, సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు,నీలుడు మొదలగు వానరవీరులతో రావణవధకు ఋష్యమూకపర్వతమునుండి బయలుదేరివచ్చు దారిలో ఈ అంజనాచలములో అంజనాదేవియొక్క కోరికను అనుసరించి, ఆ వానరులతో స్వామి పుష్కరిణీతీరమున కొంచెము కాలము నివసించునట్లు పురాణము తెలుపుచున్నది. ఆ సందర్భములో ఈ పర్వతమును పురాణము నీలాద్రి అని నిర్దేశించుచున్నది. అచటి ఈ శ్లోకములను గమనింపుడు –

**తత్ర రామో మహాతేజా స్సౌమిత్రి ర్మారుతాత్మజః ।**
**సుగ్రీవ శ్చాంగద శ్చైవ జాంబవా న్నీల ఏవ చ ॥**
**చక్రుః స్నానం మహాతీర్థే సర్వత్ర విజయప్రదే ।**
......................................
**తస్మిన్ దివ్యే మహాపుణ్యే వేంకటాద్రౌ వనేచరాః ।**
**పరస్పర మసంబాధం న్యవసన్ సుసుఖం గిరౌ ॥**
..........................................
**నీలమేఘనిభం శ్యామం నీలోత్పలవిలోచనమ్ ।**
**నీలాద్రిశిఖరస్థం తం భజామ్యత్రైవ సుస్థిరమ్ ॥**
(వరాహ – 42-38)

ఇందువలన అందఱు వానరులవలెనే నీలుడును ఈ పర్వతముపై కొంచెము కాలము నివసించినట్లు తెలియుచున్నది. ఇందుచేతనే ఈ పర్వతమునకు నీలాద్రి అని పేరు కల్గినట్లు చెప్పవీలులేదు. కాని, ఇందు కొంచెము కాలము నివసించి, దీని మహిమను

బాగుగా తెలిసిన నీలుడు, రావణసంహారానంతరము రామపట్టాభిషేకము జరిగిన పిమ్మట భగవానుని సాక్షాత్కరింపగోరి ఈ కొండపై మిగిలిన జ్ఞానులవలెనే చిరకాలము తపస్సు చేసి, తత్ఫలముగా స్వామి సాక్షాత్కారమును పొంది, దాని ఫలముగా ఈ కొండకు తన పేరు ఏర్పడునట్లు చేసియుండవలెను, అందుచే ఈ పర్వతమునకు నీలాద్రి అను పేరు కల్గియుండవలెనని ఊహించుటలో ఏవిధమైన తప్పులేదు. అట్లు భగవానుడు వానజాతిలో జన్మించిన నీలునకు కూడ తన పర్వతమును పరిగణింపకుండ సాక్షాత్కారమును అనుగ్రహించుటచే అతని సౌలభ్యగుణము ఇచట ఈ నీలుని చరిత్రతో వివరింపబడినట్లుయినది. దీనివలన ఎవరు తపస్సును చేసినను త్వరలో సిద్ధి కల్గునట్టి మహిమను కల్గినది ఈ పర్వతము – అని ఇచట తెలుపబడినది.

**(100) ఓమ్ క్షీరాబ్ధినాథాయ శ్రీవేంకటేశాయ నమః**

(పాలసముద్రములో పరుండియున్న క్షీరాబ్ధినాథరూపియైన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందునామములో నీలుడనెడి వానరుని చరిత్రద్వారా శ్రీరాముడనెడి విభవావతారము స్మరింపబడినది. ఈ తిరునామములో విభవావతారములకు మూలకందముగా చెప్పబడు వ్యూహావతారము స్మరింపబడుచున్నది. భగవానుని పర, వ్యూహ, విభవ, హార్ద (అంతర్యామి), అర్చావతారములలో పరరూపము వైకుంఠములో నుండును. వ్యూహరూపములలో క్షీరాబ్ధిలోని యోగనిద్రతో వెలుగురూపము ఒకటి. ఈ వ్యూహరూపమే రామకృష్ణాది విభవరూపములకు మూలకారణమని శాస్త్రముల వచనము. ఈ సిద్ధాంతమును తెలుపునట్టి

**ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః ।**
**నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్ ॥**

(పాలసముద్రములో పరుండియుండు శ్రీమన్నారాయణుడే తన నాగపర్యంకమును వీడి, మధురలో శ్రీకృష్ణుడై అవతరించెను) అనెడి శ్లోకము. ప్రపత్తి అనెడి మోక్షోపాయములో అనుసంధింపబడు ద్వయమనెడి మహామంత్రముయొక్క అనుసంధానసమయములో ధ్యానింపవలసిన రూపము ఈ క్షీరాబ్ధినాథుని రూపమే. ఇట్టి వ్యూహరూపములో భగవానుడు క్షీరాబ్ధిలో నివసించుటకు ముఖ్యోద్దేశ్యము ఏమనగా వైకుంఠమునకు పోలేనివారుకూడ తమ కోఱికలను సిద్ధింపచేసికొనుటకు నేరులో భగవానుని దర్శించి, ఆ స్వామి సన్నిధిలో విన్నవించుకొనుటయే. అందువలననే శ్రీకృష్ణావతారమేర్పడుటకుముందు గోరూపమున వచ్చిన భూదేవియు, బ్రహ్మయును, దేవతలును ఈ క్షీరాబ్ధినాథునివద్దకే వచ్చి, తమ కొఱతనుగూర్చి మొఱపెట్టి, ఆ భగవానునివలన సత్ఫలమును పొందిరని భాగవపురాణ కథనము. ఇట్లే, రామావతారమునకూడ దేవతలు క్షీరాబ్ధినాథుని శరణు పొందినని,



భోజరాజకృతరామాయణ చంపువులో వర్ణింపబడినది. కావున సంసారులగు చేతనులు తమ క్లేశములను తీర్చుకొనుటకు క్షీరాబ్ధినాథుని శరణుపొందుట అనునది పూర్వము నుండి అలవాటు అని, కావుననే భగవానుడు ఈ వ్యూహరూపమును దాల్చెననియు సిద్ధించుచున్నది.

ఈ వ్యూహరూపములోనున్న గుణములు అన్నియు మన వేంకటేశ్వరునివద్ద ప్రకాశించుటచే ఆ వేంకటేశుని వ్యూహరూపిగా అనుసంధించుటలో ఏ కొఱతయును లేదు. బద్ధచేతనుల విషయమున మిక్కిలి ఆదరముతో ఈ పర్వతమునందు వేంచేసియుండి, వారి వారి క్లేశములను పోగొట్టి, వారు కోరిన ఫలములను మన వేంకటేశ్వరుడు అనుగ్రహించుట లోకమునకు తెలిసినదియేకదా! బద్ధచేతనులు అని నిర్దేశింపబడిన దేవతలు, మనుష్యులును మొదలగువారు మాత్రమేకాక, నిత్యసూరులుకూడ ఈ పర్వతమునకు వచ్చి, ఈ స్వామిని సేవించి పురుషార్థమును పొందుచున్నారని ఆళ్వార్లు, ఆచార్యులును పలుమార్లు అనుసంధించిరి. మఱియు ద్వయమంత్రములో చెప్పబడు ప్రపత్తియే తన హస్తముద్రతో వివరించు మన వేంకటేశ్వరుడే ఆ మంత్రమునకు ధ్యేయమూర్తియగు క్షీరాబ్ధినాథుడగుటకు తగినవాడు అనుటయును ఇచట తెలియనగును.

**(101) ఓమ్ వైకుంఠాచలవాసినే శ్రీవేంకటేశాయ నమః**

(శ్రీవైకుంఠాచలమనబడు శ్రీవేంకటాచలమందు నిత్యనివాసమును చేయు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందు తిరునామములో వ్యూహావతారము స్మరింపబడినది. ఈ తిరునామములో ఆ వ్యూహమునకును మూలమగు వరవాసుదేవుని స్థానమగు వైకుంఠము స్మరింపబడుచున్నది.

ఈ వేంకటాచలమునుకు వైకుంఠాచలమను పేరు ఏర్పడుటకు పలు కారణములు కలవు. వరాహపురాణములో ముఖ్యముగా చెప్పబడిన కారణమేమి? అనగా, భగవానుడు శ్వేతవరాహరూపమును ఎత్తి, ఈ కల్పారంభములో భూమిని పాతాళమునుండి ఎత్తి, నిలుపుటతో పాటు, ఈ భూమిలోకములోనే ఒకచోట తాను భక్తుల ప్రార్థనను అంగీకరించి, ఈ కల్పాంతమువరకు నివసించవలెనని కోరి, వైకుంఠలోకములోని తన క్రీడాపర్వతమును గరుడుని మూలముగా రప్పించి, ఈసువర్ణముఖీనదీతీరమున స్థాపించి, ఈ కొండపై స్వామిపుష్కరిణీతీరమున మహాలక్ష్మితో కలిసి విహరించుచున్నాడు. వైకుంఠమునుండి తీసికొనిరాబడిన పర్వతమగుటచే దీనికి వైకుంఠాచలమని పేరు – అని భావము. ఈ అర్థము –

**మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్ ।**
**స్వామిపుష్కరిణీ తీరే రమయా సహ మోదతే ॥**
**ఆస్థాయ శ్వేతప్రోత్రిత్వ ముజ్జహార ధరాం యదా ।**

**తద్దైవానాయ్య వైకుంఠాదచలం గరుడేన వై ।**
**కల్పాదావన భగవాన్ లీలారసమహోదధి ॥**
**విహరన్ రమయా సార్థం దరీనిర్ఝరసానుషు ।**
(వరాహ -36-4,5)

అను మొదలగు శ్లోకములవలన స్పష్టమగుచున్నది. ఇదియేకాక **"మలైయే తిరువుడమ్బాయ్"** అనునట్లు భగవానుని దివ్యదేహముగానే ఈ పర్వతమును పెద్దలు అనుసంధించుటచే వైకుంఠమని చెప్పబడు భగవానుడే ఈ పర్వతరూపమును పొందెను అనునదియును ఇచట పొసగును, మఱియు వైకుంఠలోకమునకు చేరినవారు **"యత్ర న శోకో న మోహః"** శోక మోహాదిదుఃఖములు తొలగి, పరమానందమును పొందుచున్నారు - అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. ఈ అనుభవము ఈ పర్వతమునకు చేరి, భగవానుని సేవించువారికిని ఏర్పడుటచే ఈ పర్వతమే వైకుంఠమని చెప్పుటలో లోపము లేదు. ఇట్టి విశేషమగు మహిమను కల్గియుండుటచే ఈ పర్వతమును ఎవరు శ్రద్ధతో నిత్యము సేవింతురో, వారికి స్వల్పప్రయత్నముతోనే వారు కోరిన ఫలములు ఏవి అయినను, అవి అతిశీఘ్రముగా (దొరకుచున్నవి) లభించునని పురాణవచనము.

**అల్పేన తపసాఽభీష్టం సిద్ధ్యత్యస్మిన్ గిరే వరే ।**
**య ఏనం సేవతే నిత్యం శ్రద్ధాభక్తిసమన్వితః ॥**
**జ్ఞానార్థీ జ్ఞాన మాప్నోతి ద్రవ్యార్థీ కనకం బహు ।**
**పుత్రార్థీ పుత్ర మాప్నోతి నృపో రాజ్యం చ విందతి ॥**
**వ్యంగ శ్చ సాంగసద్రూపం పశూన్ ధాన్యాని విందతి ।**
**యం యం కామయతే మర్త్యః తం త మాప్నోతి సర్వదా ॥**
(వరాహ - 36-16నుండి19)

(102) **ఓమ్ ముకుందాయ శ్రీవేంకటేశాయ నమః**
(ముకుందుడనబడు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందు నామములో వైకుంఠలోకము స్మరింపబడినది. ఈ నామములో ఆ వైకుంఠ లోకముప్రాప్తి అనబడు మోక్షమును అనుగ్రహించువాడు ఈ వేంకటేశ్వరుడే అని నిరూపింపబడుచున్నది. ముకుందుడనెడి పదమునకు మోక్షము నిచ్చువాడని నిరుక్తకారులు వ్యాఖ్యానించిరి. వేదములును, దానిని అనుసరించు స్మృతులును, పురాణాదులును శ్రీమన్నారాయణుడే మోక్షమును ఇవ్వగలవాడు, వేఱొక దేవతకు ఈ సామర్థ్యము లేదని తెలుపుచున్నవి. దీనిని శ్రీదేశికులు -

**త్రయ్యంతై రేకకంఠై స్తదనుగుణమనువ్యాసముఖ్యోక్తిభి శ్చ**
**శ్రీమన్నారాయణో నః పతి రఖిలతనుః ముక్తిదో ముక్తభోగ్యః ।**

అనుచు సాయించిరి. విశిష్టాద్వైతసిద్ధాంతానుసారము మోక్షమనగా - వైకుంఠమనబడు



ఉత్తమలోకమును చేరి, సర్వకర్మలును తొలగిన జీవుడు భగవానునితో సమానముగా గుణాష్టక ఆవిర్భావమును పొందినవాడై, దివ్యదంపతులనబడు లక్ష్మీనారాయణులకు పరమప్రీతితో యావజ్జీవమును కైంకర్యమును చేయుటయే. పరిపూర్ణబ్రహ్మానుభవమనగా చిదచిత్తులనబడు ఈ ప్రపంచమంతయు భగవానునకు శరీరభూతమైయున్న స్థితిని, భగవానుడు వారికి ఆధారమైయుండి, వానిని తన అధీనములను కావించుకొని పాలించు స్థితిని, నేరుగా సాక్షాత్కరించుకొని, ఆ బ్రహ్మముయొక్క గొప్పతనమును, కల్యాణగుణచేష్టితాదులను అనుభవించుటయే. ఇట్టి మోక్షమును అనుగ్రహించుటకు మన మనుష్ఠించు భక్తి ప్రపత్తులనబడు ఉపాయములు సర్వాత్మనా తగినవి అని చెప్పుటకు వీలుకాకపోవుటచే పరమపురుషుడే తన నిర్హేతుక కృపతో ఆ మోక్షమును అనుగ్రహించుటచే అతడు ఉపాయమును అగుచున్నాడు. దీనినే శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలోని చివరి శ్లోకములో - **"అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"** అని తెలిపెను. అందుచే మోక్షమును అనుగ్రహింపగల ముఖ్యమైన ఉపాయము శ్రీకృష్ణరూపియగు మన శ్రీవేంకటేశ్వరుడే అగుటచే, ఆ వేంకటేశుని ఇచట ముకుందునిగా అనుసంధించుట యుక్తము.

(103) **ఓమ్ అనంతాయ శ్రీవేంకటేశాయ నమః**
(అనంతరూపియగు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో పరిపూర్ణబ్రహ్మానుభవము స్మరింపబడినది. ఆ పరిపూర్ణబ్రహ్మముయొక్క స్వరూపము ఈ తిరునామములో చెప్పబడుచున్నది. **"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"** అను ఉపనిషద్వాక్యము పరబ్రహ్మను అనంతశబ్దముతో నిర్దేశించుచున్నది. అంతము అనగా పూర్తి - అనగా పరిమితి - అది లేనిది అనంతము. ఒక్కొక్క వస్తువునకును మూడు విధములగు పరిమితులున్నవి. అవి ఏవి? అనగా, చెప్పబడిన వస్తురూపములోనే ఉండుట. చెప్పబడిన కాలములోనే ఉండుట, చెప్పబడిన వస్తురూపములోనే ఉండుట. పరబ్రహ్మ మనబడు జగత్కారణ వస్తువు ఈ విధములగు మూడు పరిమితులు లేకుండ, ఏ దేశములోనైన, ఏకాలములోనైన, అన్ని వస్తురూపములలోను ఉండును, అన్ని దేశములలో నుండుననగా, అది విభువు అని సిద్ధించును. ఇట్టి విభువగు పదార్థము ఆ పరమాత్మ ఒక్కటే. అన్ని కాలములలోను ఉండుననగా అది నిత్యము (నాశరహితము) అని సిద్ధించును. అన్ని వస్తువుల రూపములో నుండుననగా ఆ బ్రహ్మము అన్ని వస్తువుల లోపల ప్రవేశించి, అంతర్యామియైయుండి, ఆ వస్తువులను (చిదచిత్తులను) నియమించుచున్నదని సిద్ధించుచున్నది. ఇది పరమపురుషునకొక్కనికే సాధ్యము. అన్ని వస్తువులకును అతడు ఆత్మయై యుండుటచే, ఆ వస్తువులన్నియు అతనికి శరీరములగుచున్నవి. శరీరమును నిర్దేశించు శబ్దములన్నియు శరీరియగు ఆత్మను కూడ నిర్దేశించును అనుట శాస్త్రజ్ఞులందఱు అంగీకరించిన సత్యమగుటచే, ప్రపంచములోగల వస్తువులను నిర్దేశించు శబ్దములలో దేనిని పల్కినను

అది దాని ప్రమేయమగు ఘటపటాదులను మాత్రమే కాక, దానికి అంతర్యామియగు పరమాత్మను కూడ చెప్పుటచే, సర్వశబ్దవాచ్యుడు పరమాత్మ అగుటచే **"ఘటో బ్రహ్మ పటో బ్రహ్మ"** అని సర్వ శబ్దసామానాధికరణ్య మనబడు స్థితి పరమాత్మకు సిద్ధించుచున్నది. ఇదియే సర్వవస్తువులుగా అతడుండు స్థితి. సర్వపదార్థములుగా నిలచియుండు స్థితి అనగా – సర్వాంతర్యామియైయుండు స్థితియే. కావున దేశపరిచ్ఛేదము, కాలపరిచ్ఛేదము, వస్తుపరిచ్ఛేదమనబడు మూడువిధములైన పరిమితులు లేకుండ, త్రివిధపరిచ్ఛేద రహితుడైయుండుటయే అనంతశబ్దార్థము. ఇట్టి పరబ్రహ్మమును అనుభవించుటయే పరిపూర్ణ బ్రహ్మానుభవము. ఈ అనంతత్వమను గుణము భగవానుని దివ్యాత్మస్వరూపమునకు చెందినది. ఇట్టి పరబ్రహ్మము మన వేంకటేశ్వరుడే (శ్రీమన్నారాయణుడే) అనుటను భగవద్రామానుజులు తమ శ్రీభాష్యారంభమున

**శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే**

**భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా ।** అనుచు అనుగ్రహించిరి. ఇచట **"ముకుందాయ"** అను పూర్వనామము చేత, **"అనంతాయ"** అనెడి ప్రస్తుతనామముచేతను భగవానునకే అసాధారణముగా కీర్తింపబడు మోక్షప్రదత్వము, జగత్కారణత్వము అనబడు రెండు గుణములును అనుసంధింపబడినవిగా తలచుట మిక్కిలి ఉచితము. అవి రెండును భగవానునకు దయాదేవిచే ఏర్పడినవి అనెడి తత్త్వమును దేశికులు దయాశతకములో

**జగజ్జన్మస్థేమప్రళయరచనాకేళరసికో**
**విముక్త్యైకద్వారం విఘటితకవాటం ప్రణయినామ్ ।**
**ఇతి త్వయ్యాయత్తం ద్వితయ మవధీకృత్య కరుణే**
**విశుద్ధానాం వాచాం వృషశిఖరినాథః స్తుతిపదమ్ ॥** అని నిరూపించిరి.

(104) **ఓమ్ విరించాభ్యర్థితానీతసౌమ్యరూపాయ శ్రీవేంకటేశాయ నమః**

(చతుర్ముఖునిచే ప్రార్థింపబడిన, సౌమ్యమగు రూపమును పొందిన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వనామములో బ్రహ్మస్వరూపము తెలుపబడినది. ఆ పరిపూర్ణ బ్రహ్మమే ఒకానొక సమయమున చతుర్ముఖుని ప్రార్థనను అనుసరించి ఈ తిరుమలలో మిక్కిలి సౌమ్యమైన రూపములో శ్రీవేంకటేశ్వరుడుగా సేవను అనుగ్రహించుచున్నాడు అను విషయము ఇందు చెప్పబడుచున్నది.

ఈ తిరునామమునకు ఆధారమైన చరిత్ర స్కాందపురాణములో మార్పుతో 10వ అధ్యాయములో నున్నది. ఇదే చరిత్ర కొంచెము మార్పుతో వామనపురాణములోకూడ కలదు. శంకుడనెడి రాజు ఈ వేంకటాచలములో స్వామిని సాక్షాత్కరింప చేసికొనవలెనని తలచి, చిరకాలము తపస్సు చేసెను. అదే కాలములో పలువురు మహర్షులతో కలసి అగస్త్యమహర్షియు అదే ఉద్దేశ్యముతో ఈ కొండపై స్వామిపుష్కరిణీతీరమున



తపస్సుచేయుచుండెను. ఒకనాడు వీరి తపస్సువలన ప్రీతిని పొందిన భగవానుడు ప్రత్యక్షమై, వారికి నేరుగా సేవను అనుగ్రహించెను. అపుడు ఈ విషయమును గ్రహించిన చతుర్ముఖుడు, శివుడు మొదలగువారు భగవానుని దర్శించుటకు అచటకు వచ్చి చేరిరి. అపుడు ఆస్వామి మిక్కిలి ఉగ్రమైన రూపముతో, విశ్వరూపములో సాక్షాత్కరించెను. ఆ ఉగ్రరూపమును దర్శించి చతుర్ముఖాది దేవతలు భీతిల్లి, వణకిరి. ఆ రూపము అనేకశిరస్సులతో, అనేక హస్తములతో, దంష్ట్రలతో, ముఖములనుండి తీవ్రమైన అగ్నిజ్వాలలను వెలువరించుచుండెను. అపుడు మెల్లగా చతుర్ముఖుడు భగవానుని వద్దకు చేరి, విశేషముగా స్తుతించి, ఆ ఉగ్రరూపమును విడచి, సౌమ్యమై, మిక్కిలి అందమైనదగు నీ రూపమును మాకు దర్శింపజేయవలెనని వేడెను. భగవానుడును చతుర్ముఖాదులు చేసిన ఆ ప్రార్థనను అంగీకరించి, మిగుల సౌమ్యమగు రూపములో, ఇపుడు వేంకటాచలములో వేంకటేశ్వరుడు అర్చారూపమున ఎంత సౌందర్యముతో సేవను అనుగ్రహించుచున్నాడో, ఆ రీతిలోనే సేవను అనుగ్రహించెను. పిమ్మట వారు వారు కోరిన వరములను ప్రసాదించి, అంతర్ధానమయ్యెను. ఈ చరిత్రమే విస్తారముగా స్కాంద పురాణములో వర్ణింపబడినది.

(105) **ఓమ్ సువర్ణముఖీస్నాతమనుజాభీష్టదాయినే శ్రీవేంకటేశాయ నమః**

(సువర్ణముఖినదిలో స్నానము చేసినవారికి అన్నివిధములైన కోరికలను అనుగ్రహించు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందునామములో బ్రహ్మదేవుని ప్రార్థనకు అంగీకరించి, భగవానుడు సౌమ్యరూపమును పొందిన తీరు స్కాందపురాణములో 10వ అధ్యాయములో తెలిపిన ప్రకారము వివరింపబడినది. ఈ నామముతో ఆ అధ్యాయములో అనంతరముగల చరిత్ర తెలుపబడుచున్నది.

పూర్వము, భగవానుడు సౌమ్యరూపమును పొందగానే, అచట భగవత్సేవ కొఱకు వచ్చినవారికందఱకు వారు వారు కోరిన వరములను ఇచ్చినట్లు తెలుపబడినదికదా! ఆ సందర్భములో బ్రహ్మకు పిమ్మట అగస్త్యుని చూచి – "ఓ అగస్త్యమహర్షీ! నీవు చిరకాలము ఈ పర్వతముపై అతికఠినమైన తపస్సును చేసితివి. ఆ తపస్సుకు నేను మిక్కిలి మెచ్చితిని. నీకు కావలసిన వరములను అడుగుము. ఇచ్చెదను" అని భగవానుడనెను. అపుడు అగస్త్యుడు "ప్రభూ! నాకు నీ పాదారవిందములలో అచంచలమగు భక్తి ఒక్కొక్కటి మాత్రమే తప్ప వేఱేమియు వద్దు. అయినను, ఒక విషయమును మాత్రము విన్నవింతును. అది ఏమనగా – దేవతల ప్రార్థనకు అంగీకరించి, సువర్ణముఖి అనెడి నదిని నేను నీ పర్వతమునుండి ప్రవహించునట్లు తపస్సుద్వారా సాధించితిని. ఈ నదిని నీవు పరిపూర్ణముగా కటాక్షించి, అనుగ్రహింపవలసినది ఎట్లు అనగా – ఇందు స్నానమును చేసి, నిన్ను ఎవరు సేవింతురో, వారు కోరిన ఫలములు ఏవి అయినను వానిని నీవు

అనుగ్రహింపవలెను. మఱియు, రాబోవు కలియుగమున తక్కువ ఆయుస్సు, తక్కువ జ్ఞానము, తక్కువ శక్తిని కల మానవులు నిన్ను తపస్సు, వ్రతములు మొదలగు కఠిన మార్గములద్వారా దర్శించుట దుర్లభము. అందుచే నీవే ఈ సౌమ్యరూపముతో ఈ కొండపై నిత్యసాన్నిధ్యమును కల్గియుండి, వారికి దర్శనమిచ్చి, సత్ఫలములను ప్రసాదించుము. ఇదియే నా కోరిక" అని ప్రార్థించెను. భగవానుడును ఆ మహర్షి ప్రార్థనను అంగీకరించి, ఆవిధముగానే చేయుదునని మాట ఇచ్చి, సువర్ణముఖికి నీవు కోరినట్లు విశేషమైన మహిమకలదని, అందు స్నానము చేయువారికి సర్వవిధములైన సిద్ధులు కలుగనని వరమిచ్చెను. సువర్ణముఖరి అను ఆ నదికి పేరు ఏర్పడుటకు కారణము కూడ ఆ స్కాందపురాణములోనే తెలుపబడినది. బంగారమువలె లోకములోని వారిచే పొగడబడతగినదియై యుండుట చేతను, ఈ నది అగస్త్యునిచే భూలోకమున కొనిరాబడినపుడు గొప్పప్రభావముతో అన్ని దిక్కులయందు గొప్ప శబ్దమును కల్గించుచు ప్రవహించుట చేతను, దీనికి సువర్ణము కరి అను పేరు కల్గినది.

ఈ విషయము 39వ నామమగు – **"అగస్త్యభ్యర్థితాశేషజనదృగ్గోచరాయ"** అనెడి నామములోకూడ తెలుపబడినది.

(106) **ఓమ్ హలాయుధజగత్తీర్థసమస్తఫలదాయినే శ్రీవేంకటేశాయ నమః**
(హలాయుధతీర్థములో స్నానము చేసినవారికి లోకములోని అన్ని తీర్థములలో స్నానము చేయుటవలన ఏవిధమైన ఫలము లభించునో, ఆ ఫలములను ఇచ్చు శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

ముందునామములో సువర్ణముఖి అనెడి పుణ్యనదిలో స్నానము చేసిన వారి కోరికలను ఇచ్చువాడుగా శ్రీవేంకటేశుడు తెలుపబడగా, ఈ తిరునామములో అట్టి వేఱొక పుణ్యతీర్థముయొక్క మహిమ తెలుపబడుచున్నది.

పూర్వము ఒకటి రెండు నామములో విన్నపించిన రీతిలోనే ఇందుకూడ ఏదయిన పాఠభేదము కలదేమోనని తోచుచున్నది. ఇపుడున్న వాగ్విన్యాసమునకు అర్థమును చెప్పుట సులభము కాదనుటను విద్వాంసులు గ్రహింతురు. పూర్వము విన్నపింపబడిన ఈ తిరునామముయొక్క అర్థము తాత్పర్యార్థమేనని భావింపవలెను. బ్రహ్మపురాణమునకు చెందిన వేంకటాచలమాహాత్మ్యములో 5వ అధ్యాయములో ఈ వేంకటాచలములోనున్న మిక్కిలి ముఖ్యములైన 68వ తీర్థముల పేర్లను తెల్పునపుడు –

**తతః పంచాయుధం తీర్థం తన్మధ్యే చ హలాయుధమ్ ।**
**..........దశావతారతీర్థం చ హాలాయుధ మతః పరమ్ ॥**

అను సందర్భములలో హలాయుధతీర్థమని, హాలాయుధతీర్థమనియు రెండు తీర్థములు చెప్పబడినవి. ఇది తప్ప, ఆ తీర్థములకు ప్రత్యేకమైన రీతిలో ఏ మాహాత్మ్యమును అచట వర్ణింపబడలేదు. కాని, ఈ కొండలో 66కోట్ల తీర్థములున్నవనియు, వానిలో 1008



తీర్థములు ముఖ్యమైనవి అనియు, వానిలో కూడ 68 తీర్థములు జ్ఞానవైరాగ్యములను ప్రసాదించుటచే చాల ముఖ్యమైనవి అనియు తెలుపు ప్రకరణములో ఈ హలాయుధ తీర్థముయొక్క పేరు తెలుపబడియుండుటచే దీనికి అధికమైన మహిమ కలదని ఏర్పడుచున్నది. అందుచే, ఇందు స్నానము చేసినచో లోకములోనున్న తీర్థములన్నిటి యందు స్నానము చేసిన ఫలము కల్గుననుట ఉపపన్నమే. ఇదియేకాక, హలాయుధుడనబడు బలరాముడు లోకములోనున్న తీర్థములన్నిటిలో స్నానము చేయుటచే, ఆ స్వామికి సమస్త ఫలములను అనుగ్రహించినవాడు మన వేంకటేశ్వరుడు అనియును ఈ తిరునామమునకు అర్థమును గ్రహింపవచ్చును. తిరుచ్చుకనూరు (తిరుచానూరు)లో శుకమహర్షి తీర్థయాత్రగా వేంచేసినట్లు పద్మపురాణాంతర్గతమైన వేంకటాచలమాహాత్మ్యములో కలదు. ఆ కథను కూడ చేర్చి, ఇచట అనుసంధించినచో ఆ బలరాముడు పుణ్యతీర్థయాత్రను చేయునపుడు ఈ కొండకు వచ్చి, ఈ కొండపైనున్న తీర్థములో నీరాడి, సిద్ధిని పొందినందున, అతడు స్నానము చేసిన తీర్థమునకు హలాయుధతీర్థమని, అతనికి సర్వపుణ్యతీర్థస్నానఫలములను శ్రీనివాసుడే ఈ పర్వతముపై అనుగ్రహించెననియును చెప్పవచ్చును.

(107) **ఓమ్ గోవిందాయ శ్రీవేంకటేశాయ నమః**
(గోవిందరూపియైన శ్రీవేంకటేశుని శరణు పొందుచున్నాను)

పూర్వపునామములో హలాయుధుడనబడు బలరాముడు స్మరింపబడగా, ఇచట ఆ అవతారమునకు పిమ్మట, సంభవించినది, ఆ బలరాముని కూడనేయుండి, **"క్షీరం శర్కరయా"** అనునట్లు శ్రీదేశికులు రచించిన రీతిలో పలు లీలను ప్రదర్శించినవాడగు శ్రీకృష్ణుని విశిష్టనామమగు ఈ తిరునామము అనుసంధింపబడుచున్నది.

గోవింద శబ్దము **"గాం విందతి"** – భూమిని పొందినవాడను అర్థమున వరాహస్వామిని కూడ తెలపును. ఆ అవతారములోనేకదా పాతాళమునందు మునిగిపోయిన భూమిని బయటకు ఎత్తినాడు స్వామి. ఆవిధముగానే ఇది శ్రీకృష్ణునికూడ నిర్దేశించును. అపుడు, పశువులను (గోవులను) రక్షించువాడని అర్థము. శ్రీదేశికులు యాదవాభ్యుదయములో–

**తిరోహితా మంభసి విందతా గాం పూర్వంత్వయా పోత్రివరేణ లబ్ధా ।**
**నిరుక్తనిష్ణాతకృతాభ్యనుజ్ఞా వ్యక్తిం పున ర్యాతు శుభా త్వదాఖ్యా ॥**

సముద్రములో మునిగిన భూమిని బయటకు తీసిన సమయములో వరాహరూపియైన నీచే పొందబడిన, గోవిందుడనెడి నీ తిరునామము తిరిగి ఇపుడు (గోవర్ధనపర్వతమును ఎత్తి, గోపాలకులను, పశువులను కాచిన సమయములో) ప్రకాశమును పొందినది–అని దేవేంద్రుడు కృష్ణుని వేడి, గోవిందుడను తిరునామముతో పట్టాభిషేకమును చేసెను – అని అనుగ్రహించిరి.

దీనినే గోదాదేవియు, **"కూడారై వెల్లుమ్ శీర్ గోవిందా"** అనెడి పాశురములో తనతో కూడనివాడగు దేవేంద్రుని తనకు శరణాగతి చేయునట్లు చేసి, అతనిచే గోవింద పట్టాభిషేకమును జరిపించుకొనినవాడు – అనియు తెల్పినది.

కావున గోవిందపదము వరాహస్వామిని, శ్రీకృష్ణుని తెల్పునది అని తేలినది. వేంకటాచలములో ఈ రెండుమూర్తులను కలిపి మనము సేవించుచున్నాము. ఈ కొండ వరాహస్వామిది గానే ఉండి, వరాహక్షేత్రమను పేరును పొందినది. పిమ్మట వేంచేసిన శ్రీనివాసుడు శ్రీకృష్ణుడే అనుట మన సంప్రదాయమునందలి పెద్దల అభిప్రాయము. దీనికి ముఖ్యకారణము భగవద్గీతలోని చరమశ్లోకముయొక్క అర్థమును తన శ్రీహస్తములలోని ముద్రలతో వ్యాఖ్యానించుచు, ప్రకాశించుటయేనని పలుమార్లు ఇంతకుముందే చెప్పబడినది. ఇంతవరకును ఈ తిరుపతికి వచ్చు యాత్రికులు అందఱు గోవిందా! గోవిందా! అని పల్కుచు కొండనెక్కి, భగవానుని సేవించుచున్నారు. క్షేత్రాధిపతియగు వరాహస్వామిని, శ్రీనివాసుని కలిపి అనుసంధించుటయే ఇది.

ఇదియేకాక, భాగవతులలో ఉన్నతస్థానమును అలంకరించు ప్రహ్లాదుడును తన తండ్రివలన తనకు ప్రాణాపాయము సంభవించినపుడు –

**నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ ।**
**జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః ॥**

అనుచు గోవిందనామమును ఉచ్చరించి, బాధను తొలగించుకొనెను. అట్లే ద్రౌపదియును–

**శంఖచక్రగదాపాణే ద్వారకానిలయాచ్యుత ।**
**గోవింద పుండరీకాక్ష! రక్ష మాం శరణాగతామ్ ॥**

అనుచు గోవిందుని శరణాగతి చేసి, తనకు రాజసభలో దుశ్శాసనునివలన ఏర్పడిన గొప్ప ఆపదను పోగొట్టుకొనెను.

ఈరీతిలోనే క్షత్రబంధువనెడి ఒక క్షత్రియాధమునకు ఒక ఉత్తమమైన జన్మము, ఆచార్యసంబంధము, తన్మూలముగా మోక్షపర్యంతమైన శ్రేయస్సును ఈ గోవింద శబ్దముచే ఏర్పడినదని విష్ణుధర్మములోని 97వ అధ్యాయములో తెలుపబడిన చరిత్రను తొణ్డరడిప్పొడి యాழ్వార్లు తిరుమాలైలో **"మొయ్‌త్తవల్ వినైయిల్ నిన్ఱు మూన్ఱెழுత్తుడైయ పేరాల్ కత్తిరబన్ధు మన్ఱే పరాఙ్గతి కణ్డుకొణ్డాన్"** అని సాయించిరి. గోదాదేవియు తన గొప్ప ప్రేమను శ్రీగోవిందునకే అర్పించి, అతనికి కైంకర్యమునకు చేయవలెనని ఎల్లప్పుడు వేడినది.

**కొమ్మైమ్ములైకళ్ ఇడర్‌తీర కోవిన్దఱ్కోర్ కుఱ్ఱేవల్**
**ఇమ్మైప్పిఱవి శెయ్యాదే ఇవిప్పోయ్ చ్చెయ్యుమ్ తవమ్‌తాన్ ఎన్ ।**

(నాయ్చ్చి – 13-2)

**ఇఱ్ఱైప్పఱై కొళ్వాన్ అన్ఱుకాణ్ కోవిన్దాఎఱ్ఱైక్కుమేழேழு పిఱవిక్కుమ్**



**ఉన్దన్నోడుఱ్ఱోమే యావోమ్ ఉనక్కే నామాళ్ శెయ్‌వోమ్"** (తిరుప్పావై – 29) అను సూక్తులు ఇచట స్మరణీయములు. కావున, అనాదిగా ఇప్పటివరకు భక్తులందఱిచే గొప్ప భక్తితో అనుసంధింపబడి, వారు వారు కోరిన ఫలములను అనుగ్రహించునది, ఈ గోవిందశబ్దమగుటచే, దానికి అర్చాసమాధిలో ముఖ్యార్థమగు శ్రీనివాసుని, క్షేత్రాధిపతి యగు శ్రీవరాహమూర్తి శరణు పొందుచున్నాను – అని ఈ నామభావము.

(108) **ఓమ్ శ్రీనివాసాయ వేంకటేశాయ నమః**
(శ్రీనివాసుడనెడి వేంకటేశుని శరణు పొందుచున్నాను)

విభవావతారమును నిర్దేశించు గోవిందుడను తిరునామము పూర్వము ప్రస్తుతముకాగా, శ్రీవేంకటేశుడను అర్చావతారమునకే అసాధారణమగు శ్రీనివాసనామము చివరగా ప్రస్తుతింపబడుచున్నది. శ్రీనివాసుడనెడి పదమునకు మహాలక్ష్మి ఒక క్షణము కూడ విడువకుండ ఎల్లప్పుడు ఏ భగవానునివద్ద నివసించునో, ఆ స్వామి – అని భావము. ఈ విషయమును వివరించు యోగరూఢమైన ఈ పదము శ్రీవేంకటేశ్వరుని మాత్రమే నిర్దేశించును. వేంకటేశ్వరునకు ఎన్నియో పేర్లున్నను ఈ శ్రీనివాసుడను తిరునామమునకు ప్రత్యేకమైన గౌరవము కలదు. ఉపాయోపేయభూతులగు దివ్యదంపతులను ఒకే తత్త్వమా! అనునట్లు చేర్చి తెలుపు శబ్దమిది. రెండు తత్త్వములకు వాచకమగు శబ్దము ఒకటిగానున్నట్లు, వాచ్యుడగు పరమపురుషుడును ఒకే రూపములో (వక్షఃస్థలమున లక్ష్మిని దాల్చినవాడై) సేవను అనుగ్రహించుచున్నాడు. పూర్వనామములచే అనుసంధింపబడిన మహత్త్వములన్నిటికిని ముఖ్యకారణము ఈ స్వామి శ్రీనివాసుడై యుండుటయే. అందుచేతనే ఈ నామము చివరలో కూర్పబడినది.

శ్రీనివాసుడనెడి ఈ పద్మావతీవక్షస్కనే మోక్షమునకు ఉపాయముగా, ఉపేయముగా, ప్రపన్నజనసంతానకూటస్థులగు నమ్మాழ்వార్లు అనుసంధించిరి.

**అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱలర్‌మేల్‌మఙ్గై యుఱైమార్బా**
**నికరిల్ పుకழாయ్ యులకమ్ మూన్ఱుడైయాయ్ యెన్నై యాழ்వానే**
**నికరిలమరర్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే**
**పుకలొన్ఱిల్లా వడియేన్ ఎన్నడిక్కీழ் అమర్న్దు పుకున్దేనే**

(తిరువాయ్ – 6-10-10)

**ఒழிవిల్ కాలమెల్లామ్ ఉదనాయ్ మన్ని**
**వழுవిలావడిమై శెయ్యవేణ్డుమ్ నామ్**
**తెழிకురలరువి త్తిరువేఙ్గడత్తు**
**ఎழிల్‌కొళ్ శోది యెన్దైతన్దై తన్దైక్కే**

ఈ నమ్మాழ்వార్ల శ్రీసూక్తులను వ్యాఖ్యానించునట్లు భగవద్రామానుజులు తమ శ్రీభాష్యారంభ శ్లోకములో ఈ శ్రీనివాసుడే ఉపనిషత్తులలో మోక్షముకొఱకు, మిగిలిన

పురుషార్థముల కొఱకును ఉపాస్యముగా చెప్పబడిన పరబ్రహ్మము అని వివరించు రీతిలో **"శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే"** అని నుడివిరి. కావున నమ్మాళ్వార్లు శరణు పొందిన పద్మావతీ వక్షస్కుడును, ఔపనిషదమగు పరబ్రహ్మమును ఈ శ్రీనివాసుడే అని చెప్పబడినట్లయినది. దీనినే శ్రీదేశికులును –**"ఊచే నాథం శరణ్యం శ్రుతిశతవిదితం వేంకటేశం శఠారిః"** అనుచు తాత్పర్యరత్నావళిలో అనుగ్రహించిరి. ఉపనిషత్తులకు అర్థమును తెలుపవలసిన రీతిని సంగ్రహముగా తెలుపునట్టి శ్రీరామానుజుల వేదార్థసంగ్రహమును అనుసరించి, పలు ఉపనిషత్తులకు భాష్యమును అనుగ్రహించిన రంగరామానుజమునివర్యులును ఒక్కొక్క ఉపనిషత్తు యొక్క భాష్యప్రారంభములో –

**"అతసీగుచ్ఛసచ్ఛాయ మంచితోరఃస్థలం శ్రియా ।**
**అంజనాచలశృంగార మంజలి ర్మమ గాహతామ్ ॥**

అనుచు మన శ్రీనివాసుని సేవించి, అతడే ఉపనిషత్ప్రతిపాద్యుడగు పరమపురుషుడనుటను వ్యక్తము చేసి, గ్రంథారంభమొనర్చిరి.

ఇదియేకాక, మహాలక్ష్మి **"శ్రీః"** అనెడి తన తిరునామమునకు తగినట్లు (1)జీవులచే ఆశ్రయింపబడునదియై, (2)మనకొఱకు భగవానుని ఆశ్రయించునదియై, (3)మన కొఱతలను (కోరికలను) విని, (4)వానిని భగవానుని సన్నిధిలో నివేదించునదియై, (5)భక్తుల పాపములను నశింపజేయునదియై, (6)వారికి కైంకర్యపర్యంతమగు గుణపరిపాకమును కల్గించునదియై యున్నది అని ఆఱు విధములైన వ్యుత్పత్తులను ఆధారముగా చేసికొని, ఆగమశాస్త్రములు వివరించుచున్నవి. ఇట్టి పరమోదార గుణములనుకల మహాలక్ష్మియొక్క నిత్యసాన్నిధ్యమును కల్గియుండుటచేతనే మన వేంకటేశ్వరుడు, తాను శ్రీనివాసుడైయుండుట మాత్రమేకాక, ఆశ్రితులకు అందఱికినికూడ సర్వవిధసంపదలకు ఆస్పదము కావించుచున్నాడు. ఈ విషయము ప్రతిదినము మహోత్సవ సమయమువలె కోట్లాది భక్తులు వచ్చి, తమ కోరికలను పొంది, కృతార్థులగుట అందఱును ఈ కొండపై సాక్షాత్తు దర్శించుటచే, దానిని వివరింపనవసరములేదు.

ఈ అష్టోత్తరశతనామావళిలో మొదటినామము **"వేంకటేశః"** అనునది. చివరిది **"శ్రీనివాస"** అనునది. మొదటి నామముచే భక్తుల సర్వపాపములను పోగొట్టు స్వభావము, చివరినామముచే సర్వ అభయములను ఇచ్చు స్వభావము, తానే ఫలమై నిలచియున్న స్థితియు తెలుపబడినది. భగవానుని ఈ రెండు అవస్థలను వివరించునవియే మిగిలిన అన్ని నామములును – అని చెప్పవచ్చును.

ఇట్లు సర్వవేదాంతశాస్త్రములందు పొగడబడువాడు, దయాస్వరూపిణియగు శ్రీమహాలక్ష్మిచే అలంకరింపబడిన వక్షఃస్థలమును కలవాడును అగు శ్రీనివాసుని శరణు పొందుచున్నాను – అని ఈ తిరునామముయొక్క భావము. ఈ 108 తిరునామములలో – విష్ణుః, రామః, పద్మనాభః, కృష్ణః, అబ్ధికన్యాపరిష్వక్తవక్షాః, అనంతశిరాః, అనంతాక్షః,



అనంతచరణః, దామోదరః, నీలమేఘనిభః, వాసుదేవః, హరిః, శంఖచక్రవరానమ్రల సత్కరతలః, నిత్యయౌవనమూర్తిః, కూర్మమూర్తిః, విభుః, శ్రీమన్నారాయణః, మత్స్యరూపః, పాండవాదిప్రహర్తా, శ్రీకరః, సాలగ్రామనివాసః, మధుఘాతీ, బలభద్రః, త్రివిక్రమః, మహాన్, హృషీకేశః, అచ్యుతః, క్షీరాబ్ధినాథః, ముకుందః, అనంతః, గోవిందః – అనెడి 31 తిరునామములుతప్ప మిగిలినవి శ్రీవేంకటేశునకు అసాధారణములు. ఇవి ఇంచుమించుగా వేంకటాచలమాహాత్మ్యములోని ఆయా సందర్భములను అనుసరించి, శ్రీనివాసునకే అన్వయించునట్లు వ్యాఖ్యానింపబడినవి. భగవానుని కల్యాణగుణములను ఆవిష్కరించు ఆ స్వామి తిరునామములచే అతనిని స్తుతించుట, అర్చించుటయే అన్ని ధర్మములలో ఉత్తమ ధర్మము అని ధర్మపుత్రునకు భీష్మాచార్యుడు ఉపదేశించెను. అందుచే శ్రీవేంకటేశుని పై తిరునామములతో అతనిని స్తుతించి, అర్చించి, అందఱును పరమక్షేమమును పొందవలయుననునదియే ఈ నామావళి ఉపదేశించిన మహర్షియొక్క పరమపురుషునియొక్క అభిప్రాయయము.

**శ్రియఃకాంతాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।**
**శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥**
**మంగళాశాసనపరై ర్మదాచార్యపురోగమైః ।**
**సర్వై శ్చ పూర్వై రాచార్యైః సత్కృతాయాఽస్తు మంగళమ్ ॥**
**శ్రీవేంకటాచలాధీశం శ్రియాఽధ్యాసిత వక్షసమ్ ।**
**శ్రితచేతనమందారం శ్రీనివాస మహం భజే ॥**

**శ్రీవేంకటేశాష్టోత్తరనామావళీవ్యాఖ్యానము సంపూర్ణము**

